అట్టలోపలి వైపున అచ్చు వేసిన శిల్ప చిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమబుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవికన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది.

—నాగార్జునకొండ క్రీ.శ. 2వ శతాబ్దం.
—జాతీయ పురావస్తుశాల న్యూఢిల్లీవారి సౌజన్యంతో.

*KAZI NAZRUL ISLAM* by Gopal Haldar, Telugu translation by Chaganti Tulasi. Sahitya Akademi, New Delhi. (1991)।


ప్రథమ ముద్రణ 1991

ISBN 81 7201 1016

సాహిత్య అకాదెమీ
ప్రధాన కార్యాలయం :
రవీంద్రభవన్, 35 ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ–110 001
విక్రయ విభాగం :
'స్వాతి' మందిర్‌మార్గ్, న్యూఢిల్లీ–110 001

ప్రాంతీయ కార్యాలయాలు :
29 ఎల్డామ్స్‌రోడ్, తేనాంపేట, మద్రాస్ - 600 018.
బ్లాక్ V బి రవీంద్ర స్టేడియమ్, కలకత్తా - 700 029
172, ముంబయ్ మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్
దాదర్, బొంబాయి–400 014.
ఏ. డి. ఏ. రంగమందిర, 109 జె.సి. రోడ్, బెంగళూరు-560 002

శివాజీ ప్రెస్, సికింద్రాబాద్ - 3.

# ముందు మాట

ఇరవయ్యో శతాబ్దంలోని మహోన్నతులైన భారతదేశపు సృజనాత్మక కళాకారుల్లో ఒకరైన కాజీ నజ్రుల్ ఇస్లాం కావ్యరచనలు, గద్యరచనలు, గేయాలు అన్నీ బెంగాలీ భాషలోనే ఉన్న కారణంచేత బెంగాలీ భాషేతరులకి నజ్రులుతో ప్రత్యక్ష పరిచయం లేదు. అటువంటి పాఠకులకి నజ్రుల్ని పరిచయం చేయటానికి, వినమ్రతతో చేసిన ప్రయత్నమే ఈ పుస్తకం. ఇందులో నజ్రుల్ యావత్తు జీవిత వృత్తాంతమూ లేదు. కళాకారుడిగా ఆయన చేసిన కృషిని విస్తారంగా విమర్శనాత్మకంగా విలువకట్టి అంచనా వెయ్యటమూ జరగలేదు. ఈ విషయం తేటతెల్లమే. ఉన్న పరిధిలో ఒక పరిచయరూపంలో కాజీ నజ్రుల్ ఇస్లాం జీవితమూ, కృషీగురించి సంక్షేపంగా ఇందులో చెప్పటానికి ప్రయత్నం చేయటం జరిగింది. అతనికాలపు నేపథ్యంలో చూస్తేనే ఏ కళాకారుడైనా వ్యక్తిగానూ, కళాకారుడిగానూ తన వాస్తవిక మహత్త్వ రూపంలో కనపడతాడు. అందుచేత నజ్రుల్ కాలాన్ని ఆయా సందర్భాలని దృష్టిలో పెట్టుకుని రాయటం జరిగింది. ఇలా రాసే ప్రయత్నంలో నేను వస్తుపరమైన దృష్టిని స్వీకరించాను. సందేహాస్పదమైన విషయాలను స్వీకరించటంలోనూ, త్యజించటంలోనూ జాగరూకత వహించాను. సాధ్యమైనంతవరకూ తటస్థంగా ఉండి నజ్రుల్ రచనల గురించి, సాధించినదాన్ని గురించి చర్చించాను. బెంగాలీ భాషేతరులకి నజ్రుల్ గురించి, బెంగాలీ సంగీత సాహిత్యాల్లో ఆయన స్థానం గురించి నాకున్న చిన్న పరిధిలో తెలియచెయ్యటం, బోధపర్చటం నా ముఖ్య ఉద్దేశంగా పెట్టుకున్నాను. కొద్దిమంది పాఠకులైనా కవి రచించిన కవితలను, పాటలను మూలంలో చూద్దామని ప్రత్యక్షసంబంధాన్ని ఏర్పరచుకోటానికి అవకాశాలకోసం అన్వేషిస్తే నా ఈ ఉద్దేశం నిజంగానే సఫలం అవుతుంది. వాస్తవానికి మూల రచనలకి ఏదీ ప్రత్యామ్నాయం కాదు, ఎంత సమర్థవంతమైన అనువాదమైనా సరే. అలాంటప్పుడు ఏ మాత్రం ఉత్తేజాన్ని కలిగించలేని ఈ స్కెచ్ గురించి చెప్పేదేముంది ?

అనువాదంగా లెక్కగట్టడానికి వీలులేకున్నా బెంగాలీ మూలంలోని పంక్తుల్ని ఉటంకిస్తూ ఇంగ్లీషులో వాటి అర్థం చెప్పడంకూడా అవసరం అని

నాకు అనిపించింది. మూలంలో చదవడానికి ఇదరని సాహిత్య రచనలగురించి కనీసం అవి వేటి గురించి రాయబడ్డాయో తెలుసుకోవాలని పాఠకులు అనుకుంటారని నా అభిప్రాయం. లిప్యంతరీకరణంలో మూలం, దాంతోపాటు ఇంగ్లీషులో వాటి భాషాంతరీకరణం పాఠకుల జిజ్ఞాసని కొంతవరకు సంతుష్టపరచగలవు.

కాజీ నజ్రులు ఇస్లాం జీవితచరిత్రలు, ఆయనమీద రాసిన విమర్శనాత్మక గ్రంథాలు- సంఖ్యలో బెంగాలీ భాషలో పెరుగుతున్నాయి. వాటిలో కొన్ని పుస్తకాలు సమర్థవంతంగా రాయబడినవి ఉన్నాయి. అయితే వాటిలో శ్రీ వసుధ చక్రవర్తి సమర్థవంతంగా, సంక్షిప్తంగా ఇంగ్లీషులో రచించిన పుస్తకాన్ని (NBT ప్రచురితం) మినహాయిస్తే మిగిలినవి అన్నీ రమారమి బెంగాలీ భాషలోనే ఉన్నాయి. నేను చాలామంది రచయితలకి ఋణపడ్డాను. విశేషించి ఇద్దరు రచయితలకు. శ్రీ చక్రవర్తికాక - ఈయన పుస్తకం బెంగాలీలోకూడా లభ్యం -- కామ్రేడ్ ముజఫర్ అహమ్మదు ఒకాయన — వాస్తవాల విషయంలో అందరికన్నా ఎక్కువగా ఈయనమీద ఆధారపడవచ్చని నా అభిప్రాయం. రెండవవారు - జనాబ్ అజహరుద్దీను ఖాను ; ఈయన నజ్రులు రచనల గురించి తెలుసుకోవడానికి నాకు మూలాధారం. వీరందరికీ, నజ్రులుమీద రాసిన తదితర రచయితలందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

మొదట, ఈ చిన్న ప్రయత్నంలోని లోటుపాట్లకు- వాటి గురించి సంపూర్ణమైన అవగాహన నాకు ఉంది - ఆ తర్వాత సాహిత్య అకాడమీ వారు ఈ పుస్తకాన్ని రాసే పని అప్పచెప్పిన తర్వాత దానిని రాయడంలోనూ, ఆ పిమ్మట ప్రెస్సుకోసం టైపుప్రతిని సిద్ధం చేయడంలోనూ కూడనంత జాప్యం జరిగినందుకూ సాహిత్య అకాడమీ వారికి మనసారా క్షమాపణలు తెలియచేస్తున్నాను.

గోపాల్ హాల్దార్

26 మే 1972

# సజీవ వారధి

కాజీ నజ్రులు ఇస్లాం లోకానికి దరమారమి ఇహ చనిపోయినట్టే. శారీరక దృష్ట్యా ఆయన జీవించే ఉన్నారు. తన 74వ ఏట, ఈ 1973 లోనూ ఆయన తన వయస్సుకన్నా ఎక్కువ వృద్ధులుగా కనిపించటంలేదు. కాని విధి పరిహాసం వల్ల దుర్దమశక్తికల ఈ విద్రోహి కవి గత ముప్పైఏళ్ళబట్టి ఉన్మాదపు అంధ కారంలో జీవిస్తున్నారు. ఈ కటిక చీకటిలోనూ, అసంకల్పిత మౌనంలోనూ ఏం మార్పు రాలేదు. అయినా ఈ గడిచిన సంవత్సరాల్లో అంత చైతన్య రహిత మైన స్థితిలోనూ ఆయన కాలానికీ ప్రజలకీ మధ్య ఓ సజీవ వారధి అయ్యారు. ఉదాహరణకి బెంగాలులో కళాసాహిత్యాలు ఓ కొత్త యుగంలోకి ప్రవేశించాయి. అయినా ఇప్పటికీ ప్రేమతో కృతజ్ఞతతో, ఆరాధనాభావంతో నజ్రులునుంచి ప్రేరణ పొందుతూనే ఉన్నారు. రాజకీయంగా రెండు సర్వసత్తాక ప్రాంతాల్లోకి బెంగాలీ ప్రజలు — నజ్రులు ప్రజలు విడిపోయారుకూడా. అయినా వారు నజ్రులు గొంతుకీ, ఆ గొంతుని చైతన్యపరచిన శక్తికీ ఎల్లలులేవని, తామంతా ఒకే భావోద్విగ్న ప్రాంతపు పౌరులమని, నజ్రులూ, ఆయనతోపాటు సృజనాత్మక రచనలు చేసిన ఆయన సహకర్ములూ ఈ రెండు ప్రాంతాలని పరిపాలిస్తున్న శక్తులు అని గుర్తించారు. తన విషాదకరమైన మౌనంలోకూడా కాజీ నజ్రులు ఇస్లాం సామాన్య మానవుని యుగాన్ని ఖంగుమని ప్రతిధ్వనిస్తూనే ఉన్నారు. అన్నిచోట్లా ఉన్న బెంగాలీ ప్రజల ఉమ్మడి వారసత్వాన్ని వారి సాంస్కృతిక, ఆధ్యాత్మిక లక్ష్యాన్వేషణలని తనలో సంఘటిత పరచుకున్నారు.

# విషయసూచిక


| | | పుటసంఖ్య |
|---|---|---|
| | సజీవ వారధి | 7 |
| 1. | పుట్టుక : బాల్యం | 9 |
| 2. | యోధుడు, రచయిత : మొదటి వెల్లువ | 18 |
| 3. | విద్రోహికవి : తిరుగుబాటుకవి | 36 |
| 4. | ప్రజాకవి | 57 |
| 5. | ఆకాశ యాత్రికుడు | 73 |
| 6. | విరిగిన రెక్కలమీద | 84 |
| 7. | నక్షత్రాలు వీలునామా | 98 |
| | ఉపయుక్త గ్రంథాల టిప్పణి | 106 |

# 1. పుట్టుక : బాల్యం

బెంగాలు విభజనకి పూర్వం బర్ద్వాన్ జిల్లాలోని అసన్‌సోలు తహసీల్‌కి చెందిన చురులియాలో 1897 వ సంవత్సరం మే నెల ఇరవై అయిదో తారీఖున (వంగశకం జ్యేష్ఠం పదకొండు, 1606) కాజీ నజ్రుల్ ఇస్లామ్ ఓ పేద ముస్లిం కుటుంబంలో జన్మించారు. వారి పూర్వీకులు పాట్నానుంచి కాజీలుగా ఈ గ్రామానికి వచ్చారని వినికిడి. అయితే నజ్రుల్ పుట్టుకకి పూర్వమే కాజీ అన్న ఒక బిరుదు మినహా వారు తమకున్న జాగీరులు, హోదాలు అన్నిటిని పోగొట్టుకున్నారు. నజ్రుల్ తండ్రి కాజీ ఫకీరు అహమ్మద్ పేదవాడు. ఆయనకి ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు కలిగారు. సంతానంలో నజ్రుల్ రెండోవాడు. జీవితంలో ఎన్నో కష్టాలు, బాధలుపడ్డ కారణంచేత కాజీ ఫకీరు అహమ్మద్ తన కుమారుడికి దుఃఖా (ఏడుపుగాడు) అని ముద్దుపేరు పెట్టుకున్నాడు. నజ్రులుని ఇంట్లో అందరూ "దుఃఖా" అనే పిలిచేవారు. తన ఎనిమిదవ ఏట దుఃఖా తనతండ్రిని కోల్పోయాడు. రానున్న కాలంలో ఎక్కువభాగం కష్టాల్ని అనుభవించడానికి తగిన పద్ధతిలో నజ్రులుతో ఆనందపుపాలూ, వినోదప్రవృత్తి పుష్కలంగా ఉండేవి. పుట్టగానే నజ్రులుకి "తారాఖ్యాపా" అనే పేరు పెట్టినట్టుగా చెపుతారు. నజ్రులు తల్లి ఆపేరుగల తాంత్రికసాధకుణ్ణి తనకి పుత్రప్రాప్తి కలిగేటట్టు వరమిమ్మని ప్రార్థించిందట. ఆ సాధకుడి పేరుతో తారాపీఠం వీరభూమిలో ఉన్నది. తన ప్రార్థన ఫలించటంతో ఆవిడ తన కుమారునికి ఆ సాధకుడి పేరేపెట్టుకుంది. ఏది ఎలా అనుకున్నా, దీని వలన నజ్రుల్ తల్లికి. తల్లి తరపు కుటుంబాల్లోనూ తాంత్రికసాధనల పట్ల నమ్మకాలున్నాయన్న విషయం తెలుస్తోంది.

చురులియాలో ఓ చిన్న వీధిబడితప్ప మరేపెద్ద పాఠశాలాలేదు. ఆ బళ్ళో ఫారసీ అరబ్బీ భాషల్లో సామాన్య జ్ఞానాన్ని మాత్రమే సంపాదించవచ్చు. నజ్రులు తన తెలివితేటలతో చురుకుతనంతో ఆ బళ్ళో మౌల్వీ ఫజలు అహమ్మదు వాత్సల్యాన్ని పొందారు. విద్యాభ్యాసపు ప్రారంభదినాల్లో మౌల్వీగారి దగ్గర నజ్రులు ఫారసీ అరబ్బీ భాషలని క్షుణ్ణంగా నేర్చుకున్నారు. తన పదవఏట నిమ్నప్రాథమిక పరీక్షలో ఉత్తీర్ణులయారు. ఆ బళ్ళో దాదాపు ఓ సంవత్సరంపాటు ఆయన

ఓ రకంగా ఉపాధ్యాయుడిగా కూడా పనిచేశారు. గ్రామంలో జన్మించిన కారణంగా ఆయన మతతత్వరహిత కలిగిన మంచి ముసల్మానుగా రూపొందారు. ఆ కాలానికి అది సహజమే. కాబట్టి ఆయన బెంగాలీ భాషలోని రామాయణ మహాభారతాల్ని హిందువుల ఇతర పురాణగాథల్ని నిండుమనస్సుతో చదివి ఆనందించేవారు. అదే విధంగా ఆ చుట్టుపక్కల ఉన్న ఫకీర్లతో, (హాజీ పహల్వాను పంపినవారు) సాధువులతో, బావుల్ పాటగాళ్ళతో, సూఫీలతో దరవేషులతో ఆయనకి శ్రద్ధాభక్తులతో కూడిన సాంగత్యము ఉండేది. మతంపట్ల ఆయనకున్న ఈ ఆసక్తి, అభిరుచి సహజమైనవే. అయితే ప్రాపంచిక వ్యవహారాల పట్ల ఆయనలో కొంత నిర్లక్ష్య వైఖరి విశేషంగా ఉండేది. నిజానికి ప్రాపంచిక వ్యవహారాలని ఏ రకంగా చక్కబరుచుకోవాలో ఆయన ఎన్నటికీ నేర్చుకోలేకపోయారు. ఆయనలో ఓ నిర్లక్ష్యం, దేనినీ లెక్కచెయ్యని ప్రవృత్తి ఉండేది. ఆయన విలక్షణ ప్రతిభాసంపన్నులు. ఖ్యాతి అన్న పేరుకి తగినట్టుగా తనది అని చెప్పుకునే స్వతంత్రమైన వ్యక్తిత్వం ఉన్నవారు. ప్రసన్నచిత్తులు, యువకులు. బాల్య చాపల్యంతో చేసే అల్లరిపనులన్నా, జానపద పాటలన్నా మక్కువ ఉన్నవారు. నియమబద్ధంగా విద్యని ఆర్జించడానికి కావలసిన సాధన సంపత్తి సమకూరదని కారణంచేతే ఆయనని బహుశా "లేతోదళాలు" ఆకర్షించాయి. "లేతో" అన్న శబ్దానికి వ్యుత్పత్త్యర్థం నాటకం. వారి పక్కగ్రామంలో జానపద పాటగాళ్ళ బేండుదళాలు ఉండేవి. వాటిని "లేతో దళాలు" అనేవారు. స్థానికమైన ఈ పాటగాళ్ళ దళాలు బెంగాలులో ప్రసిద్ధిపొందిన తరజాదళాలు, కబీరు దళాలలాంటివే ఈ దళాలు సంగీత కార్యక్రమాల్లో ఉత్తమమైన అభిరుచితో ఆరోగ్యకరమైన పోటీతో ఒకదానితో ఒకటి ఢీకొంటూ ఉండేవి. విశిష్టమైన ఈ లేతోదళాల్లో కేవలం పాటగాళ్ళ దళమే కాక సమయస్ఫూర్తితో మాటకి మాట తక్షణమే సమాధానం చెప్పగలిగే ప్రసిద్ధుడైన కవి కూడా ఉండేవాడు. ఈ కవిని గోడాకవి అనేవారు. పోటీ కార్యక్రమాల్లో తమతో పోటీకి వచ్చిన దళానికి సమయస్ఫూర్తితో అప్పటికప్పుడు గేయాలుకట్టి సమాధానం చెప్పడం ఆ కవి పనిగా ఉండేది. నజ్రుల్ పినతండ్రుల్లో ఒకరు లేతో బేండు దళంలో సభ్యులుగా ఉండేవారు. ఆయన తన అన్నగారి కుమారుణ్ణి కూడా ఈ బేండుదళానికి తీసుకువెళ్లారు. పద్నాలుగేళ్ళ వయస్సుకే నజ్రుల్ ఈ బేండుదళానికి నాయకత్వం వహించారు. ఆయన రచించిన లేతోగేయాలు ఈ నాటికీ భద్రంగా ఉన్నాయి. (చూడండి - అజహరుద్దీనుఖానుగారి వంగ సాహిత్యంలో

నజ్రులు 1363 వంగసాహిత్యం పుటసంఖ్య 6–8). ఆ గేయాల్లో జానపదసాహిత్యంతో, జానపద జీవితంతో నజ్రులుకి ఉన్న గాఢమైన సంబంధం, ఆశ్చర్యాన్ని కలిగించే రీతిలో ఆయన సాధించిన విషయవైవిధ్యం, బెంగాలీ రాగ తాళలయ గతుల మీద ఆయనకున్న అపారమైన అధికారం గోచరిస్తాయి. అంచేత నజ్రులు కవితకి సహజకవితావికాసం బాహ్యప్రభావాల వలన కలిగినదికాదని చెప్పవచ్చు. అయితే లేటో కార్యక్రమాలు కాలానుగుణంగా జరిగే కార్యక్రమాలు. పంటకాని పాడయినా లేటోదళాలకి పాడుకాలం వచ్చేది. నజ్రుల్ విషయంలోనూ అదే సంభవించింది.

నజ్రులు అసన్‌సోలుకి వెళ్ళారు. అసన్‌సోలు బొగ్గుగనుల కేంద్రం. పెద్ద రైల్వేజంక్షను. మొదట్లో నజ్రులు రైల్వేగార్డు క్వార్టర్లలో ఇంటిపనులు చేశారు. తరువాత కొద్దికాలానికే ఓ నిపుణుడి దగ్గర రొట్టెలు కాల్చడంలో శిక్షణాతర్ఫీదూ పొంది రొట్టెలు కాల్చేవాడిగా మారారు. దుకాణంలో తన విరామసమయాల్లో మురళి వాయిస్తూ సంగీత కార్యక్రమంలో నజ్రులు తన కాలాన్ని గడిపేవారు. చురుకైన ఈ యువకుడి చుట్టూ జనం పోగవుతూ ఉండేవారు. పోలీసు సబ్ ఇనస్పెక్టరు శ్రీ రఫీజుల్లా నజ్రులు తెలివితేటలు చూసి ముగ్ధులయారు. ఆయన మైమనసింహ జిల్లాలోని తన గ్రామానికి (ఇప్పుడాగ్రామం బంగ్లాదేశ్‌లో ఉన్నది) నజ్రులుని తీసుకువెళ్ళాడు. అక్కడికి దగ్గరలోఉన్న దరియారామపూర్ హైస్కూల్లో స్కూలు జీతం కట్టనవసరంలేకుండా చదువుకునే ఏర్పాటు చేశారు. (1912 ?) అయితే అక్కడ దారిపక్క పొలాల్లో పనిచేసే సేద్యపు కుర్రాళ్ళ సాంగత్యాన్ని నజ్రులు ఎక్కువగా ఇష్టపడేవారనీ, వాళ్ళసాంగత్యం ఆయనకి ఎక్కువ సంతోషాన్ని కలగచేసేదనీ అంటారు. ఆ కుర్రాళ్ళ జట్టులో తానూ ఒకడై వారి ఆటపాటల్లో, పొగతాగడంలో, చేపలు పట్టడంలో ఆయన సంతోషాన్ని పొందేవారు. అప్పటి కప్పుడు పాటలుకట్టి, పాడి వినిపిస్తూ ఆ కుర్రాళ్ళని ఆకట్టుకుని వినోదం కలిగించటం అంటే ఆయనకి ఎంతో సరదాగా ఉండేది. సంవత్సరాంతపు పరీక్షలో ఈ యువ విద్యాంసుడు "బెంగాలీవ్యాసం" పరీక్ష పేపరుకి తగినవిధంగా కవిత్వం కట్టి సమాధానం వ్రాశాడని ఓ కథగా చెపుతారు. మిగిలిన పరీక్ష పేపర్లకి అలా సమాధానాలు వ్రాయడానికి అవకాశం లేకపోవటంతో నజ్రులు సమాధానాలు వ్రాయలేకపోయారు. తత్ఫలితంగా పరీక్షతప్పారు. తిరిగి అసన్‌సోలుకి వచ్చేశారు. క్రమబద్ధంగా స్కూలులో చదువుకోవాలన్న కోరిక ఉన్నా స్కూలు చదువుకు

ఖర్చు పెట్టుకోగలిగిన స్తోమత ఆయనకి లేదన్న విషయమే ఇక్కడ గమనించ వలసిన సంగతి.

అసన్‌సోలు తిరిగివచ్చాక నజ్రులు మాథరన్ స్కూలులో చేరారు. ఆ రోజుల్లో ఆ స్కూలుకి కవి కుముదరంజన్ మల్లిక్‌గారు హెడ్‌మాష్టారుగా ఉండే వారు. కాసిమ్‌బజారు జమీందారు, ఔదార్యవంతుడైన మహారాజా మనీంద్రచంద్ర నంది ఈ స్కూలుని నడుపుతూ ఉండేవారు. అంచేత స్కూలుకి జీతం కట్టవలసిన అవసరం ఉండదనీ, చదువుకోడానికి మరికొన్ని సదుపాయాలు కలుగుతాయని నజ్రులు ఆశపడ్డారు. కాని ఆయన ఆశ ఆశగానే మిగిలిపోయింది. దాంతో సేక్ సోల్ రాజ్యంలో ఓ పాతకాలపు ఫ్యూడల్ భూస్వామికి చెందిన రాణీగంజ్ (బరద్వాన్) హైస్కూల్లో మళ్ళీ చేరవలసివచ్చింది. ఆ స్కూలులో దివాణం తరఫు నుండి ఉచిత విద్యకి, ముస్లిం విద్యార్థుల వసతిగృహంలో ఉచితవసతి, ఉచిత భోజనంతోపాటు నెలకి ఏడురూపాయలు విద్యార్థి వేతనం కూడా ఇచ్చే ఏర్పాటు అతి సుళువుగా జరిగింది. నజ్రులు ఎనిమిదవ తరగతిలో ఉండేవారు. గొప్పతెలివితేటలు ఉన్నవారు. తాను తలుచుకుంటే దానికి తగినట్టు కృషిచేసే ప్రవృత్తి కలవారు కావడంచేత తన తరగతికి సర్వప్రథములుగా వచ్చారు. సంవత్సరాంతానికి డబులు ప్రమోషనుతో పదవతరగతికి— అంటే ఆ స్కూలులో అంతిమతరగతికి వచ్చారు. ఆ చిన్న ఊరు రాణీగంజ్‌లో శైలజానంద ముఖోపాధ్యాయ నజ్రులు సమకాలికుల్లో ఒకరు. ఆయన ఆ ఊళ్ళోనే మరోస్కూల్లో చదువుతూ ఉండేవారు. ఆయన బెంగాలులో ప్రసిద్ధ నవలారచయిత. కథారచయిత. వీరిద్దరూ ఒకేరకమైన అభిరుచులున్న కారణంచేత జీవితాంతంవరకూ సాహితీ మిత్రులుగా నిలిచారు. చిత్రం ఏమిటంటే ఆ రోజుల్లో నజ్రులు రచనా వ్యాసంగం అధికంగా గద్యరూపంలోనూ, శైలజానంద్‌ది కావ్యరూపంలోనూ ఉండేది. తదుపరికాలంలో ఇది వీరిద్దరి విషయంలో ఇంచుమించు తారుమారైంది.

ఈ కాలంలోనే నజ్రులు జీవితం మీద అన్యప్రభావాలు ప్రసరించటం మొదలయింది. ఆయన స్కూలులో నివారన్ చంద్రఘటక్ ఉపాధ్యాయులుగా ఉండే

---

*నజ్రులానాకి (నజ్రుల్ మీద రచించిన సాహిత్యం - బెంగాలు ఉభయ ప్రాంతాల్లోనూ విరివిగా వెలువడుతోంది) చేర్చుకోవలిసిన కోరదగిన మరో సంకలనం శైలజానంద ముఖోపాధ్యాయ రచించిన "నజ్రులు స్మృతులు" 1970.

వారు. ఆ ఘటక్‌గారు "యుగాంతర" అనే విప్లవకారుల రహస్యసంస్థలో సభ్యులు. ఈ సందర్భంలో చెప్పుకోదగిన విషయం మరొకటి ఉన్నది. ఘటక్‌గారి బంధు వులు దుకారీదేవి విప్లవకారుల మారణాయుధాలను దాచిఉంచిందన్న నేరంతో జైలుశిక్ష అనుభవించిన మొట్టమొదటి వంగమహిళ. నజ్రులు గుండెనిబ్బరాన్ని ఆవేశాన్ని ఆ ఉపాధ్యాయుడు గుర్తించారని, ఆయనని తమ వేపు తిప్పుకున్నా రన్న సంగతిని మనం ఇక్కడ గమనించాలి. అవి మొదటి ప్రపంచయుద్ధపు రోజులు. స్వాతంత్ర్యపోరాటంలో భారతదేశపు విప్లవకారులు ఉత్సాహంతోనూ ఆవేశంతోనూ పాల్గొంటున్నారు. బ్రిటను విపత్కర పరిస్థితిలో ఉండడం విప్లవ కారులకి మంచి అవకాశంగా కనిపించింది. ఆ ఆపదకాలంలో తుపాకీగుండ్లకి ఎదు రొమ్మునిచ్చే భారతదేశపు సిపాయిలు అధికాధిక సంఖ్యలో కావలసిన అవ సరం బ్రిటిషు పరిపాలకులకు ఉన్నది. బ్రిటిషు పరిపాలకుల భాషలో భారత దేశంలో యుద్ధానికి పనికిరానిజాతి బెంగాలీజాతి. అంచేత వారు మొదట్నుంచీ బెంగాలీలను సైన్యంలో చేర్చుకునేవారుకాదు. ఇప్పుడు ఓ ప్రయోగంగా బెంగాలీ నవయువకులతో ఓ "డబల్ కంపెనీ"ని ఏర్పాటు చేశారు. ఆ కంపెనీయే తరవాత 49 వ బెంగాలీ రెజిమెంటు అయింది. అప్పటికి నజ్రులు పద్దెనిమిదేళ్ళవాడు. ఆ అవకాశాన్ని వినియోగించుకుని సైనిక శిక్షణ పొందవలసింది అనీ, స్వాతంత్ర్య పోరాటంలో గెలవడానికి సైనికశిక్షణ ఎంతోఅవసరమని నజ్రులుని ప్రోత్సహించటం జరిగింది. నిజానికి ఆయనని అధికంగా ప్రోత్సహించవలసిన అవసరంలేదు. స్వేచ్ఛాస్వాతంత్ర్యాల పట్ల ఆయనకున్న గాఢమైన అనురక్తే చాలు. ఈ గాఢాను రక్తికి ఓ నిర్దిష్టమైన మార్గాన్ని సూచించడంలో నివారణ్ ఘటక్‌గారు సహాయ పడ్డారు. దేశస్వాతంత్ర్యం అన్న ఓ స్పష్టమైన లక్ష్యాన్ని నిర్దేశించి చూపెట్టారు. దీనిని మనం అంగీకరించాలి. ఆ ప్రేరణ తుదివరకూ నజ్రులుని ఉత్తేజపరుస్తూనే ఉంది. కాలగమనంతోపాటు ఆ ఉత్తేజానికి అర్థం విస్తృతమవుతూ వచ్చింది. సృజ నాత్మక రచనావ్యాసంగపు సర్వోత్కృష్ట కాలంలో నజ్రులు ప్రతిభ వైవిధ్యంలో విశిష్టతని ఎలాగూ సంతరించుకుంది. దానికితోడు విప్లవాత్మకమైన దేశభక్తిభావం, స్వాతంత్ర్యం కోసం పెల్లుబికే తీవ్రమైన ఆవేశం, తమ గాఢముద్రని వేశాయి. తన కాలంతో ప్రమేయం లేకుండా ఉండడం విశిష్టుడైన ఏ కళాకారుడికైనా అసం భవం. స్వాతంత్ర్యసమరం ప్రచండరూపం దాల్చినప్పుడు ఆ సమరానికి దూరంగా తటస్థంగా ఉండడం వలసదేశానికి చెందిన విశిష్టరచయితకి కష్టమైన విష

యచే. "సేర్‌సోల్" రోజుల తరవాతనుండి నజ్రుల్ అన్ని విధాలా ఈ లక్ష్యానికి నిబద్ధులయ్యారు. ఆ తర్వాత ఇరవై అయిదు సంవత్సరాల కాలాన్ని, వాస్తవానికి నజ్రుల్ పూర్తిగా ఉన్మాదులైన కాలందాకా, ఆనాటి జాతీయ, అంతర్జాతీయ సందర్భంలో చూస్తేనే నజ్రుల్ జీవితాన్ని, కవిగా కళాకారుడిగా ఆయన వికాసాన్ని అర్థం చేసుకోగలం.

నజ్రుల్ 1917 లో తమ స్కూలు కోర్సుకి ఆఖరి సంవత్సరంలో చదువుకి స్వస్తి చెప్పి 'పటుల్‌కంపెనీ'లో పేరు వ్రాయించుకున్నారు. కంపెనీలో చేరిన వెంటనే ఆయనని నాసిరా (వాయవ్యసరిహద్దు)కి పంపించారు. ఆ తరవాత రెజిమెంటుతోసహా కరాచీకి పంపారు. యుద్ధంపూర్తయి బెంగాలీ రెజిమెంటు రద్దు చేసేటంత వరకూ- అంటే 1917 నుంచి 1919 వరకూ ఆయన అక్కడే ఉన్నారు- హవల్దారు (భారతదేశపు కమీషనుపొందిన ఆఫీసరు) హోదాకి చేరుకున్నారు. నిజానికి ఆయన క్వార్టరు మాస్టరు. కరాచీ బేరక్సులో అరమరికలు లేకుండా స్వేచ్ఛగా, స్నేహంగా, కలివిడిగా ఉండేవారు. ఆయన స్నేహం తోటిసైనికులని ఉత్సాహపరిచేది. ఆయన కవిత్వంకన్నా ఆయన పాటలు వారిని ఎక్కువగా ఆకట్టుకునేవి. సైనికదళానికి చెందిన ఓ పంజాబీ మౌల్విగారి సాయంతో నజ్రుల్ తన ఫారసీ భాషాజ్ఞానాన్ని ఫారసీ కావ్యజ్ఞానాన్ని స్వయంగా వృద్ధిచేసుకున్నారు. మూడ్ కుదిరినప్పుడు తరుచు గద్యరచనలు చేసేవారు. కవిత్వం అల్లేవారు. పాటలుపట్టేవారు. తదితర విషయాలతోపాటు ఆయన హాఫిజ్ రుబాయిలను అనువదించటం ప్రారంభించారు. ఆ రుబాయిలు 1337 వంగశకం (క్రీ. శ. 1930) వరకూ పూర్తి కాలేదు. అచ్చుకాలేదు.

ఆ రోజుల్లో వ్రాసిన కథే ఆయనకథల్లో అచ్చయిన మొదటికథ. ఆ కథ కొంత ఆయన జీవితానికి సంబంధించినది. బోందులేర్ జీవితకథ (ఓ దేశదిమ్మరి స్వీయజీవితకథ) కలకత్తానుంచి మౌల్వీ నాసరుద్దీను సంపాదకత్వాన వెలువడే పత్రిక సౌగాత్ జ్యేష్ఠం 1326 (క్రి. శ. 1919) సంచికలో అచ్చయింది- ఆ రోజుల్లో సౌగాత్ పత్రికకి సాహిత్యలోకంలో మంచిపేరు ఉండేది. మరో రచన-కథాకావ్యం "ముక్తి". (మొదట నజ్రుల్ దీనికి 'క్షమ' అని పేరుపెట్టారు. అయితే ఆపేరుని సంపాదకులు మార్చివేశారు. సంపాదకులు పెట్టిన శీర్షికనే తర్వాత కవి అంగీకరించారు). సుమారుగా అదే సమయంలో వంగీయ ముసల్మాను సాహిత్యసమితి వారి త్రైమాసిక పత్రిక-వంగీయ ముసల్మాను సాహిత్య

పత్రిక-శ్రావణం 1326 (జూలై-ఆగష్టు 1919) సంచికలో అచ్చయింది. అచ్చయిన మొదటికవిత ఇదే. ఈ కవితకు కూడా వాస్తవంగా జరిగిన సంఘటనలే ఆధారం. రాణీగంజ్‌లో ఓ భాగం సజీవంగా మనకళ్ళముందు ప్రత్యక్షమౌతుంది. ఈ కవితలో ఓ ఫకీరు చావుపుట్టుకలు, ఫకీరు కృపతో చెట్టు కొత్త చిగుళ్ళు తొడిగిన అద్భుతం వర్ణించబడ్డాయి. ప్రవాహవేగంతో పరిగెత్తే లయబద్ధమైన పంక్తులు, అసాధారణమైన రీతిలో సరళంగా ఉంటూనే శక్తిమంతంగా కనపడతాయి. ఈ కవితకు చాలా కారణాలవల్ల ప్రాముఖ్యత ఉన్నది. బాల్యం నుంచి మతసంబంధమైన మిస్టిక్ శక్తులన్నా అద్భుతాలన్నా నజ్రులుకి అజ్ఞాతంగా విశ్వాసం ఉన్నదని ఈ కవితవల్ల తెలుస్తోంది. ప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకుడు కామ్రేడు ముజఫరు అహమ్మదుతో ఆయనకి సంబంధం ఏర్పడటానికి కారణం ఈ కవితే! ముజఫరు అహమ్మదు నిజానికి ఆ పత్రికకి సంపాదకుడు కాడు. పత్రికకి, సమితికి పరోక్షంగా సూత్రధారి. చోదకశక్తి. అంతకు పూర్వమే ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా ముజఫరుగారు నజ్రులుతో ప్రత్యక్ష సంబంధం ఏర్పరచుకుని ఉన్నారు. ఆయనదృష్టి సునిశితమైనది. ఈ కథా కావ్యాన్ని చదువుతున్నప్పుడు ఓ తోకచుక్క తన దృష్టి పథంలోకి ప్రవేశించినట్టుగా ఆయనకి అనిపించింది. ఆయన మరి జాప్యం చెయ్యలేదు. వంగీయ ముసల్మాను సాహిత్య పత్రిక తరఫున కరాచీలో ఉన్న నజ్రులుతో సంబంధం ఏర్పరచుకున్నారు. మరిన్ని కవితలను పంపించవలసినదిగా కోరారు. వారిద్దరి మధ్యా ఈ విధంగా మహత్తరమైన దృఢమైన మైత్రికి పునాది పడ్డది. భారత దేశానికి కాకపోయినా, బెంగాలుకి కమ్యూనిస్టు ప్రేరణతో రచనలు చేసే మొట్టమొదటి కవిగా నజ్రులు రూపొందడానికి ఈ మైత్రి కారణమయింది. ఆ రోజుల్లో వంగీయ ముసల్మాను సాహిత్య సమితి నజ్రులుకి వేదిక అయింది.. ఆయన వ్రాసిన రెండు కథలు హెనా, వ్యథార్‌దాన్ (ఈ రెండింటిలో వ్యథార్ దాన్ విశిష్టమైన కథ) పత్రికలో (ఆగష్టు 1919) వరసగా అచ్చయాయి. సమితితో విశేషించి సంబంధం ఉన్నవారికి, చదువుకున్న ముస్లిం యువకులకి, పత్రిక పాఠకులకి నజ్రులు పేరు అభినందనీయమైనదైంది. మౌల్వీ కాజీ అబ్దుల్ బదూద్, అబ్దుల్ కలామ్ షమ్సుద్దీను లాంటివారు, తర్వాతకాలంలో సాహిత్య రంగంలో ప్రసిద్ధులైనవారు నజ్రులుకి మిత్రులయారు. నజ్రులు అనువదించిన హాఫిజు రుబాయి కూడా (పుష్యం 1320 అనగా డిసెంబరు 1919) బెంగాలు

లోని ప్రముఖ సాహిత్య పత్రిక 'ప్రవాసి'లో అచ్చయింది. పవిత్ర గంగూలీ ఈ రుబాయిని ప్రచురణార్థం పంపారు. ఈ సందర్భంగా నజ్రులు- గంగూలీల మధ్య శాశ్వత మైత్రికి పునాది పడ్డది.

1920 ప్రారంభంలో రెజిమెంటు రద్దుచెయ్యబడ్డది. రద్దవడానికి ముందుగానే జనవరినెలలో ఓ వారంరోజులు సెలవు తీసుకుని నజ్రులు కలకత్తాకి, చురులియాకి వెళ్లారు. మొదటిసారిగా ముజఫరు అహమ్మదు కలకత్తాలో నజ్రులుని కలుసుకున్నారు. సివిలు జీవితానికి తిరిగివచ్చిన తర్వాత సాహిత్య రంగంలో కృషిచెయ్యవలసినదిగా, మనస్సుకి నాటుకునేటట్టు నజ్రులుకి ఆయన చెప్పారు. మార్చి 1920లో రెజిమెంటు రద్దయింది. నజ్రులు శాశ్వతంగా బెంగాలుకి తిరిగివచ్చారు. గ్రామంలోని తల్లిని చూడ్డానికిగాను కొద్దికాలం మొదట గ్రామానికి వెళ్లారు. ఆ తర్వాత కలకత్తా చేరుకున్నారు. ఆయన మిత్రులు శైలజానంద ఆయనకోసమే ఎదురుచూస్తున్నారు. ముజఫరు అహమ్మదుతోపాటు 32, కాలేజీస్ట్రీటు ఇంటిమేడమీద ముస్లిముభారత్, ముసల్మాను సాహిత్యసమితి కార్యాలయాల్లో నజ్రులు ఉండడం మొదలయింది. సమితి కార్యనిర్వాహకులు ముజఫరు అహమ్మదు, అఫ్జలు-ఉల్-ఇస్లాము, కాజీ అబ్దుల్ ఐదూదు-తదితరమిత్రులు ఇక్కడే ఉంటూ ఉండేవారు. ఆ రోజుల్లో 32 నెంబరు మేడ వీరందరికి కేంద్రంగా ఉండేది. నజ్రులు అందరికి అంతరంగ మిత్రులయ్యారు. మాజీసైనికుడవడంచేత నజ్రులుకి ఉద్యోగం దొరికే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. బహుకొద్దికాలానికే ప్రభుత్వ రెవిన్యూ విభాగంలో సబ్ రిజిస్ట్రారు పదవికి ఇంటర్వ్యూ కూడా వచ్చింది. సైన్యంలో చేరడానికి దేశ స్వాతంత్ర్య సముపార్జనకోసం దేశభక్తి, ఆవేశం ఆయనని ప్రేరేపించాయి (1917). అయితే ఇప్పుడు సామ్రాజ్యవాద యుద్ధసమాప్తి ఆయనని ఇటువంటి సంకీర్ణమైన ఉద్యోగపు అస్తిత్వానికి స్థిర పరచలేకపోయింది. అదీకాక కరాచీ బేరక్సులో ఉన్నప్పుడు మధ్య ఆసియాలో జమీందారీ వ్యూడలు వ్యవస్థ విచ్ఛిన్నమౌతున్నట్టూ, ఎర్రసేనకి విజయం లభిస్తున్నట్టూ 'కర్ణాకర్ణిగా' వార్తలు తెలిశాయి (1918-1920). సామ్రాజ్యవాద శక్తులు హెజాజ్, సమీపప్రాగ్దిశలో ఉన్న ముస్లిందేశాలను ఆక్రమించడాన్ని భారతదేశంలోని ముస్లిములు ఆగ్రహించారు. నజ్రులుకూడా ఆ ఆగ్రహంలో పాలుపంచుకున్నారు. యావత్ భారతదేశంలో రౌలట్ చట్టం కూడా (1919) బ్రిటిషు పరిపాలన పట్ల వ్యతిరేకతని మరింత

పెంచింది. గాంధీజీ "సత్యాగ్రహం" గురించి బోధించడం ప్రారంభించారు. పంజాబులో జరిగిన ఘోరసంఘటనలు-పరాకాష్ఠకి చేరుకున్న జలియనువాలా బాగు హత్యాకాండ (13, ఏప్రిలు, 1919) వెంటనే జాతీయవిప్లవానికి కార్య రంగంలోకి దూకడానికి ప్రేరేపించి రెచ్చగొట్టాయి. యావత్ భారతదేశంలో ముస్లిముల్లోనూ, హిందువుల్లోనూ, అందరిలో ఒకేరీతిలో జ్వలిస్తున్న విప్లవాగ్ని నజ్రులు గుండెలోనూ ప్రజ్వలించింది. అన్నిప్రాంతాలకన్నా ఎక్కువగా, విశేషించి బెంగాలులో-కలకత్తాలో ఆ అగ్ని మరింత తీవ్రరూపాన్ని దాల్చింది. అప్పటికే నజ్రులు ఓ నిర్ణయానికి వచ్చేశారు. ఏది ఏమైనాసరే, ఆయన దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడతారు. జాతీయసాహిత్యానికి సేవ చేస్తారు. ఓ సాహితీవేత్తగా ఎంతో ఎత్తుకి ఎదుగుతాడని గట్టి నమ్మకం ఉన్న ఆయన మిత్రులు ఆయన నిర్ణయాన్ని బలపరిచారు. నజ్రులు ప్రభుత్వం ఇస్తానన్న ఉద్యోగాన్ని తిరస్కరించి ఉద్విగ్న హృదయంతో ఎప్పటిలాగానే సాహసంతో సంశయా స్పదమైన భవిష్యత్తులోకి అడుగువేశారు. అప్పుడు ఆయనకి ఇరవై ఒకటోఏడు.

## 2. యోధుడు, రచయిత : మొదటి వెల్లువ

1920లో కాజీ నజ్రుల్ ఇస్లాము యౌవనంలోకి అడుగుపెట్టారు. పరో విధంగా చెప్పాలంటే స్వాతంత్ర్య యోధుల పక్షాన నిలవాలని, సాహిత్యరంగంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించాలని దృఢంగా నిశ్చయించుకుని బాల్యాన్ని బల వంతంగా విదవాలని విడిచి యౌవనంలోకి పరుచుకు వద్దారని చెప్పాలి. ఆ రోజుల్లో 'ముస్లిమ్ భారత్' పత్రిక ప్రధానమైన చర్చావేదికగా ఉండేది. అందులో పనిచేసే మిత్రులు మంచి ఉత్సాహవంతులు. నజ్రుల్ గురించి వేరే చెప్పవలసిన అవసరంలేదు. ఆయన వారందరిని మించిన ఉత్సాహం ఉల్లాసం ఉన్నవారు. ఆ మాస పత్రిక పేరుకి మాత్రమే ప్రసిద్ధ ముస్లింకవి ముజమ్మల్‌హక్ (శాంతి పూర్) సంపాదకత్వాన వెలువడేది. వాస్తవానికి ఆయన కుమారుడు జనాబ్ అఫజలుహక్కే దాని సంపాదకుడు. నిజానికి 'ముస్లిం భారత్' కార్యాలయం 32, కాలేజీస్ట్రీట్‌లోనే ఉండేది. ఈ పత్రిక మొదటి సంచిక (వైశాఖం 1327 లేదా ఏప్రిల్ : 1920) నజ్రుల్ మొదటి నవల బంధనహారా (బంధన ముక్తి)తో ఆరంభమయింది. ఈ నవల లేఖలరూపంలో వ్రాయబడింది. నెలనెలా ధారావాహికంగా వెలువడింది. ఈ నవలతో పాటు శక్తివంతమైనవి, కొత్తవి పద్యరచనలు కూడా పత్రికలో వరసగా అచ్చవుతూ వచ్చాయి. సౌగాత్, ఉపాసన, బిజిలి మొదలైన ఇతరసాహిత్య పత్రికల్లో కూడా పద్యరచనలు పుష్కలంగా అచ్చయాయి. 'ముస్లిం భారత్' 1327 వం. సం. పత్రికలో అచ్చయిన రచనలు--

1. బంధనహారా (నవల) బంధనముక్తి
2. కుర్బానీ (పద్యరచన) ఆహుతి
3. బాదల్ బరిషన్ (ప్రతీకాత్మకమైన కథ)
   వానలు : రోకళ్ళవానలు
4. బాదల్ ప్రాతేర్ సౌహరాబ్ (పద్యరచన)
   వర్షాకాలపు ఉదయం చేసిన ప్రార్థన

5. బోధన్ (పద్యరచన) ప్రారంభోత్సవం
6. మొహర్రమ్ (పద్యరచన) ముసల్మానుల పండగ
7. షత్-ఇల్-అరబ్ (పద్యరచన) మెసపొటేమియాలోని యూఫ్రటిస్‌కి అరబ్బీ పేరు.
8. పాటలు (మూడు పాటలు)
9. ఘజల్ (హాఫిజ్ కవితల కనువాదం)
10. ఫతవా-ఇ-దోజఖమ్ (పద్యరచన) మతప్రవక్త జన్మదినం.
11. బిరహ-బిధుర (పద్యరచన) విరహవేదన
12. మిరామీ (పాట) స్పందించే హృదయం లేదా మార్మికత
13. స్నేహ-భీతు (పద్యరచన) ప్రేమపట్ల భయపడేవాడు.

వీటిలో కొన్ని రచనలు నేటికీ ఉత్కృష్టమైనవే. ఆ రోజుల్లో ఉన్నట్టుండి ఆయన తమ రచనలతో అందరినీ ఆశ్చర్యంలో ముంచివేశారు. ఈ కొత్త రచయితకు ఇంచుమించు అన్నివైపులనుండి అమితోత్సాహంతో స్వాగతం పలికారు. 'బంధనహారా' నవలకి కూడా పొగడ్త దొరికింది. నజ్రుల్ ప్రతిభ నవలారచయితకు ఉపయుక్తమైన ప్రతిభకాదు. దీనిని మనం అంగీకరించాలి. ఈ నవలకి కథానాయకుడు ఒక హవల్దారు క్వార్టరు మాస్టరు. (నజ్రుల్ ఆ ఉద్యోగమే చేశారు) తన కరాచీ అనుభవాలనే ఎక్కువగా ఆధారం చేసుకుని కథ అల్లారు. దానినిండా కవిత్వం, రొమాన్సు, భావానుభూతులు పుష్కలంగా ఉన్నాయి. ధారావాహికంగా వెలువడుతున్న సమయంలోనే ఈ నవలకి ప్రశంసతోకూడిన గుర్తింపు శ్రీ చిత్తరంజన్‌దాసు వ్యవస్థాపకులుగా బరీంద్ర కుమార్ ఘోష్ సంపాదకత్వంలో వెలువడే "నారాయణ" (భాద్రపదం 1327 వం. సం. లేదా ఆగస్టు 1920)లో లభించింది. 'నారాయణ' ప్రముఖసాహిత్య మాసపత్రిక. 'ముస్లిం భారత్'లోనూ, 'సౌగాత్' లోనూ అచ్చయిన నజ్రుల్ కవిత్వానికి అంతకు పూర్వమే గుర్తింపు వచ్చింది. ఇరాక్‌లో ఉంటున్న ఒక బెంగాలీ సైనికుడు ఇరాక్‌ని సంబోధిస్తూ సత మాతృదేశం, అమరవీరుల గొప్ప దేశం (ఇరాక్) రెండూ ఒకేవిధంగా బానిసత్వంలో క్రుంగిపోతున్నందుకు విచా

కిస్తున్నట్టు వ్రాసిన కవిత "షత్-ఇల్-అరబ్." నజ్రులు విలక్షణమైన ముద్ర ఈ కవితలో కనపడుతుంది. ఇది ఈ కోవకి చెందిన మొట్టమొదటి రచన కాని మాట నిజమే. అయినా దీనిలో ఉన్నతమైన దేశభక్తి భావాల వెల్లువ, యుక్తాయుక్త వివేచనతో చేసిన ఫారసీ అరబ్బీ భాషల్లోని శ్రావ్యమైన శబ్దాల మేళవింపు, అదే వేగంతో పరుగులు తీసే బెంగాలీ శబ్ద ప్రవంతి ఉన్నాయి. ఈ కవితకి ముగ్ధులు కాని వారు ఎవరూ ఉండరు. అలాగే మొహర్రమ్, బాదల్ప్రాతేర్ సౌహరాబ్ మొదలైన తదితర రచనలకి కూడా ముగ్ధులవుతారు. అనాటి చర్చా వేదిక అయిన "ముస్లిం భారత్" పత్రిక "ముస్లిం విషయ వస్తువు" అని దేనినైతే అంటారో అలాంటి విషయవస్తువుతో రచించిన రచనలను ప్రచురణనిమిత్తమై ఆమోదించేదన్న విషయం సుస్పష్టం. అంచేత పత్రికవారు ఆశించిన విధంగానే ఇస్లాం మతానికి సంస్కృతికి సంబంధించిన ప్రత్యేక సందర్భాలను పండగలను విషయవస్తువుగా స్వీకరించి, మొహర్రమ్, కుర్బానీ, ఫతవా-ఇ-దోజదమ్ మొదలైన పద్యరచనలని, పైన ఉటంకించిన రచనల లాంటి రచనలను ఆ రోజుల్లో నజ్రులు రచించారు. ఇవి ఉత్తమ కవితారచనలే, అందులో సందేహం ఏమాత్రం లేదు. అయితే తదితర కారణాలవల్లకూడా ఈ కవితలు ప్రధానమైనవే.

సంస్కృత మూలాల నుంచి తీసుకున్న విషయవస్తువుతో పోల్చిచూస్తే ఫారసీ అరబ్బీ మూలాలనుంచి తీసుకున్న విషయవస్తువు బెంగాలీ సాహిత్యంలో సమృద్ధవంతంగా లేదు. దీనికి కారణం గతంలో ముస్లిం రచయితలు బెంగాలీలో తక్కువగా ఉండేవారు. ఉన్నతవర్గాలవారు ఆ రచయితలని తరుచుగా ఉపేక్షా భావంతో చూసేవారు. ప్యూడలు యుగంలో యూరపులో లాటినుని మెచ్చుకున్నట్టుగా భారతదేశంలో ఉన్నతవర్గాలవారు ఫారసీభాషని ఎక్కువగా మెచ్చుకునేవారు. ఫారసీ అరబ్బీ విషయవస్తువుకి బెంగాలీలో నజ్రులు సాహిత్యగౌరవాన్ని కలగచేశారు. ఈ విషయవస్తువుపట్ల బెంగాలులోని హిందువుల వర్గంలో అభిరుచి కలిగించి వారు ఆస్వాదించేటట్టు చేశారు.

పరిస్థితులు కూడా అనుకూలించాయి. ఖిలాఫత్ ఉద్యమం సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకరించే విషయంలో ముస్లిములని హిందువులకి దగ్గరచేసింది. హిందువులకి ముస్లిములకి- ఇరువురికి మతపరమైన సంప్రదాయాలని, సంస్కృతికి సంబంధించిన సంప్రదాయాలని ఒకరివివొకరు తెలుసుకోవాలన్న ఆసక్తికలిగింది. జాతీయ పోరాటానికి, జాతీయ సమైక్యతకి దోహదపడేరీతిలో చేసే సాహిత్యసం

జంభమైన కృషికి, సంస్కృతికి సంబంధించిన ప్రయత్నాలకి ఇరువర్గాలవారు స్వాగతం పలకడానికి సంసిద్ధులయారు. 1920 సెప్టెంబరులో కలకత్తా కాంగ్రెసు ప్రత్యేక మహాసభలో సహాయ నిరాకరణ తీర్మానం స్వీకరించబడింది. నిజానికి ప్రజాజీవితం ప్రవృత్తిరీత్యా, స్వభావసిద్ధంగా నజ్రులు అంతరంగిక స్వభావానికి అనుగుణంగా ఉన్నది. బరీంద్ర కుమార్ ఘోష్, అవినాశభట్టాచార్య లాంటి మాజీ అండమాను విప్లవకారులతో, నళినీకాంత్ సర్కారులాంటి సంగీతజ్ఞులతో, వారిలాంటి తదితర అతివాదులతో, విప్లవవాదులతో నజ్రులుకి వ్యక్తిగతంగాకూడా స్నేహసంబంధాలు ఏర్పడ్డాయి. నజ్రులు కల్లాకపటంలేని హృదయవర్తన, అతివాద దృక్పథం, సాహిత్య సంబంధ కార్యకలాపాలు "బిజిలీ"కి చెందిన రాజకీయ వర్గాలని సాహిత్యవర్గాలని ఆకట్టుకున్నాయి. ఆ వర్గాలవారు అత్యంతఉత్సాహంతో ఆయనని తమవాడిగా చేసుకున్నారు. ఇస్లాళ్ళకి ముస్లిము బెంగాలుకి ఓ ప్రతిభాశాలి లభించాడు. జాతీయ సమైక్యతకి అగ్రగామిగా గోచరించాడు.

ఈ విధంగా కొద్దిమాసాలకే బెంగాలులోని ప్రబుద్ధులైన పాఠకులకి, సంపాదకులకి కాజీ నజ్రులు ఇస్లాము అభినందనీయులయారు. ప్రత్యేకించి ఆయన పేరు ప్రెస్సుకి, కొత్త అతివాదభావాలు కలిగిన వ్యక్తులకి మరింత పూజనీయమైనదయింది. ఆయన రచనలని ముస్లిమ్ భారత్, సౌగాత్‌లాంటి ముస్లిం మాసపత్రికలతోపాటు ఉపాసన, భారతి లాంటి తదితర సాహిత్య ప్రచారసాధనాలు-చాలా కాలం నుంచి వెలువడుతున్న సాహిత్య మాసపత్రికలు ప్రచురించాయి. పోరాటానికి పిలుపునిచ్చే నూతన రాజకీయభావాలను బరీంద్రకుమార్ ప్రారంభించిన సరికొత్త వారపత్రిక బిజిలీ శక్తివంతంగా ప్రచారం చేస్తోంది. దాన్లో సోవియట్ యూనియను గురించి, అక్కడ జరుగుతున్న సోషలిస్టు విప్లవప్రయోగం గురించి సానుభూతితో కూడిన సమీక్షకూడా ఉండేది. ఆ పత్రిక నజ్రులుకి స్వాగతం పలికింది. ఆయన గద్యరచనలను పద్యరచనలను వరసగా ఎడతెరపి లేకుండావేశారు. ఆయనకి కవిత్వం చెప్పటంలో అద్భుతమైన ప్రతిభఉన్నదని, దానికితోడు పాటలు కట్టడంలోనూ, పాడటంలోనూ కూడా అంత గాఢావేశమూ ఉన్నదని తేటతెల్లమైంది. ఆయన రాసిన పాటలు, తనపాటలను, రవీంద్రుని పాటలను గానం చేసే గాయకుడిగా ఆయన కీర్తి ఆయనని కలకత్తాలో హిందువుల ఇళ్ళతో సహా అన్ని వర్గాల్లోనూ జనప్రియుణ్ణి చేశాయి. గాయకుడిగా ఆయన ఆకర్షణ మరింత ఎక్కువ. ఆయన జనం మధ్యకి వెళ్ళి జనసామాన్యంలో తానూ ఒకరిగా కలిసి

పోయేవారు. 'భారతి' గ్రూపు రచయితలు సుశిక్షితులు. ఉదారవాదులు. అయినా వారు ఉన్నతమైన అతివాద రాజకీయ భావాలు, సాహిత్యానికి సంబంధించిన భావాలు కలిగినవారు. నజ్రులుకి సముచితమైన స్వాగతం పలకటంలో వారుకూడా వెనుతియ్యలేదు. ఆయనని ప్రతిభాసంపన్నుడైన కవిగా, తమ ఆత్మీయుడిగా చేసుకున్నారు. ఆ గ్రూపులో ఠాగూరు తర్వాత 'బెంగాలీలో ద్వితీయకవి'గా పరిగణించబడే సత్యేంద్రనాథ్‌దత్త, మణిలాల్ గంగూలీ, ప్రేమాంకుర్ అటర్థి, మోహితలాల్ మజుందార్ వంటి రచయితలు ఉండేవారు. తనదైన ప్రత్యేకమైన గొంతు, విశిష్టగుణం ఉన్న కవిగా స్థిరీకరించబడినవాడు మోహితలాల్. ఆ మోహితలాల్‌కి నజ్రుల్ ఓ లబ్ధి. ఆయన నజ్రుల్ని గుర్తించారు. ఆయన వెంటనే (నజ్రులుతో పరిచయం కాకముందే) నజ్రుల్ని ప్రతిభావంతుడైన కవిగా ప్రత్యేకించి 'ముస్లిం భారత్'లో ప్రచురించబడిన నజ్రులు పద్యాలను రెండింటిని ఉదహరిస్తూ ఎంతో ఆత్మీయతతో అభినందించారు. నజ్రులు శైలి, శక్తివంతమైన శబ్దచయనం, అంత్యానుప్రాసఛందస్సు మీద ఆయనకున్న అధికారం, ఫారసీ శబ్దాల సమర్థవంతమైన చక్కని ప్రయోగం (నజ్రులు తన కవితల్లో ప్రయోగిస్తున్న విధంగా) వీటన్నిటితో బెంగాలీ కవిత్వానికి నూతన పుష్టిని, స్వరూపాన్ని ఆయన అందిస్తాడని తాను ఖచ్చితంగా నమ్ముతున్నానని మోహితలాలు వ్రాశారు. ఈ అభినందనలోని నిజాయితీ, ప్రేమాదరణా నజ్రులు మనస్సులో మోహితలాలు పట్ల పూజ్యభావాన్ని కలిగించాయి. తనకన్నా 14-15 సంవత్సరాలు పెద్దవాడు, బహుగ్రంథ పఠితా, కవీ అయిన మోహితలాలు పట్ల నజ్రులు అదే పూజ్యభావంతో 1922లో తన యుగకర్తృత్వపుగేయం 'విద్రోహీ' రాసిద్దరిని విడదీసినంత వరకూ ఉన్నారు. ఈ విషయం గురించిన ప్రస్తావన మన చర్చలోకి క్రమేణా వస్తుంది. కలకత్తా సాంఘిక జీవితానికి, సాంస్కృతిక జీవితానికి కొత్తవాడుగా ఉన్నరోజుల్లో నజ్రులు ఎలా ఎదిగారో అన్న దానినే ప్రస్తుతాంశంగా పరిశీలిద్దాం.

కలకత్తాలో నజ్రులుకి మొట్టమొదట కావలిసినది, అత్యవసరమైనదీ-పొట్ట పోసుకోడానికి కావలిసిన బతుకుతెరువు. ఆయన దగ్గర అంతక్రితం దాచుకుని ఆ సమయంలో వాడుకోడానికి వీలుగా ఉంచినదేమీలేదు. ఆయన మిత్రులు ముజఫరు అహమ్మదు వంటివారు కూడా ఆర్థికదృష్ట్యా బాగులేరు. ఆ రోజుల్లో 'ముస్లిం భారత్' లాంటి బెంగాలీ సాహిత్యపత్రికలు తమ రచయితలకి ప్రతిఫలం ఇచ్చేవికావు. ఒకే ఒక పత్రిక— కీర్తిశేషులు రామానంద చటర్జీ స్థాపించిన "ప్రవాసి" మాత్రం

తన రచయితలకి నవలకి పదిరూపాయిలు, గల్ప రచనలు కథ, వ్యాసం మొదలైన వాటికి పేజీకి మూడురూపాయిలు ఇచ్చేది. మొత్తం ప్రతిఫలం పదిహేనురూపాయిల కన్నా ఎక్కువ ఉండేదికాదు. ఆ రోజుల్లో మొట్టమొదటిసారిగా, ఒకే ఒక్క బెంగాలీ రచయిత - ప్రసిద్ధ నవలారచయిత శ్రీ శరత్‌చంద్ర చటర్జీ తన కలం బలంతో జీవితాన్ని గడిపాడు. అది ఆయన ప్రఖ్యాతికి, జనప్రియత్వానికి, పేరు ప్రతిష్ఠలకి బంగారు కాలం. అలా అయినా ఆయనకి "భారతవర్ష"లో ధారావాహికంగా వెలువడే తన నవలకి సామాన్యమైన నెలసరి ఆదాయం మాత్రమే క్రమబద్ధంగా దొరికేది. ఇతర రచయితలు గుమాస్తాగిరీ, ప్లీడరీ, అధ్యాపకం, జర్నలిజం లాంటి వేరే ఆధారాల మీద జీవించేవారు. నజ్రుల్‌కి జర్నలిజం ఒక్కటే అనుకూలమైన ఆధారం. అదృష్టవశాత్తు తొందరగానే ఆయనకి ఓ అవకాశం వచ్చింది. ఆయన మిత్రులు ముజఫరు అహమ్మదు ఓ కొత్త దిన పత్రిక నిమిత్తం డబ్బు ఏర్పాటుచేసే ప్రయత్నంలో ఉన్నారు. బెంగాలులో జాతీయ అగ్ర నాయకులలో ఒకరుగా అధికంగా పరిగణించబడే వారూ, కలకత్తా హైకోర్టు న్యాయవాది ఎ. కె. ఫజులుల్‌హక్ గారిని అంగీకరింప చేశారు. యావత్‌దేశం 1920లో ఉత్తేజంతో నిండి ఉన్నది. తమదైన ఓ సాధనం - ఓ పత్రిక కావాలని ఫజలుల్‌హక్ అనుకున్నారు విశేషించి ముస్లిం జాతీయ అభిప్రాయాన్ని సంఘటిత పరచడానికి తమ చేతిలో ఓ సాధనం ఉండటం అవసరం. పత్రికని సాయంకాలపు దినపత్రికగా రూపొందించి "నవయుగ" అని పేరు పెట్టారు. నజ్రులుఇస్లాం, ముజఫరు అహమ్మదు ఇద్దరూ సంయుక్తంగా సంపాదకులయ్యారు. ఈ విధంగా అంతగా పేరూ ప్రఖ్యాతీలేని వారి పర్యవేక్షణలో 12 జూలై 1920నుండి "నవయుగ్" అచ్చువడం మొదలయింది. ఈ ఇద్దరి యోగ్యత గురించి శ్రీ హక్‌కి ఏదైనా అనుమానం ఉన్నది అనుకుంటే అది కాస్తా అతిత్వరలోనే లేకుండా పోయింది. ఆనాటి సాంఘిక జీవితం మీద 'నవయుగ' ప్రభావం పడ్డది. ఆ పత్రికలోని శక్తివంతమైన బెంగాలీ భాషా శైలికి, స్పష్టమైన ప్రభావవంతమైన రాజకీయభావాలకి, అభిప్రాయాలకి ప్రజలు స్వాగతం పలికారు. ఇది పూర్తిగా జాతీయపత్రిక. దీనికి మిగిలిన వాటికన్నా ప్రజాస్వామ్యంపట్ల మొగ్గూ, దానితోపాటు జనసామాన్యం పట్ల స్పష్టమైన ఖచ్చితమైన సమర్పణాభావం కూడాఉంది. స్వాతంత్ర్యపోరాటంలో చదువుకున్నవర్గం కన్నా జనసామాన్యమే మహత్తరమైన పాత్ర వహిస్తుందని ఈ పత్రిక జనంవేపే

దృష్టిని అధికంగా కేంద్రీకరించింది. ముఖ్యంగా ఆ పత్రికకి నజ్రుల్ గొప్ప అండ. రచయితగా ఆయనకలం బలమైనది. జర్నలిస్టులభాషలో - ఆయనలో సంపాదకత్వపు ప్రతిభా, వార్తల వాసనని పసిగట్టే యోగ్యతా ఉన్నాయి. వీటన్నిటికన్నా విశేషించి చెప్పుకోవల్సిన విషయం మరోటి ఉన్నది. ఆయనకి సహజంగా ఉన్న ఉల్లాస ప్రవృత్తి వల్ల ఆయనవ్రాసే వార్తా వ్యాఖ్యల్లో హాస్యం చోటు చేసుకునేది. ఆ హాస్యం వల్ల 'నవయుగ'లోని ఆవేశపూరితమైన శక్తివంతమైన సంపాదకీయాలు సమతూకంలో ఉండేవి. నవయుగ కార్యాలయానికి సమీపంగా ఉండడానికిగాను మిత్రులు ఇద్దరూ టర్నరు స్ట్రీటులోకి మారారు. నజ్రుల్ ఉన్న కారణంచేత టర్నరు స్ట్రీటులో వాళ్ళిద్దరూ ఉండే చిన్నగదులు అన్నితరహాల సాహిత్యవేత్తలకు, అతివాదపు మొగ్గుఉన్న రాజకీయ వాదులకు, చురుకైన కార్యకలాపాలకి ముఖ్యమైన కేంద్రాలు అయాయి. హిందువులు, ముస్లిములు ఇరువర్గాల మధ్యా 'నవయుగ' విజయవంతమైంది. ఆ పత్రిక అతివాద భావాలు, సామ్రాజ్యవాద వ్యతిరేకత ప్రజల అభీష్టానికి అనుకూలంగా ఉండేవి. అయితే పత్రిక విజయమే పత్రికకి సమస్యలు తెచ్చిపెట్టింది. పత్రికలో అచ్చయే విషయాలపట్ల ఆనాటి ప్రభుత్వం, పోలీసులూ గట్టిగా అభ్యంతరం తెలియచేశారు. ప్రాథమిక ధరావత్తు సొమ్ము వెయ్యిరూపాయిల్ని జప్తుచేశారు. కొత్త ధరావత్తుగా రెండువేల రూపాయిల్ని కట్టమన్నారు. ఈ ధరావత్తుని సమకూర్చుకోడం సంపాదకులకి పెద్ద తలనొప్పిగా తయారయింది. అయితే ఈ ధరావత్తునీ మొదటి ధరావత్తులాగానే జప్తుచేశారు. సహజంగా, ఆయనకున్న విశిష్ట ప్రవృత్తి కారణంగా పత్రికాధిపతి ఫజలుల్‌హక్ గారిని ఏరకమైన చింతా బాధించేదికాదు. వారు అన్నిటికీ అతీతులు. డబ్బుపోగు చేయడానికి ఆయన తాపత్రయ పడలేదు. ఒకటిమాత్రం అంగీకరించాలి. వారు సంపాదకుల పనిలో కాని, వారి రచనల్లోగాని జోక్యం కలగచేసుకునేవారు కాదు. ఆయన పక్కా జాతీయవాది. జనసామాన్యం పట్ల సానుభూతి ఉన్న ఆయన నిజాయితీపరులు. ఆయన ఆనాటి రాజకీయాల్లో తానూ అడుగులో అడుగుకలిపి నడవలేకపోయారు. మహాత్మాగాంధీవేపు, ఆయన సహాయనిరాకరణ తీర్మానం వేపు జనం మళ్లుతున్నారు. 12 జూలై 1920ని నవయుగ ఆరంభమైంది. ఆగష్టులో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు ప్రత్యేక మహాసభలో సహాయనిరాకరణ తీర్మానం కోర్టులు, స్కూళ్ళు, కాలేజీలు బహిష్కరించాలని అంగీకరించబడ్డది. ఈ తీర్మానాన్ని

ఫజలుల్ హక్ (ఆయన వృత్తిరీత్యా వకీలు) సమర్థించలేదు. నవయుగ ఫరావత్తు నష్టపోయినప్పుడు ఆయనకి సంతోషమూ కలగలేదు. అలా అని ఫరావత్తు కట్టడానికి ఆయన కదిలి వెళ్ళనూలేదు. ధనాన్వేషణ కోసంగాను కొన్నాళ్ళ పాటు పత్రిక ప్రచురణని నిలిపివేశారు. యువ సంపాదకుల నిద్దరినీ హక్ తన ఊరు పఖార్, బారిసాల్‌కి ఆహ్వానించారు. ఈ యువ రచయిత లిద్దరూ స్నేహపూరిత సంభాషణలతో రాజకీయాల దృష్ట్యా హక్‌కి దగ్గరవారవతారని ఆశించటం జరిగింది. అయితే ఈ ఇద్దరూ రాజకీయంగా స్పష్టమైన అభిప్రాయాలు కలిగినవారు. వారిద్దరూ హక్‌తో మరింత అధికమైన అభిప్రాయ భేదంతో 'నవ యుగని' పునః ప్రారంభించారు. కాని నజ్రులు డిసెంబరు 1920లో హఠాత్తుగా పత్రికని వదిలిపెట్టేశారు. ఆ తర్వాత కొంతకాలానికి శ్రీ అహమ్మదు కూడా వదిలేశారు. జర్నలిజంలో మట్టి కొట్టుకుపోవడానికి బదులు, విశ్రాంతి తీసుకో డానికి, సాహిత్య రచనలు చేయడానికి నజ్రులు కలకత్తా వదిలి దేవఘర్ వెళ్ళి పోయారు. ముస్లింభారత్ సంస్థాపకులు దేవఘర్‌కి నెల నెలా నూరు రూపాయిలు పంపడానికి దానికి, బదులుగా నజ్రులు వ్రాసిన రచనలు అచ్చువేసే హక్కు తమదని నిశ్చయించుకున్నారు. కాని ఈ ఏర్పాటు పనిచెయ్యలేదు. నజ్రులు దేవ ఘర్‌కి అపరిచితుడు. ఎక్కడా పైసాపుట్టలేదు. దగ్గరదగ్గర రెండు నెలల తర్వాత మళ్ళీ ఆయన కలకత్తా రావలిసివచ్చింది. తిరిగి రెండోసారి నవ యుగలో కొద్దికాలంపాటు పనిచేయవలసివచ్చింది.

దేవఘర్‌లో గడిపిన ఈ కాలాన్ని రెండు కారణాలవల్ల పరిగణించవలసిన అవసరం ఉన్నది. దీనివల్ల నజ్రులు ఎంత అమాయకులో, ఎంత నిర్లక్ష్య వైఖరి కలవారో తెలుస్తుంది. మొదటి సంగతి తాను ఎరగని ప్రాంతానికి అపరి చితుడిగా వెళ్ళారు. అక్కడ ఆయనకి స్వాగతం చెప్పేవారు ఎవరూ లేరు. రెండో సంగతి - పోనీ అక్కడ ఉండడానికి గాని, భోజనాది ఏర్పాట్లు చేసు కోడానికి గాని ఆయన దగ్గర డబ్బులేదు. కారణం ఏదైనా అక్కడ ఒకటి రెండు గేయాలు (బేదన్ హారా) తప్ప విశేషించి చెప్పుకోదగినది ఏమీ ఆయన వ్రాయలేకపోయారు. అహమ్మదుకి ఆయన పరిస్థితి బాగులేదన్నసంగతి తెలియగానే, నజ్రులుని ఇంతకు పూర్వం చెప్పినట్టు కలకత్తా తీసుకువచ్చారు. ఎలాంటి తప్పుటభిప్రాయం కలగకుండా ఉండడానికి ఇక్కడ ఓ విషయాన్ని స్పష్టం చెయ్యవలసి ఉన్నది. నజ్రులులాగే ముజఫరుకూడా కేవలం సామ్రాజ్య వాద వ్యతిరేకి. శ్రామికవర్గ సమర్థకులు. బాహాటంగా శ్రామిక స్త్రీలను పురు

(2)

షలను ఆయన సమర్థించేవారు. ఏ వర్గానికి మొగ్గి ఉన్నారో నవయుగలోని రచనలవల్ల స్పష్టమౌతూనే ఉంది. అయినప్పటికీ 1920, 1921 ప్రారంభ దినాల వరకూ అహమ్మదుకి కమ్యూనిస్టులతో ఏ రకమైన సంబంధమూ లేదు. ఆయన స్వీయచరిత్ర చదివితే ఈ సంగతి స్పష్టంగా విదితమౌతుంది.

నవయుగని వదిలిపెట్టిన తర్వాత నజ్రులు మరో వ్యక్తిగతమైన దుస్థితిలో చిక్కుకున్నారు. ఆ సంఘటన అప్రియకరమైనది. హేయమైనది. కొద్ది రోజుల క్రితం నజ్రులుకి అలీఅక్బరుఖాను అన్న పేరుగలవ్యక్తి ముస్లిం భారత్ పత్రికా కార్యాలయంలో మిత్రుడయాడు. ఆయన చిన్నపిల్లల పాఠ్యపుస్తకాల ముద్రాపకుడు. నజ్రులు దగ్గరనుండి ఓ ఉత్తమ కవిత "లీచూదొంగ"ని ఆయన తీసుకోగలిగాడు. అలీఅక్బరు మనస్సులో ఓ ఎత్తూ, పన్నుగడా ఉన్నాయి. ఆయన నజ్రులు దయ సంపాదించాడు. తనతోపాటు నజ్రులుని తూర్పు బెంగాలులోని తిప్పేరా జిల్లాకి (తిప్పేరా జిల్లా ఇప్పుడు తన ముఖ్యకార్యాలయం కోమిల్లా పేరుతో వ్యవహరించబడుతోంది) చెందిన దౌలత్‌పూరుకి తీసుకువెళ్ళగలిగాడు. తోవలో కోమిల్లాలో నాలుగైదు రోజులపాటు వారు ఆగారు. అక్కడ ఇంద్ర కుమార్ సేన్‌గుప్త కుటుంబం తమ కందీరపడ ఇంట్లో వీరికి ఆతిధ్యం ఇవ్వటానికి సంతోషంతో అంగీకరించింది. ఇంద్రకుమార్ కుమారుడు వీరేంద్ర కుమార్‌సేన్ గుప్తకి అలీఅక్బరు స్కూల్లో చదువుకున్న రోజులునాటి స్నేహితుడు. ఆ ఇంట్లో ఖానుగారి మిత్రుడిగా నజ్రులు కూడా స్వాగత సత్కారాలు పొందాడు. సేన్‌గుప్తది మధ్యతరగతి కుటుంబం. ఆర్థిక దృష్ట్యా అంత బాగుండక పోయినా, ఆ కుటుంబంవారు చదువుకున్నవారు. ఉదార దృక్పథం కలవారు. కుటుంబంలో అందరికీ సాహిత్యమన్నా సంగీతమన్నా మంచి అభిరుచి ఉంది. అంచేత అక్కడ నజ్రులుకి ఘనస్వాగతమే లభించింది. ఇంటి ఇల్లాలు (ఇంద్రకుమార్ భార్య) విరాజ్ సుందరీదేవి స్నేహశీలి. ఆవిడా, ఆవిడలాంటి వారి వల్లనే వంగీయుల సమాజం ఈనాటికీ ఆనందదాయకమైన వ్యవస్థగా నిలిచి ఉన్నది. ఆమె చూపించే మాతృ వాత్సల్యం ఎంతమందినో ఆప్తులుగానూ మిత్రులుగానూ చేసింది. ఆ మిత్రులందరూ ఆవిడ తమందరికి తల్లి అని తలచేవారు. నజ్రులు నిరాడంబరులు, ప్రేమవాత్సల్యానికి, కల్లాకపటం ఎరగని ప్రవర్తనకి ఆయన హృదయం అధికంగా ప్రతిస్పందించేది. కొద్ది క్షణాలకే విరాజ్ సుందరిదేవిని ఆయన 'అమ్మా' అని పిలవడం మొదలుపెట్టారు. ఆవిడకి వరసకి చెల్లెలు

అయిన గిరిబాలాదేవిని (ఈవిడ విధవరాలు. ఈవిడ ఏకైక పుత్రిక ప్రమీల అప్పటికి పదమూడేళ్ళది— ప్రమీలని దూలీ అని దొలన్ అనీ పిలిచేవారు) "పిన్నమ్మా" అని పిలవడం మొదలుపెట్టారు. ఇలాగా ఓ వారమన్నా తిరక్కుండా అతి సహజంగా ఓ స్నేహపూరితమైన సంబంధం నిర్హేతుకంగా ఏర్పడింది. ఈ సంబంధం భవిష్యత్తులో ఓ రోజున అసంఖ్యాకంగా జరగ బోయే సంఘటనలకి కారణమౌతుందని ఎవరికీ తెలీదు. ఎంచేత అంటే ఆ తరువాత నజ్రులు ప్రమీలని వివాహం చేసుకోడం జరిగింది. మొదట ఎవరి మనసులోనూ ఏ రకమైనా ఆలోచనా, ఊహా లేదు. ప్రమీల చూడబోతే పద మూడేళ్ళదేమరి! నజ్రులు అలీ అక్బరుఖానుతో కలిసి దౌలత్పూర్‌కి వెళ్ళారు. సుమారు రెణ్ణెల్ల తర్వాత దౌలత్పూర్‌లో నజ్రులు పెళ్ళి జరగబోతోందన్న ఆహ్వాన పత్రికని అందుకుని కలకత్తాలోని ఆయన మిత్రులు ఆశ్చర్యపోయారు. నజ్రులు అలీఅక్బరుఖాను విధవ అప్ప చెల్లెలి కుమార్తె నర్గీస్ బేగమును (సైయీదా ఖాతున్) రాబోయే జూన్ (1921) మధ్య కాలంలో వివాహం చేసుకో బోతున్నారని ఆ ఆహ్వాన పత్రికలో ఉంది. కవుల ప్రవర్తన మహా చిత్రంగా ఉంటుందన్న విషయం లోకప్రసిద్ధమే. అతి తొందరగా ప్రేమలోపడ్డం, ఆ వెంటనే వివాహం చేసుకోడం కూడా చేస్తారు. పెరిగినతీరురీత్యా, స్వభావరీత్యా నజ్రులు ఇంచుమించు అలాంటి కవిగారే, కొమిల్లాలోని సేన్‌గుప్త యావత్తు కుటుంబాన్ని పిల్లల్ని పెద్దల్ని మొత్తం అందర్ని తన దగ్గర చుట్టాల్ని పిలిచి నట్టుగా దౌలత్పూర్‌లో జరిగే వివాహ వేడుకల్లో పాల్గొనవలిసింది అంటూ నజ్రులు ఎంతో సహజంగా ఉత్సాహంతో పిలిచారు. వీరందరికి దౌలత్పూర్‌వెళ్ళి మరీ చిత్రమైన ఉదంతాన్ని చూడవలసివచ్చింది. పెళ్ళిరోజు దగ్గర పడేవేళకి నజ్రులుకి అలీఅక్బరు ఓ పన్నాగం పన్నాడని బోధపడ్డది. తాను పెళ్లిచేసుకో బోతున్న అమ్మాయి పట్ల నజ్రులు మనస్సులో ఆకర్షణైతే ఉండడం ఉంది కాని, ఆ అమ్మాయి చదువుకున్నది కాదు. సంఘంలో మెలగడానికి కావలసిన గుణాలు ఆమెలో లేవు. వట్టి పల్లెటూరిపిల్ల. వ్యక్తిత్వం లేదు. నజ్రులు మనస్సుపాడైంది. దానికి తోడు పెళ్ళిరోజున వివాహ ఒడంబడికలో పెట్టిన నిబంధనలు అలీ అక్బరు నజ్రులుని ఓ తోలు బొమ్మగా చేసి తన స్వార్థానికి ఇచ్చానుసారం ఉపయోగించుకునే టట్టుగా ఉన్నాయి. నజ్రులు స్వాభిమానం కలవారు. ఈ అవమానాన్ని ఆయన సహించలేకపోయారు. పెళ్ళికి పెట్టిన నిబంధనలని ఆయన

అంగీకరించలేదు. వివాహ పత్రం మీద సంతకం పెట్టలేదు. ఈ విధంగా ఆ పెళ్ళి చట్టరీత్యా గాని వాస్తవంగాగాని జరగలేదు. కోపంతో విసుక్కుంటూ ఆయన దౌలత్‌పూర్ నుంచి కోమిలాకి వెళ్ళిపోయారు. సేన్‌గుప్త గారి కుటుంబం ఎంతో విచారపడుతూ సిగ్గుతో కుంచించుకుపోతూ ఆ పర్నాడు కొమిలాకి వచ్చింది.

ఆ విచారకరమైన సంఘటన ఈ మాదిరిగా జరిగింది. వాస్తవానికి ఇప్పటికీ నిజానిజాలు ఏమిటో సరిగా తెలియవు. ఈ వ్యవహారాన్ని చక్కపెట్టడానికి గాను అలీఅక్బరు ఖాను నజ్రుల్‌తో సంప్రదించడానికి కలకత్తా వెళ్లాడు. అయితే అది జరిగేపనికాదు. నజ్రులికి ఈ విషయం తిరగ తోడే ప్రసక్తేలేదు. సందేహాస్పద మైన రుజువులు ప్రమాణాలతో పెళ్ళిఅయింది అని అందరికీ చెప్పడానికి అలీఅక్బరు ఖాను ప్రయత్నించారు. కాని ఈ విషయంలో ముజఫరు అహమ్మదు గారి అభిప్రాయమూ మా అభిప్రాయమూ ఒకటే, ఆ పెళ్ళి జరగలేదనే మా నమ్మకం. కొందరికైతే సందేహం సందేహంగానే ఉండిపోయింది. దౌలత్‌పూర్ నుండి కొమిల్లాకి వచ్చేసేముందు పద్ధతి ప్రకారం నజ్రులు వివాహం జరిగి పోయిందా అన్నదే సందేహం. అయితే ఓ రుజువు మాత్రం ఓ విషయానికి ఉన్నది. వివాహ ప్రతిపాదనని అంగీకరించడానికి ముందు పెళ్ళికొడుకూ పెళ్లికూతురూ ఒకరిపట్ల ఒకరు ప్రేమాభిమానాలను పెంచుకున్నారు. నర్గీస్ బేగముని నజ్రులు చూసినప్పటికి ఆమె సంపూర్ణ యౌవనవతి. నజ్రులు ఆమెపట్ల ఆకర్షితులయారు. ఆమెపట్ల ఆయనకి ప్రేమభావం కలిగింది. నిండు మనస్సుతో పెళ్లి ప్రతిపాదనని ఆయన అంగీకరించారు. అయితే అలీఅక్బరు అతితెలివిని ప్రదర్శించారు. తన పినతండ్రి పన్నుగడని నర్గీస్‌బేగము మౌనంగా అంగీక రించిందనే అనిపిస్తుంది. అందులో ఆమె చెయ్యూ ఉంది. నజ్రులుని పెళ్ళి నిబంధనలతో కట్టి ఉంచాలన్నది అలీఅక్బరుగారి ఎత్తు. తన ప్రచురణలకి కూలికి పుస్తకాలు రాసే రాతగాడుగా పూర్తిగా బద్ధుడై నజ్రులు ఉండిపోవాలి.. నజ్రులు భ్రమ తొందరలోనే పటాపంచలైంది. ఆయన తిరగబడ్డారు. ఇహ నర్గీసు బేగం సంగతి దీనివల్ల పూర్తిగా కాకపోయినా కొంతవరకు ఆవిడా దెబ్బ తిన్నదన్న విషయం ఆ తరవాత జరిగిన సంఘటనల వలన తెలుస్తుంది. చాలా సంవత్సరాల వరకూ ఆవిడ అవివాహితురాలిగా ఉండిపోయింది. నజ్రులుతో సంపర్కం ఏర్పరచుకోడానికి ప్రయత్నిస్తూనే ఉంది. నజ్రులుకి ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాసింది. దేనికీ నజ్రులు జవాబు రాయలేదు. ఒకే ఒక్కదానికితప్ప..

అదే మొదటిది-చివరది కూడా. జూలై 1937న వ్రాసిన జవాబు. ఆ జవాబులో తన అసంగీకారాన్ని గట్టిగా తెలియచేశారు. అదే తారీఖున H. M. V.కి రికార్డు కోసం ఆయన ఓ పాట వ్రాశారు. ఆ పాట ఉన్న వాస్తవాన్ని వెల్లడి చేస్తోంది.

| | |
|---|---|
| పూలమాలతో ఎవరి కంఠాన్ని | (జార హాతే దియే మాలా |
| అలంకరించ లేకపోయావో | దితే పాలో నాయి కేనొమనే రాఖా |
| వారిని నీ మనస్సులో | తారె? |
| దాచుకుంటావెందుకని? | భూలెజావో తారె భూలెజావో |
| మరిచిపో-వారిని మరిచిపో | ఎకె బారె) |
| పూర్తిగా మరిచిపో! | |

ఆ ఉత్తరమూ, ఈపాటా ఆ సంఘటనలకు ఖచ్చితమైన రుజువు చెప్పేవిగా గోచరిస్తున్నాయి. పోగొట్టుకున్న వస్తువు తిరిగి దొరకదు. ఆ తర్వాత నర్గీసు బేగం యోగ్యుడైన భర్తని వెతుక్కొని వైవాహిక జీవితంలో స్థిరపడి సుఖ శాంతులతో గడిపింది. ఈ విధంగా ఈ సంబంధం ప్రారంభానికి ముందే అంతమై పోయింది. కాని ఓ వివాదానికి ఆధార రహితమైన, విచారకరమైన ఓ కథకి కారణ భూతమైంది.

దౌలత్‌పూర్ భంగపాటు నజ్రులు కవిత్వానికీ, పాటలకి చిత్రంగా వెల్లువని తెచ్చి పెట్టింది. విచారంతో నిండిన మనస్సు సహజంగా కుదుట బడటానికి మార్గాన్ని అన్వేషించింది. కోమిల్లాలో సేన్‌గుప్త కుటుంబపు స్నేహపూరితమైన ఆలనా పాలనాలో ఆయన మూడు వారాలకి తక్కువ కాకుండా ఉన్నారు (18 జూన్-6 జూలై 1921). నజ్రుల్ సృజనాత్మక రచనలో ఈ మూడు వారాల్లో ఓకొత్త వెల్లువ వచ్చింది. వివిధ ప్రేరణలతో ఆ సమయంలో కవితలు పుట్టుకు వచ్చాయి. అది 1921 (మే-జూన్) చిత్తరంజనదాసు నేతృత్వంలో సహాయ నిరాకరణ ఉద్యమంలో యావత్తు బెంగాలు- ముఖ్యంగా కొమిల్లా మునిగిఉంది. ఆ రాజకీయ వాతావరణానికి నజ్రులు సహజంగా ప్రతిస్పందించారు. ఆయన రాజకీయ గేయాల్లో ఆరోజుల్లో ఎక్కువగా ప్రచారంలోకి వచ్చిన గేయం మరణ వరణ్ (మృత్యువుకి ఆహ్వానం). ఆ గేయపు మొదటి పంక్తి "రమ్మ ఓ మరణమా! రమ్మ!" భయమన్నది లేకుండా మరణాన్ని ఎదురుకొనడానికి ప్రజలని సంసిద్ధులయేటట్టు ప్రోత్సాహపరచటం ఈ గేయం లక్ష్యం.

ఈ కవితలని సామాన్య పౌరుల కవితలని, లేదా సర్వజనుల కవితలు అనీ అనవచ్చు. వాటితోపాటు నజ్రుల్ మరోస్థాయికి చెందిన కవితలను, పాటలను కూడా రాశారు. వాటిని తర్వాత "పూర్వేర్ హవా" (తూర్పుగాలి) అనే కవితా సంకలనంగా వెలువరించారు. ఈ కవితలనిండా వైయక్తికమైన నాజూకు భావాలు, సున్నితమైన తియ్యటి భావాలు మనస్సుని ఆహ్లాదపరిచేవి కనపడతాయి. ఉదాహరణకి దుపుర్ అభిసార్ (మధ్యాహ్నపు అభిసారం)ని, 'జసకొథా సాయ్ ఎకలా ఓతుయి అలస్ వైశాఖే?' ("ఓ నా ప్రియతమా! ఎటువెళ్తున్నావు ఒంటరిగా? ఈ మందగమనపు బద్ధక మావరించిన వైశాఖంలో?") లేదా రేశమీ డోర్ (పట్టుదారం)-సేన్‌గుప్త కుటుంబంలోని పిల్లల్ని ఉద్దేశించి వ్రాసిన కవితని పేర్కొన వచ్చును.

తోరా కొథా హతె కేమ్నె ఎసె మణిమాలార్ మతొ అమార్ కంఠే జరాలీ?

("ఎక్కణ్ణించి వచ్చారు మీరంతా
వజ్రహారంలా
నా మెడని
ఎలా అల్లుకు పోయారు!)

దౌలత్‌పూర్ భంగపాటు తర్వాత ఆయనకి ప్రేమాభిమానాలు ఎంతగా కావలసివచ్చాయో, ఆ ప్రేమాభిమానాల్ని సేన్‌గుప్త కుటుంబం నుండి ఆయన ఎలా పొందారో, ఆయన హృదయం ఎంత విచారగ్రస్తంగా ఉందో, ఎంత ఆకలితో ఉందో ఈ కవితలో స్పష్టంగా ప్రస్తావించబడ్డది. "స్నేహాతుర" అన్న గేయంలో కూడా ఇలాంటి మనోభావాన్నే వెల్లడించారు. ఆ ఇంటిని నడిపే మాతృమూర్తిని సంబోధిస్తూ ఈ గేయాన్ని వ్రాశారు. ఆమె ప్రేమ, వాత్సల్యాలతో ఆయన హృదయాన్ని ఆవరించిన శూన్యం తొలగిపోయింది. అభిమానిని అన్న దుఃఖపూరితమైన దీర్ఘకవితలోనూ ఇలాంటి ప్రస్తావనే గోచరిస్తుంది. ఆ సమయంలోనే ఆ మాతృమూర్తి చిన్నకూతురు మరణించింది. ఆ మరణాన్ని గురించి వ్రాసినదే ఈ కవిత. పులక్ (పులకరింత) అన్న పాటలో లాగ కొన్ని పాటల్లో. ఆహ్లాదమూ, ఆనందము కూడా ధ్వనిస్తాయి. ప్రకృతిలోని రంగుల ఆర్భాటాన్ని చూసినప్పుడు కలిగిన ఆనందానుభవమే ఈ పాట! ఇంచుమించు ఏమీ ఎరుగని

అనాగరికుడి ఆనందానుభవం లాంటిది ఈ అనుభవం. చక్షుశ్రవ్య సంవేదనల సాదృశ్యతని నజ్రులు ఎలా గుర్తించారో ఈ పాట కట్టిన విధానం వెల్లడిచేస్తుంది. తర్వాత రచించిన ఇతర రచనలతోపాటు 1925లో వెలువడిన పూర్వేర్ హవా (తూరుపుగాలి) సంకలనంలో ఈ పాటలు, పద్యాలు చేర్చబడ్డాయి. ముందుగా 1921లో బెంగాలీ పత్రికల్లో ఇవన్నీ అచ్చు అయాయి. జూలై 1921లో ముజఫర్ అహమ్మదుతో కలిసి నజ్రులు తన జీవితాన్ని తిరిగి ప్రారంభించ టానికి, సాహిత్యరంగంలో తన లక్ష్యాన్ని సాధించటానికి తిరిగి కలకత్తావెళ్ళారు.

వాస్తవానికి 1921వ సంవత్సరం ఎంతో ఉత్తేజకరమైన సంవత్సరం. అతి స్వార్థపరుడైన ఏ అసాధారణ వ్యక్తినో తప్పించి ఆ ఉత్తేజం మరి ఏ ఒక్కరికి వ్యక్తిగతమైన బాధల నివారణలో తలమునకలై ఉండడానికి వీలు ఇవ్వలేదు. నజ్రులు స్వభావరీత్యా విలక్షణమైనవారు. కొమిల్లాలోనే ఆ విలక్షణత్వాన్ని గమనించాం. సేన్‌గుప్త కుటుంబంవారు సానుభూతితో చేసిన పరిచర్యలు దౌలత్‌పూర్‌లో ఆయన పొందిన భంగపాటుని మరిచిపోవడానికి ఓవంక పనిచేశాయి. రెండో వంక ఆ తూర్పుబెంగాలు పట్టణంలో రాజకీయ జీవితంలో పొంగుకువస్తున్న ఆటుపోటులు సహకరించాయి. 1921 జూలైలో కలకత్తా తిరిగి వచ్చాక, సాంఘిక జీవితంతో, రాజకీయపరమైన ఉత్తేజంతో, సాహిత్య కార్యకలాపాలతో, బెంగాలీ జీవితపు ప్రధానలక్షణం అయిన సాహిత్య గోష్ఠులతో, పాట కచేరీలతో నిరంతరంసాగే "అడ్డా" లతో నజ్రులు అతి సుళువుగా తాదాత్మ్యం చెందారు. ఆయనకి బతుకుతెరువుకి కావలిసిన సాధనం ఏదీ ఇదమిత్థంగా ఇంకా దొరకనిమాట నిజమే. అహమ్మదు ఒక లిమిటెడ్ కంపెనీని ప్రారంభించే ప్రయత్నంలో ఉన్నారు. దాని ద్వారా కొత్తవార్తాపత్రికకి డబ్బు చేకూర్చుకోవచ్చుననీ అనుకున్నారు. అయితే ఆయన ప్రయత్నం ఫలించలేదు. తన కావ్యరచనలోనూ పాటలు కట్టడంలోనూ నజ్రులు ముందుకు సాగడానికి ఇదేమీ ఆటకం కాలేదు.

ఇక్కడ నజ్రులురాసిన కవితలు- చెప్పుకోదగిన రెండు కవితల గురించి ఉటంకించాలి. ఇవి సత్యేంద్రనాధదత్తని సంబోధించి రాసిన కవితలు- ఇంతకు పూర్వం చెప్పినట్టుగా టాగూరు తర్వాత, ద్వితీయకవిగా శ్రీదత్త పరిగణించబడే వారు. సత్యేంద్రనాధగారి కంటిచూపు అతి శీఘ్రగతితో తగ్గిపోతూ వచ్చింది. నలభైఏళ్ళ వయస్సుకే అకాలమరణం చెందేరోజు (24 జూన్ 1922) కూడా దగ్గరపడ్డది. ఆయన స్థితికి, బాధకి నజ్రులు హృదయం చలించింది. సత్యేంద్ర

నాథ్‌గారిని సంబోధిస్తూ సెప్టెంబరు 1921లో 'దిల్ దరదీ' (ప్రేమించేహృదయం) కవితను వ్రాశారు. ఈ కవితలోని నిజాయితీకి అగ్రజుడైన ఆ కవిగారు కూడా ప్రభావితులయారు. సత్యేంద్రనాథ్ నజ్రులుకి కృతజ్ఞతలు తెలియచెయ్యడానికి స్వయంగా నజ్రులుఉండే తాలతలా ఇంటికి వెళ్లారు. దురదృష్టవశాత్తూ వారిద్దరూ కలవడం పడలేదు. ఆయన వెళ్ళిన సమయానికి నజ్రులు ఇంటి దగ్గరలేరు. ఈ ఇద్దరు కవులకి అనేక విషయాల్లో సారూప్యం ఉంది. ఇద్దరిలోనూ అకుంఠితమైన దేశభక్తి భావం, అభివృద్ధిపథపు సాంఘికభావాలు సమానంగా ఉండేవి. ఇద్దరూ కావ్యశైలి దృష్ట్యా కూడా ఎంతో విశిష్టమైన ధ్వని ప్రయోగాలను, ఛందస్సులను ఇష్టపడేవారు. కాని ఓ సంవత్సరంలో సత్యేంద్రనాథ్ ఈలోకాన్నే విడిచిపెట్టి వెళ్ళిపోనున్నారు. రవీంద్రనాథ టాగూరుకూడా ఈ అకాలమరణం గురించి ఉదాత్తమైన కవిత రచించారు. నజ్రులు ఆవేదనతో దీటైన ఉదాత్తగీతాన్ని రచించి ఆలాపించారు. ఆ గీతం మొదటి పంక్తులు-

చల-చంచల బాణీర దులాల్ ఎసిఛిలొపథ భూలె ఓగొ ఎయి గంగార కూలె-

(చురుకైనవాడు, ఉల్లాసవంతుడు, కళాధి దేవత గారాబుపుత్రుడు దారి తప్పి ఈ గంగాతీరానికి వచ్చాడర్రా !)

ఈ సందర్భంలోనే సత్యేంద్రనాథ్‌కి నజ్రులు మూడోసారి శ్రద్ధాంజలి సమర్పించారు. "సత్యకవి" అనే ఈ శ్రద్ధాంజలికి సత్యేంద్రనాథ్ వ్యక్తిగానూ కవిగానూ కూడా సముచితమైన అర్హతకలవారు. ఈ శ్రద్ధాంజలిలో వెలువరించిన నిజాయితీ వలనా, కావ్యగత వైశిష్ట్యం వలనా నజ్రులు పేరుప్రతిష్ఠలు పెరిగాయి. ఈ కవులు ఇద్దరూ సత్యంకోసం పోరాడారు. తమ కవిత్వం పట్లా, సమకాలీన సంఘటనల పట్లా ప్రజాపోరాటాల పట్లా ఇద్దరూ నిజాయితీ ఉన్నవారు.

దీనిని అవగాహన చేసుకోడానికి, ఆ సమయంలో (జూలై 1921-22) రాజకీయ జీవితం సంక్షోభానికి గురి అయిందన్న సంగతి తప్పక చెప్పితీరాలి. కరాచీకేసులో కఠినశిక్షపొంది జైలుకి వెళ్ళిన నాయకుల్లో మొట్టమొదటివారు ఆలీ సోదరులు. మౌలానా మహమ్మదుఆలీ, షౌకత్ ఆలీలు. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని నజ్రులు తన కవితల్లో జనసామాన్యంలో సర్వత్రా పెల్లుబికిన క్రోధాన్ని వ్యక్తీకరించారు. అయితే 1921వ సంవత్సరంనాటి ఆ వాతావర

జంలో క్రోధంతోపాటు, ఖచ్చితమైన దృఢసంకల్పం, ఆ సంకల్పం తప్పకుండా నెరవేరుతుందన్న ఆశాకూడా ఉన్నాయి. ఆ సంవత్సరం "స్వరాజ్య సంవత్సరం" గాంధీగారు ఇచ్చిన మాటప్రకారం ఓసంవత్సరంలో స్వాతంత్ర్యం లభించితీరాలి. రాజకీయ ఉద్యమం అభూతపూర్వమైన వరదలా ముందుకి సాగిపోతోంది. నెలలు గడుస్తున్నకొలదీ, వారంవారానికి మరెంతబలం పుంజుకుంటోంది. బ్రిటిష అధికారులు తమ పక్షం బలహీన మవుతున్నట్టు చివరకు తెలుసుకున్నారు. దాంతో కలిగిన దిగులూ కలతలతో మరింత ఆహాటంగానూ కఠినంగానూ దెబ్బ తియ్యటం మొదలుపెట్టారు. ఈ ఉద్యమాన్ని నిరోధించాలి. కాంగ్రెసు కార్యకలాపాలను ఆపాలి. అందుకుగాను భారతదేశంలో ఇంచుమించు అన్ని ప్రాంతాల్లోనూ స్వరాజ్యంకోసం చురుకుగా శక్తివంతంగా పనిచేసే కాంగ్రెసు స్వయంసేవకదళం మీద నిషేధాజ్ఞలు జారీచేశారు. దీనికి తక్షణ పర్యవసానంగా కాంగ్రెసుకార్యకర్తలు పెద్దపెట్టున సత్యాగ్రహాలు చెయ్యటం, నిషేధాన్ని శాంతియుతమార్గాల్లో ఉల్లంఘించడం మొదలయింది. వేలాది పురుషులు నిర్బంధానికి గురి అయ్యారు. మహిళలూ ముందంజవేశారు. మొదటి విడత ముగ్గురు మహిళా సత్యాగ్రహుల వశానికి కలకత్తాలో (శ్రీమతి పి. ఆర్. దాసు) నాయకత్వం వహించారు. యావత్ భారతదేశంలో వందలాది మహిళలు వారిని అనుసరించారు. ప్రతిరాష్ట్రంలో వేలాదిమంది నాయకులు ఉద్యమ కార్యకర్తలు శాంతియుతంగా సత్యాగ్రహం చేశారు. సత్యాగ్రహులతో పోలీసు వాహనాలు నిండిపోయాయి. తమ ఆత్మరక్షణకిగాని విడుదలకిగాని నిర్బంధానికి గురి అయిన వారెవరూ ఏప్రయత్నం చెయ్యకుండా కారాగార శిక్షల్ని స్వీకరించారు. ప్రత్యేకించి కట్టించిన కారాగారాలు కూడా సరిపడకపోవడంతో అధికారులు జనాన్ని కేవలం వేధించే ఉద్దేశంతో నిర్బంధించడం, ఏ విచారణా లేకుండా, వదిలివెయ్యడం చేశారు. సందర్భవశాత్తూ మన కాంగ్రెసు నాయకులలో చాలామంది గొప్పవారికి— చిత్తరంజనదాసు, మోతీలాలునెహ్రూ, హకీమ్ అజ్మల్ఖాను, డాక్టరు అన్సారీ- వీరికన్న తక్కువ అనుభవంకలకారు జవహరులాలునెహ్రూ, సుభాష్చంద్రబోస్ మొదలైన వారందరికి బాధలగురించిన మొదటి జ్ఞానోదయం ఈ సందర్భంలోనే కలిగింది.కారాగార జీవితపుబాధని తెలుసుకోడానికిఇదే మొదటిఅవకాశం. 1947లో స్వాతంత్ర్యం లభించేవరకూ ఈ నాయకులందరికీ తరుచు కారాగారాలకి వెళ్ళవలసి వచ్చింది. ఇది మనం అందరం ఎరిగిన విషయమే. స్వాతంత్రం కాంక్షించే

లక్షలాదిజనానికి బ్రిటిషు కారాగారాలంటే వెరపుపోయింది. కారాగారాలకి వెళ్లడం అన్నది స్వాతంత్ర్యోద్యమం కోసం చేసిన దేశసేవకి చిహ్నంగా పరిగణించ బడేది. పర్యవసానంగా ఇది కవులమీదా, జనసామాన్యంమీదా ఒకేరకమైన నైతిక ప్రభావాన్ని పెంపొందిస్తూ వచ్చింది.

అహమ్మదాబాదులో 1921 డిసెంబరు చివరిదినాల్లో కాంగ్రెసు వార్షిక సమావేశం జరిగింది. ఆ సమావేశపు అధ్యక్షులు సి. ఆర్. దాసు, తదితర కాంగ్రెసు నాయకులు రమారమి యావన్మంది జైలు కటకటాల వెనక్కి వెళ్లారు. మహాత్మాగాంధీని ఒక్కణ్ణి మాత్రమే దీనికి మినహాయింపుగా యుక్తితో నిర్బంధిం చడం మానేశారు. ఊహించని విధంగా తర్వాత జరిగిన సంఘటనలు రుజావు చేసినట్టుగా సర్వత్రా విస్తరించిఉన్న క్రోధపు మందుగుండుకి చివరిసారి రంజకం అంటించకుండా జనసామాన్యాన్ని నిరోధించాలి. అంచేతే ఎంతో వివేకంతో గాంధీగారిని నిర్బంధించడం మానేశారు. అయినా 1921లో ఆరోజుల్లో కవులు, జనసామాన్యం- అంతమందీ ఊపిరి బిగబట్టి మరీ ఎదురుచూస్తున్నారు. అహమ్మదా బాదులో ఉద్విగ్నమైన వాతావరణంలో స్వరాజ్యం ప్రకటించవలసిన స్థలంలో ప్రతినిధులు కలుసుకున్నారు. ఒకరిదగ్గర ఒకరు సెలవు తీసుకున్నారు. జాతీయ పోరాటపు విజయంతో క్షితిజాన ఆశాజనకంగా 1922వ సంవత్సరం ఉదయించ బోతున్నాదని తోచింది. ఇది వాగ్దానప్రకారం పన్నులనిరాకరణ ఉద్యమంగా, స్వాతంత్ర్యంకోసం జరిగే శాంతియుతమైన పోరాటంగా ముందుకి సాగుతుందని ఆశించడం జరిగింది. జాతీయనాయకుడు మహాత్మాగాంధీ ఆదేశంతో ఏక్షణంలో అయినా ఉద్యమం ప్రారంభం కావలసి ఉంది.

1921-22ల్లో నజ్రులు జీవితాన్ని, ఆయన కార్యకలాపాలకి సంబంధించిన నేపథ్యాన్ని అతి తక్కువలో రేఖాచిత్రమాత్రంగా అందచేస్తూ, ఈ అధ్యాయాన్ని సంక్షిప్తీకరించి చెప్పడానికి పైన చెప్పిన ఆ ఆదేశం ఇచ్చేక్షణం అన్నది అసలు రానేరాలేదని చెపితేచాలు, సరిపోతుంది. అంతకన్నా ముందే సర్వత్రా విస్తరించిన క్రోధం ఉత్సాహం కట్టలు తెగే ఉన్నాయి. 1922 జనవరిలో ఉత్తరప్రదేశ్‌కి చెందిన చౌరీచౌరా అనే గ్రామంలో తీవ్రమైన దౌర్జన్యకాండ జరిగింది. 'ఉద్య మాన్ని ఆపండి, జనసామాన్యం అహింసా పాఠాల్ని నేర్చుకోలేదు' అని గట్టిగా ప్రకటించడానికి గాంధీగారికి ఈ సంఘటన సూచించింది. మరేమాత్రం జాప్యం చెయ్యకుండా వెనువెంటనే 1922 ఫిబ్రవరిలో బార్డోలి (గుజరాతు)లో కాంగ్రెసు

కార్యవర్గ సమావేశం జరిపారు. గాంధీగారి ఆదేశానుసారం బార్డోలీ తీర్మానం స్వీకరించబడ్డది. ఉద్యమాన్ని వెంటనే సంపూర్ణంగా నిలిపివేయాలనీ, యావత్ భారత దేశంలో కాంగ్రెసు నిర్మాణాత్మక కార్యక్రమాలను చేపట్టాలని ఈ తీర్మానం చెప్పింది. అంటే నూలు వడకటం, నేయటం, గ్రామోద్ధరణం, హిందూ ముస్లిం సమైక్యతని పెంపొందించడం (తర్వాత అస్పృశ్యతా నివారణని కూడా వీటితోపాటు చేర్చారు) మొదలైన కార్యక్రమాలను జరపాలి. ఈ ప్రతిపాదనతో గాంధీగారి ప్రత్యక్షచర్యతో కూడిన స్వరాజ్యపోరాటంలోని మొదటిదశ ముగిసింది. 1930లో ఉప్పు సత్యాగ్రహం, శాసన ధిక్కారం ఉద్యమంతో ప్రత్యక్ష చర్యతో కూడిన రెండవదశ ప్రారంభం కావలసి ఉంది. ఈ మధ్య సంవత్సరాలు గాంధీగారి జైలు శిక్షలూ, సి. ఆర్. దాసు మోతీలాల్‌నెహ్రూల నేతృత్వంలో స్వరాజ్య పార్టీ జరిపిన పార్లమెంటరీ పోరాటాల సంవత్సరాలు. నజ్రులుకి ఈ సంవత్సరాలు తిరుగుబాటు కవిగా, ప్రజల పునరుత్థానకవిగా వేగంతో మిరిమిట్లు కొలిపే ఎత్తులకు ఎదిగిన సంవత్సరాలు.

# 3. 'విద్రోహి కవి' : తిరుగుబాటు కవి

1921వ సంవత్సరం నవంబరు డిసెంబరు మాసాల్లో 'స్వరాజ్య సంవత్సరం పరాకాష్ఠకి చేరుకుంది అని తెలుసుకున్నాం. డిసెంబరు పదవతారీఖున బెంగాలులో ఛిత్తరంజన దాసుని జైల్లో పెట్టారు. అలాగనే ఇంచుమించు తదితర కాంగ్రెసు నాయకులందరినీ విప్లవకారులనీ పట్టుకున్నారు. దేశబంధు వారపత్రిక 'బంగ్లార్‌కథ' ఇప్పుడు వాసంతీదేవి పర్యవేక్షణకి వచ్చింది. దాసుగారు, వారి వార్యా వారి రాజకీయ దళానికి చెందిన వారందరూ స్వదేశీ ఉద్యమ కాలానికి రవీంద్రుడు కవి అయినట్టు, కాజీ నజ్రులు ఇస్లాం నవయుగపు నవ్యకవి అని అభిమానించి ఇష్టపడేవారు. ఏ ఉద్యమానికైనా విశిష్టుడైన ఒకవి దొరికితేనే బెంగాలీలు సంతోషిస్తారు. అంచేత వాసంతీ దేవికి నజ్రులు గురించిన ఆలోచన వచ్చింది. 'బంగ్లార్ కథ' కోసం రచనలు పంపమని అభ్యర్థించింది. నజ్రులు ఆమె అభ్యర్థనని ఎంతో ఆనందంగా అంగీకరించారు. నజ్రులుకి అసలు దేశబంధు అంటే ఆరాధనా భావం ఉంది. జాతీయోద్యమంకోసం చిత్తరంజనదాసు గారి నిజాయితీ, త్యాగం అనేకమంది బెంగాలీలను కదిలించినట్టుగానే, నజ్రులుహృదయాన్నీ కదిలించింది. నజ్రులు 'బంగ్లార్‌కథ' పత్రికకోసం ఉద్యమం మీద అమరగీతం భంగార్ గాన్ (వినాశగీతం) రాశారు. ఆరోజుల్లో వెల్లి విరిసిన పోరాట మనఃస్థితికి ఆ గీతం అద్దం పట్టింది.

బ్రద్దలు కొట్టండి
కారాగారపు
ఈ లోహకవాటాన్ని!
ముక్కముక్కలు చెయ్యండి
దాస్యశృంఖలాల
దేవతా రాధనకై
రక్తస్నానం చేసే
ఈ పాషాణ వేదికని!

(కారార్ ఒయి లోహ
కవాట్
భెంగెఫేల్ కర్-రెలో
పాట్!
రక్తజామా
శికల్ పూజార్
పాషా ణ బేది........)

ఇదే జాతీయోద్యమపు మొట్టమొదటి గొప్పపాట. ముందురోజులనాటి

స్వదేశీగీతాలకన్నా అధికతీవ్రత ఉన్న పాట. నజ్రుల్ ముమ్ముందు రాయబోయే పాటలకి దారి వేసినపాట. ఆ పాట వరసా, మాటలకూర్పూ, కార్యరంగంలోకి దూసుకురమ్మని ఆహ్వానిస్తూ జనంలో స్పందన కలిగిస్తూ తిరుగులేని ప్రభావాన్ని ప్రసరించాయి. సహజంగానే ఈ పాటని నిషేధించాలన్న ప్రయత్నం జరిగింది. కాని 1947 వరకూ లెక్కలేనన్ని వేదికలమీద నుండి జనం ఈ పాటని స్వాతంత్ర్య పోరాటం జరిగినన్నాళ్లూ పాడారు. ఇక్కడ ఓ విషయం చెప్పాలి. ఆ వెంటనే వాసంతీదేవి నజ్రులుని తమ ఇంటికి ఆహ్వానించింది. ఆతిథ్యంలో పేరుపొందిన దాసు కుటుంబపు అతిథి సత్కారాలు నజ్రులుకి ఎలాగా దొరికాయి. వాటితోపాటు ప్రేమాశీస్సులు కూడా లభించాయి. ఆయన ఆ ఆశీస్సులని ఎప్పుడూ మరిచిపోలేదన్న విషయం 'చిత్తనామా' రచనలో స్పష్టంగా తెలుస్తుంది.

1921 చివరిరోజుల్లో ఉద్యమం విద్యుత్తులా వ్యాపించింది. నజ్రులులాంటి వ్యక్తికోసం సరిగ్గా ఆయన ఆశించిన విధంగానే, జాతీయ భావాల వెల్లువముంచుకొచ్చింది. నజ్రులుతోపాటు ఆ రోజుల్లో ఆయన గదిలో ఉండే మిత్రుడు ముజఫర్ అహమ్మద్ చెప్పిన ప్రకారం-1921 డిసెంబరు ఆఖరివారంలో ఓ రోజురాత్రి నజ్రులు చాలా పొద్దుపోయేవరకూ పెన్సిలుతో రాస్తూనే ఉన్నారట. ఓ దీర్ఘ కవిత రాస్తున్నట్లుగా కనిపించారట. మరునటి రోజు ఉదయాన్నే నజ్రులు మొట్టమొదట చేసిన పని తన కొత్త కవితను ముజఫర్ అహమ్మదుకి వినిపించడం. ఆ రచనే 'విద్రోహి' (తిరుగుబాటుదారు)

చెప్పరా వీరుడా
తలవంచనని
చెప్పరా!
ఎలుగెత్తి
చాటి చెప్పరా!
తల వంగదని
చెప్పరా!

("బోలో బీర్
బోలో ఉన్నత
మను సిర్")

అవిస్మరణీయమైన ఈ పంక్తులు అలా అలా ముందుకి సాగిపోతాయి. నజ్రుల్‌కే ఇది ఓ గొప్ప రచన, అద్వితీయమైన రచన అని కచ్చితంగా అనిపించింది. కవితను అచ్చువేయించడం ఖాయం. అందులో ఏం సందేహంలేదు.

కాని సమయం మించి పోకూడదు. నజ్రులు స్వంతవేదిక అయిన ముస్లిం భారత్‌కి ఈ రచనమీద మొదటిహక్కు ఉంది. అయితే దురదృష్టవశాత్తూ ముస్లిం భారత మాసపత్రిక. అందులోనూ అడపాతడపా వెలువడుతోందే తప్ప క్రమబద్ధంగా రావటంలేదు. అందులో కవితని అచ్చువేయడం అంటే జాప్యం అవుతుంది. జాప్యం జరగడం కవికీ ఇష్టం లేదు. ఆయన మిత్రవర్గానికీ ఇష్టం లేదు. ముస్లిం భారత్ తన వీలునుబట్టి ఈ రచనను ఎలాగూ అచ్చు వేసుకుంటుంది. (తర్వాత అందులో అచ్చు అయింది కూడా). హరీంద్రకుమార్ ఘోష్‌గారి వార పత్రిక 'బిజిలీ' నజ్రుల్ని ఆ రచనకోసం అభ్యర్థించింది. అలా ఆ కవితని మొట్ట మొదట పాఠకుల ముందుకు తెచ్చిన ఖ్యాతి బెంగాలులోని పాఠక వర్గంలో సంచలనం కలిగించిన కీర్తి 'బిజిలి' పత్రికకే లభించింది. పాఠకుల కోరికమీద ఆ బిజిలి పత్రిక సంచికని మళ్ళీ రెండోసారి కూడా అచ్చు వేశారు. ఓ రిపోర్టు ప్రకారం బిజిలీలో కవిత అచ్చయ్యాక, నజ్రులు ఆ సంచికని తీసుకొని జోడాసాంకోలో ఉన్న రవీంద్రనాథునిదగ్గరికి వెళ్ళారు. తనకి సహజమైన ఉత్సాహంతో గురుదేవ్‌కి కవితని చదివి వినిపించారు. కవితని విని గురుదేవ్ ముగ్ధులయ్యారు. నజ్రుల్ని ఆశీర్వదించి, ఆయన ఉజ్జ్వలభవిష్యత్తుకి శుభాకాంక్షలు తెలియచేశారు* ఏది ఏమైనా 'విద్రోహి' అచ్చు అయాక రెప్పపాటు కాలంలో నజ్రులు ప్రఖ్యాత కవి అయ్యారన్నది నిర్వివాదం.

'విద్రోహి' గొప్ప కవిత అయినా లోపాలు లేని కవిత కాదు. ఆ రోజుల్లోనూ వివేచనాపరులైన పాఠకులు ఈ సంగతిని గుర్తించారు. నజ్రులు ఆరాధ

---

* ఈ సంఘటన వాస్తవమే అయితే తేదీల విషయంలో ఓ అనుమానం వస్తుంది. ఎంచేత అంటే 21 పుష్యం వం. సం. 1922 జనవరి 4వ తేదీని రవీంద్రుడు శాంతినికేతనానికి వెళ్ళిపోయారు. అక్కడ ఆయన ముక్తధార రాయటంలో నిమగ్నులయ్యారు. నజ్రులు రవీంద్రుణ్ణి కలుసుకున్నారు. ఆయన ఆశీస్సులను అందుకున్నారు. అందులో సందేహము ఎంతమాత్రం లేదు. కాని ఆ సమయంలోనూ ఆ తేదీని మాత్రంకాదు అనిపిస్తుంది. (సరిపోల్చిచూడండి ప్రభాత్‌కుమార్ ముఖోపాధ్యాయ-రవీంద్రజీవనీ - మూడవ భాగం పుటసంఖ్య-91, 1359 వం. సం. ముజఫర్ అహమ్మద్, స్మృతి కథ పుట సంఖ్య 238.

కులు ఈ రోజుకు కూడా లోపాలున్నాయని అంగీకరిస్తారు. అయితే ఈ లోపాలు చాలా అల్పమైనవి. వాస్తవానికి 'విద్రోహి' బెంగాలు సాహిత్య జీవితం లోనూ జాతీయ జీవనంలోనూ అద్భుతమైన సంఘటన. ఆ రోజుల్లోని జీవితాన్ని దాని నేపథ్యాన్ని గుర్తుకు తెచ్చుకుంటే ఆనాటి వాతావరణంలో "తిరుగుబాటు" వ్యాపించి ఉంది అని తెలుస్తుంది. 'విద్రోహి' కవితలాంటి దానికోసమే జనం ఎదురుచూస్తున్నారు. ఈ కవితని రచించటానికి సరిగ్గా సరిపోయిన వ్యక్తి కవి నజ్రులు. ఆయన ఆదే మనఃస్థితిలో ఉన్నారు. ఆయన వ్యక్తిగత ఔన్నత్యపు సౌందర్యంతో తీవ్రంగా విజృంభిస్తూ జీవితంలో ముందుకు కొట్టుకు పోవడానికి సాగిపోవడానికి కావలసిన వ్యక్తిగతమైన స్వేచ్ఛ కోసం, జాతీయస్వాతంత్ర్యం కోసం తపన పడుతున్నవాడు. ఏ రకమైన శృంఖ లాలను సహించనివాడు. తిరుగుబాటుదారు. ఈ రెండు ఉద్వేగాలు - వైయక్తిక స్వేచ్ఛ- జాతీయ స్వాతంత్ర్యం- ఎక్కడ కలుస్తాయో ఆయనకి తెలిసీతెలియని విధంగా బోధ పడ్డది. ఈ రెండు ఉద్వేగాలు మానవహక్కులకోసం కలిగే ఉద్వేగానుభూతిలో మిళితమవుతాయి. అయితే ఆయనకి దాని గురించిన బౌద్ధిక మైన అవగాహన స్పష్టమైనది లేదు. ఆ రోజుల్లో ఈ అవగాహన ప్రజల్లోనూలేదు. అందరూ బౌద్ధికమైన అయోమయపు వాతావరణంలో ఉన్నారు. ఇదంతా స్వరాజ్యంకోసం ప్రధానంగా సరియైన ఆదర్శంతో నిజాయితీతో ఉప్పొంగిన ఉద్వేగపు పట్టులో జరుగుతున్నా యన్న విషయాన్ని అంగీకరించాలి. స్పష్ట మైన నిర్వచనం లేని కారణంచేత 'విద్రోహి' వారికి మరింత కావలిసిన కవిత అయింది. నజ్రులు వారి కవి అయ్యాడు.

భెంగాలు ప్రజలకి తమ కవి లభించాడు. కాని ఇలా అవడంలో ఆ కవి తన ఓ మిత్రుణ్ణి పోగొట్టుకున్నారు. ఇక్కడ ఆ ఉదంతాన్ని చెప్పాలి.

మోహిత్‌లాల్ మజుందారు 'విద్రోహి'ని చదివి కోపగించుకున్నారు. ఆయన దృష్టిలో 'విద్రోహి' సాహితీచౌర్యం, మోహిత్‌లాల్ గారి స్వంత గద్యరచన. 'అమి'ని ఆధారంగా చేసుకొని చాకచక్యంగా రాసిన కవిత; తన గద్య రచన ఆయన మొదట తన సోదరమిత్ర కవి నజ్రులికి చదివి వినిపించారు. ఆయన చెప్పిన దానిని పరిగణనకి తీసుకొని పూర్తిగా విలువనిస్తూ, ఆయనకి ఆయన బాధ వాస్తవానికి ఊహాజనితమైనదని చెప్పాల్సి వస్తుంది. మోహిత్‌లాల్ తమ రచన 'అమి'ని నజ్రులికి చదివి వినిపించారన్న దానిని మనం అంగీకరిస్తాం. నజ్రులు మీద ఆ రచన ప్రభావం ఉన్నదన్న విషయం గురించి కూడా శంకించ

వలసిన అవసరం ఏంలేదు. అయితే ఈ రెండు రచనలూ వస్తుపు దృష్ట్యా అయితేనేం, రచనా విధానం దృష్ట్యా అయితేనేం, ఏ మాత్రం సంబంధం లేనివి. ఒకటి గద్య రచన కాగా రెండోది పద్యరచన. రచనా ప్రక్రియలోని తేడాలే కాక నజ్రులుదే అయిన విశిష్టమైన అభివ్యక్తి పద్ధతికీ (ఆ పద్ధతి ఇంకా పరిపక్వస్థితిని అందుకోలేదని మనం ఇంతకు పూర్వం చెప్పుకున్నాం) మోహిత్‌లాల్ వ్యక్తీకరణ పద్ధతికీ చాలాతేడాలు ఉన్నాయి. 'అమి' రచనవస్తువు ప్రధానంగా అద్వైత భావానికి సంబంధించినది. ఆ 'నేను' అద్వైత వేదాంతపు 'అహం' నజ్రులు కవిత లోని 'నేను' ప్రధానంగా విద్రోహిది. లోకంలోని సమస్తమైన బంధనాలమీద తిరుగుబాటు. జీవితంకోసం, ప్రేమకోసం ఆ రెండింటి సత్యంకోసం సుందరం కోసం చేసిన తిరుగుబాటు. ఈ రెండు 'నేను'ల్లో ఒకటి సర్వవ్యాపమైనది. అయితే వ్యక్తిపరమైనది. రెండవది తననుతాను సమర్థించుకునే వ్యక్తిత్వానిది. వ్యక్తిపరమైనదికాదు. వస్తుపరమైనది.*

స్పష్టమైన నిర్వచనం లేకపోవడమూ, భావాల అసంబద్ధతా 'విద్రోహి' కవితలో ప్రముఖ గుణాలు. దీనికి కారణం వేదాంతపు 'అమి' నజ్రులు అంత శ్చేతనలో గట్టిగాపట్టి ఉండడం కావొచ్చు. ఈ విషయంలో మోహిత్‌లాల్ ఎప్ప టికీ రాజీపడలేకపోయారు. దానికీ లోతైన కారణాలు ఉన్నాయి. ముజఫరు అహమ్మదు సముచితంగా భావించిన విధంగా ఈ ఇద్దరి వ్యక్తిత్వాలు ఒకదాంతో ఒకటి ఎప్పుడోఒకప్పుడు తలపడక తప్పని వ్యక్తిత్వాలే: దురదృష్టవశాత్తూ మోహిత్‌లాలుగారి అహంభావం నజ్రులుకి తన ఆశ్రితుడిగా హోదా ఇవ్వ బోయింది. నజ్రులు స్వభావరీత్యా ఇలాంటి సంరక్షకత్వాన్ని సహించేరకం కాదు. స్వేచ్ఛగా, బుద్ధిపూర్వకంగా అందరితో చెలిమిగా మెలిగేవారయిన కారణంచేత నజ్రులు మోహిత్‌లాల్‌కి దూరం అయిపోయారు. ఇది ఖచ్చితంగా రెండు వేరు

---

* ఈ రచయితకి కవి మోహిత్‌లాల్ మజుందార్‌గారి నిజాయితీపట్ల అమిత మైన గౌరవం ఉంది. అయినా ఈ విషయంగురించి కవి స్వయంగా చెప్పగా ఈ రచయిత తెలుసుకున్నారు. కవిగారి 'అమి'కి (మానసీ మాస పత్రికలో అచ్చయింది.) కలకత్తా రిప్పన్ కాలేజీ మాజీ ప్రొఫెసరు క్షేత్రమోహన్ బంద్యోపాధ్యాయ రచించిన అభయేర్ కథ లేదా ఠాకురాణీర్ కథ ప్రేరణ ఇచ్చాయి. దురదృష్టవశాత్తు మరుగునపడిపోయిన ఈ రెండు పుస్తకాలూ చదవదగ్గ పుస్తకాలు.

వేరు వ్యక్తిత్వాల మధ్య జరిగిన ఘర్షణే. అంచేత తర్వాత సుమారు రెండు సంవత్సరాలకి (1924 అంటే జనప్రియకవిగా నజ్రులు బంగారు కాలంలో (ఈ కాలం గురించిన చర్చ తర్వాత వస్తుంది) బెంగాలీ సుశిక్షితవర్గంలోని సాహిత్య సంబంధమైన ప్రమాణాలని, నైతిక విలువలని "కల్లోల్" గ్రూపు రచయితలు క్రూరతనంలో సవాలు చేసినప్పుడు నజ్రుల్ని తప్పుగానూ, అసమంజసంగానూ ఈ తిరుగుబాటు గ్రూపుకి నాయకుడని అనుకోవడం జరిగింది. శత్రువర్గాల వారైన సాహిత్యపు అభివృద్ధి నిరోధకులు (శనివారేర్ చిఠ్ఠి) ఈ సవాలుని ఎదుర్కొని తమనితాము బలంగా సమర్థించుకోవడానికి తలపడ్డారు. మోహిత్‌లాల్ వారి సైద్ధాంతిక వ్యాఖ్యాత. 'విద్రోహి' కవితకి పారడీ రాసిన రచయిత ఆయనేనని అనేకులు తప్పుగా భావించారు. (నిజానికి ఆ పేరడీని సజనీకాంతదాసు రాశారు.) నజ్రులు ఆవేశంతో అభిశంసిస్తూ ఓ కవితను- "సర్వనాశేర్ ఘంట" రాశారు. దానికి జవాబుగా మోహిత్‌లాల్ 'ద్రోణగురు' రాసి గట్టిగా శాపనార్థాలు పెడుతూ కిందా మీదా చూడకుండా బాహాటంగా కయ్యానికి దిగారు. ఈ కవిత దుర్భాషలతో నిందలతో ఉడుకెత్తించే కవిత. నజ్రులు కవితలో కోపంకన్నా బాధ అధికంగా ఉంది. రెచ్చగొట్టేటట్టూ లేదు. పరుషంగానూ లేదు. తన అగ్రజుడైన కవి మోహితలాలు లాగ నజ్రులు తిరిగి ఎప్పుడూ ఎక్కువగా చికాకుకి గురికాక పోవటం మేలైన సంగతే. నజ్రులుకి సంబంధించినంత వరకూ అమి-'విద్రోహి'ల వ్యవహారం ఇంతటితో సమాప్తమై పోయింది. ఓ రకంగా జనం అంతకు పూర్వం నుంచీ మోహిత్‌లాలుగారి వాదాన్ని పట్టించుకోడం మానేశారు. అన్నిటికన్నా గొప్పవిషయం ఏమిటంటే- బెంగాలీ సాహిత్యరంగంలోని అగ్రగాములు ఈ వాదాన్ని అంగీకరించలేదు. ఆ తర్వాత 1923లో రవీంద్రనాథుడు తన గీతి నాట్యం 'వసంత్'ని నజ్రులు ఇస్లాంకి అంకితం ఇచ్చినప్పుడు (10 ఫాల్గుణం 1329 వం. సం. లేదా 1923 ఫిబ్రవరి 24వ తేదీ) బెంగాలీ ప్రజలకి నిండా ఆనందం కలిగింది. నజ్రులు మోహిత్‌లాలుగారి వాదాన్ని ఎక్కువగా పట్టించుకో లేదని అనిపిస్తుంది.

---

మోహిత్‌లాలు ఈ పుస్తకాల్లోని భాగాలని తరుచుగా చదువుతూ ఉండేవారు. వీటిని చదివితే 'అమి' అన్ని విధాలా అద్వైత అహానికి అహ్వానం అన్న దాంట్లో ఏరకమైన సందేహానికి తావు అన్నది ఉండదు.

'విద్రోహి' అచ్చయిన తర్వాత నజ్రులు "విద్రోహి కవి"గా ప్రసిద్ధిపొందారు. ఆ ప్రసిద్ధి 20ల్లో (1920-30) నజ్రులు మొదటిదశని సముచితంగానే వర్ణించింది. కాని తదితరదశలూ, ఆయన జీవితానికి సంబంధించినవీ, ఆయన అంతరంగిక వ్యక్తిత్వానికి సంబంధించినవీ కచ్చితమైన రూపాలు కనపడతాయి కేవలం తిరుగుబాటు తనాన్ని నిర్ధారించి చెప్పటమే కాక, ఆత్మాభివ్యక్తికి సంబంధించిన తదితర ధోరణులూ కనపడతాయి. ఇది ఈ మొదటి దశలోకూడా స్పష్టంగా గోచరిస్తుంది. విద్రోహి లో వ్యక్తీ, కాలం రెండూ విశిష్టమైన వ్యక్తీకరణతో బయటికి వచ్చాయి. అయితే ఇది హఠాత్తుగా పైకి ఉబికి వచ్చినది కాదు. నజ్రులు ప్రారంభంనుంచీ పోరాటపుకవే; తన కాలంనాటి ధోరణిని ప్రబలంగానూ,విలక్షణం గానూ ఉన్న దానిని పుణికిపుచ్చుకుని ఆయన కవిత్వం అల్లారు. శక్తివంతమైన కవితల్లో కమల్‌పాషాకి (విచిత్రమైన సంగతి కమల్‌కి పోటీదారు అన్వర్‌పాషాని కమల్‌తో పాటు యుద్ధంచేసే వీరుడిగా కల్పించారు). ఈజిప్టుకి చెందిన జగలులు పాషాకి జేజేలు కొట్టి ప్రశంసించారు. నజ్రులు భారతదేశపు జాతీయ ఇతివృత్తం మీదా, అలీ సోదరుల నిర్బంధం మీదా, గాంధీగారి నేతృత్వంలో జరుగుతున్న కాంగ్రెసు ఉద్యమం మీదా కూడా కవితలు రాశారు. తదితరులైన తన బెంగాలీ మిత్రుల్లాగానే నజ్రులు కూడా మహాత్మాగాంధీని గుడ్డిగా అనుకరించేవారు కాదు. అయినా ఆ మిత్రుల్లాగానే ఆయన కూడా అహింస, సత్యాగ్రహం లాంటి ఉన్నత ఆదర్శాలని ఇష్టపడేవారు. కాని ఆ ఆదర్శాలు ఆచరణీయాలు కావని అంగీక రించేవారు. అయితే మొదట్లో ఆయన గాంధీగారి నాయకత్వాన్ని మనస్ఫూర్తిగా స్వీకరించారు. కారణం, ఆ నాయకత్వం జాతీయ స్వాతంత్ర్యం కోసం జన సామాన్యంతో కలసి ప్రత్యక్ష కార్యక్రమాలతో సూటిగా పనిచేసేది. ఆయన గాంధీగారి మీద (1921లో కొమిల్లాలో) పద్యాలు రాశారు. వాటిలో స్వాతంత్ర్య పోరాటంలోకి గాంధీగారి ఆగమనానికి మనసారా స్వాగతం పలికారు.

ఎవరీ ఉన్మాద పథికుడు ?
బంధిత జనని
వాకిటికి
దూసుకు వచ్చాడు.
ఆయన వెంట
అనుసరిస్తూ వస్తున్నారు

ముప్పది కోటి సోదరులు
మృత్యువునే సవాలు చేస్తూ
గీతాలు ఆలాపిస్తూ !

(ఎ కోన్ పాగల్ పథిక్ చూటే ఎలో బంధిని మార్ ఆంగినాయె? తికేస్ కోటిభాయి మారణ్ హరణ్ గాన్ గాయె తార్ సంగె జాయె?)

ఇదేవిధంగా పద్యం తర్వాత పద్యం నజ్రులుకే సొంతం అయిన నిండైన ధారాళతతో సాగుతుంది. చరఖా (రాట్నం) మీద కూడా ఇలాంటి ఉత్తమమైన పద్యాన్నే ఆయన రచించారు. బహుశా ఆయన దృష్టిలో జాతీయంగా విసిరిన సవాలుకి చరఖా ఓ ప్రతీక. గాంధీజీకి సంబంధించిన ఈ మాదిరి పద్యాలతోపాటు నజ్రులు డజన్లకొద్ది పద్యాలు- తన నిండుదేశభక్తినీ, దేశస్వాతంత్ర్యం పట్లా, సహాయనిరాకరణం ద్వారా పెల్లుబికిన జాతీయ ఉద్యమం పట్లా తనకున్న గాఢమైన ప్రేమని వ్యక్తపరిచే పద్యాలు రాశారు. ఆ సమయంలో ఆయన ఆ ఉద్యమంతో తాదాత్మ్యం చెందారు. ఆ సమయంలోని నజ్రులు అన్యరచనల్లో లాగానే ఈ పద్యాల్లోనూ ఆ ఉద్యమపు స్వభావాన్ని ఎవరైనా గ్రహించగలరు.

అయితే ఆ రోజుల్లో నజ్రులు కేవలం ఈ రకమైన కవిత్వాన్నే చెప్పలేదు. ఆయన హృదయపూర్వకంగా ప్రతిదాన్ని స్వీకరించే ప్రవృత్తి ఉన్నవారు. ఆనందోల్లాసం ఆయన సొత్తు. జీవితపు బహుముఖమైన అనుభవాలకి ఆయన నేత్రేంద్రియం, శ్రోత్రేంద్రియం. మెదడూ హృదయమూ స్పందించేవి. ఏ దశలోనూ ఆయన సృజనాత్మకత వైవిధ్యాన్ని కోల్పోలేదు. అంచేత 1922లో "భంగార్ గాన్" పాటలాంటి పాటలతో పాటు మరికొన్ని చక్కటి పాటలు, పద్యాలు వైయక్తికానుభూతులతో నిండినవి రాశారు. ఈ రచనలు నారీ సహజమైన సొగసుతోనూ, పురుషోచితమైన స్వీకృతితోనూ వెలువడిన మనోభావాలు. తర్వాత ఈ రచనలని ఆయన ప్రేమపాటల పుస్తకం "దోలన్ చంపా" (1923) ఛాయానట్ (1924) పూర్బేర్ హవాలో చేర్చారు. అయితే తేదీలూ, సంఘటనల తికమకల్లో పడకుండా వాస్తవానికి ఈ పుస్తకాలు తర్వాత వెలువడ వలసినవని మనం గుర్తుఉంచుకోవాలి. నిజానికి 1921 వరకూ నజ్రులుది ఓ కవితాసంకలనం కాని, ఓ పాటల పుస్తకం కాని వెలువడలేదు. ఆయన మొదటి పుస్తకాలు 1922 లోనే ప్రెస్సుకి వెళ్లాయి. ఓ కథాసంకలనం (దీని గురించి చర్చించాం) వ్యథార్ దాన్ 1922 మార్చిలో అచ్చయి పాఠకులముందుకు వచ్చింది. (నిజానికి అది

ప్రెస్సుకి వెళ్ళి చాలాకాలం గడిచిపోయింది నవయుగ్‌లో వచ్చిన ఆయన వ్యాసాలు యుగవాణి శీర్షికతో సంకలనంగా ఆ పిమ్మట 1922 అక్టోబరులో వచ్చాయి) (త్వరలోనే ఇది నిషేధానికి గురికాబోతోంది ?) తదుపరి ఆఖరిని అధికంగా ప్రశంసలు పొందిన కావ్య సంకలనం అగ్నివీణ అదే సంవత్సరం అదే నెలలో వచ్చింది. ఈరోజుకీ వేలసంఖ్యలో అమ్ముడు పోతోంది. అయినప్పటికీ కవికి మాత్రం ఆర్థికంగా కించిత్తైనా లాభం లభించలేదు. 'అగ్నివీణ' ముద్రణ మరి కొన్ని స్మరణకి తెచ్చుకోవలసిన విశేషాలతో జరిగింది. వాటి గురించి ఇక్కడ చెప్పుకుందాం.

బెంగాలులో అగ్నియుగానికి (1900-1908- విప్లవ కార్యకలాపాలు మొదటిసారిగా ప్రారంభమైన కాలం) చెందిన అగ్రగామి విప్లవకారుడు బారీంద్ర కుమార్ ఘోష్ కి 'అగ్నివీణ' అంకితం యిచ్చారు. ఆచార్య అవనీంద్రనాథ్ టాగూరు లాంటి చిత్రకారుడు తనంతతానుగా ఆ పుస్తకానికి ముఖపత్ర రచన చేశారు. అది ఏ రచయితకైనా దుర్లభమైన గౌరవం. నజ్రులు అవనీంద్రనాధుడికీ, రవీంద్ర నాధుడికీ అభిమాన పాత్రుడు అన్న విషయం సుస్పష్టమే. దానితోపాటు జనసామాన్యానికి కూడా ఆయన ప్రీతి పాత్రులయ్యారు. జనం ఈ సంకలనాన్ని బహు అధికంగా మెచ్చుకున్నారు. దాని రెండవ ముద్రణ మూడు నాలుగు నెలలకే (1923 ఫిబ్రవరికే) జరిగింది. ఈ కాలం నజ్రులుకి అదృష్టం కాస్త కలిసివచ్చిన కాలం. ఆయన తన మిత్రులతో కలిసి ఏమాత్రం ముందువెనక లాడకుండా అంత ధనాన్ని విందులకి ఉల్లాసంతో వినోదార్థం వ్యయం చేశారు. భవిష్యత్తు గురించిన చింత గాని ఆలోచనగాని ఆయనకి లేనేలేదు.

1922 ఉత్తరభాగంలో- ఆయన పుస్తకాలు వెలువడుతున్న సమయంలో- సొంత పత్రికని వెలువరించాలన్న తన చిరకాల వాంఛితం నెరవేరబోతు న్నందుకు ఆయనకి మరింత ఉల్లాసం కలిగింది. ఆదే ప్రసిద్ధ వారపత్రిక- ధూమకేతు.

ఆయన ఇదివరకొకసారి కొమిల్లా వెళ్ళి ఉన్నారు. అక్కడికి ఆయన రాక పోకలు పెరిగాయి. అక్కడ ఆతిధ్యం ఇచ్చే గృహస్థులు ఓ రకంగా సొంత ఇల్లు అనిపించేటంతగా నజ్రులుకి ప్రీతిపూర్వకంగా విశ్రాంతిని కలగచేశారు. నజ్రులుకి అలాంటి విశ్రాంతి కొరతగా ఉండేది. అనుభవజ్ఞులైన జాతీయవాది,

పత్రికా రచయిత మౌలానా ఎమ్. అక్రమ్‌ఖాను (తర్వాత 30 ల్లోనూ 40ల్లోనూ బెంగాల్లో ముస్లింలీగుకి ఈయన "ప్రెస్సు లార్డు" అయ్యారు. విభజన తర్వాత సహజంగానే ఈయన ఢాకాకి వలస వెళ్ళిపోయారు) ప్రారంభించిన కొత్త దిన పత్రిక 'సేవక్'లో పని చెయ్యడానికి కలకత్తా రమ్మనమని నజ్రులుకి (1922 మే లేదా జూను) పిలుపువచ్చింది. నజ్రులు 'సేవక్'లో దాదాపు రెండు నెలలు పని చేశారు. పిమ్మట కేవలం ఓ రెండువందల రూపాయలు ఓ మిత్రుడు అప్పుగా ఇవ్వడంతో ఆయన సొంత పత్రిక నడపాలని నిర్ణయించుకున్నారు. పత్రికని వారానికి రెండు సంచికలుగా తేవాలని అనుకున్నారు. దానికి ఆయన 'ధూమ కేతు' (తోకచుక్క) అని పేరుపెట్టారు.

1922 ఆగష్టు 12వ తారీఖున 'ధూమకేతు' మొదటి సంచిక రవీంద్ర నాథ్‌టాగూరు, శరత్‌చంద్రచటర్జీ, బారీంద్రకుమార్ ఘోష్, తదితరుల ఆశీస్సు లతో వెలువడింది. ఇందులో రవీంద్రనాధుడి స్వాగతోక్తులు ఈ విశిష్టమైన ముగింపుకి వస్తాయి—

(జాగియె దేరె చమక్ మెరె
ఆచ్ఛేజారా అర్ధ - చేతన)

మెరుపు మెరిపించి
మేల్కొల్పవోయీ!
మగత నిద్ర వారిని
లేవదీయ వోయీ!

ఈ పత్రిక ఉద్దేశం అదే. ఆ రోజుల్లో ప్రధానంగా నజ్రులు కార్యకలాపాల విశిష్టతా అదే. జీవితం విసిరిన సవాళ్ళనుండి, వాస్తవికతలనుండి పారిపోయేవారిని వాటికి తటస్థంగా తమ మానాన్న తాము ఉండేవారిని తటాలున మేల్కొలపడమే! ధూమకేతు ముద్రణతో విద్రోహకవి నజ్రులు ప్రత్యక్షంగా ఆ దుమారపు వాతా వరణానికి నాయకత్వం వహించడం మొదలుపెట్టారు. రాజకీయాల దృష్ట్యా ఆయన మహత్తరమైన కాంక్ష ఉన్నవారు కాదు. సైద్ధాంతికంగా రాటుతేరిన వారూ కాదు. కాని ఓ రచయితగా నిబద్ధులు. నిజానికి ఇలా నాయకత్వం వహించటం వివేకమైన పనికాదు. కారణం నజ్రులు స్వభావరీత్యా ఉద్రేకి. తొందరపాటు మనిషి. దుందుడుకుతనం నిర్లక్ష్యమై ఖరి ఉన్నవారు. 'ధూమకేతు' పత్రిక తన

మూలపురుషుడిలాంటిదే- నిబద్ధతా, తొందర పాటూ, ఉద్రేకం, దుందుడుకుతనం నిర్లక్ష్యవైఖరీ ఉన్నదే: వాటితోపాటు కవి నజ్రులు, ఉత్సాహంతో ఉరకలు వేయించే గద్య రచనలు చేసే రచయిత నజ్రులు, విప్లవాత్మకమైన సవాలుకి, పోరుకి తలపడే రచయిత నజ్రులు కూడా ఉన్నారు: ఆ కాలం కూడా ఆయన నుంచి అవే కావాలని పట్టుపట్టిందన్న విషయాన్ని కూడా మనం అర్థం చేసుకోవాలి.

అది 1922 ఆగష్టు. బార్డోలీ తర్వాత ఏర్పడిన నైరాశ్యాన్ని రాట్నం, కాంగ్రెసు కార్యక్రమాల తదితర విషయాలు పారదోలలేక పోయాయన్నది కచ్చితం. సర్వత్రా వ్యాకులపడుతూ అడుగుతున్న ఒకటే ప్రశ్న వినపడుతోంది- ఇహ ఇప్పుడు? అహింసకి రాట్నానికి ప్రత్యామ్నాయాలు అటు ఐర్లాండు సిన్ ఫిన్‌ల జాతీయవాద టెరరిస్టు విధానాలూ కావు. (బెంగాలులోని మాజీ విప్లవ కారులు వీటివల్ల ప్రభావితులయ్యారు) ఇటు ఎంతగానో ఆరాటపడే రాజకీయ వాదుల్ని ఎక్కువకెక్కువ మందిని తన మొట్టమొదటి సమర్థకులుగా చేసిన లెనిను విధానం- ప్రజాఉద్యమం- విప్లవమార్గమూ కాదు. అలా అని ఈ వర్గం- కొత్త స్వాతంత్ర్యప్రియులు తమకుతాముగా అక్టోబరు విప్లవాన్ని సందేశంగా అందిచ్చేవారు. మార్క్సిస్టు లెనినిస్టు మార్గాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకోనూ లేదు. ఈ విషయానికి సంబంధించిన సాహిత్యం భారతదేశంలో అప్పటికి ఇంకా లభించటంలేదు. మానవేంద్రనాథ్‌రాయ్ గారి పుస్తకం "ది వాన్‌గార్డ్", గయ కాంగ్రెసు (1922 డిసెంబరు)లో భారత కమ్యూనిస్టులు జాతీయ ప్రజా స్వామ్య విప్లవకార్యక్రమాల ప్రచారం కోసం చేసిన కృషి ఉన్నప్పటికీ 'కోమిన్ టెర్న్' అన్నది కేవలం ఓ పేరు. కమ్యూనిజం అన్నది కేవలం కొంతమంది వ్యక్తుల భావావేశపుద్రిక్తం. వర్గరహిత తత్వవాదం దీనికి ప్రధానమైనప్రేరణ. కాని ముజఫర్ అహమ్మదు అప్పటికే ఈ మార్గానికి నిబద్ధులు. నజ్రులు ఆయన ఆంతరంగిక మిత్రులు. ఆ రోజుల్లో ఆయన తోటి ప్రయాణీకులుగా నజ్రుల్ని కూడా చెప్పవచ్చు. (1921-22) ఏది ఏమైనా నజ్రులు జాతీయవాదుల్ని గాని అంతర్జాతీయవాదుల్ని కాని— ఇరువురిలో ఏ ఒక్కరినీ "అంటరానివారిగా" అనుకోలేదు. ఆయన ఆరాధకుల్లో బారీంద్రకుమార్ ఘోష్‌గారి బిజిలీకి చెందిన విప్లవకారులనుంచి, ఆర్య ప్రచురణాలయానికి చెందిన వారినుంచి (వీరు అరవింద ప్రవర్తన్‌కి చెందిననారు) అనేకమంది నవయువకుల వరకూ ఉన్నారు. అంచేత

మానవ సమానత్వం, స్వాతంత్ర్యం పట్ల అకుంఠిత విశ్వాసం ఉన్న కారణం చేత దాదాపు కమ్యూనిస్టు అయినప్పటికీ నజ్రుల్ అలౌకిక శక్తి పట్ల తన విశ్వాసాన్ని గోపనీయంగా ఉంచలేదు. ఆయన కవిత్వం ఈ నమ్మకంతో నిండి ఉన్నాది. కవిగా ఆయన సమగ్ర వికాసాన్ని అర్థం చేసుకునేటప్పుడు ఈ విషయాన్ని దాటవెయ్యకూడదు. అంచేత ధూమకేతు ఆయన తిరుగుబాటు దశకి ప్రాతినిధ్యం వహించింది. నజ్రుల్‌లో ఉన్న విప్లవతత్వానికి అద్దం పట్టింది. దృక్పథం రీత్యా జాతీయస్థాయిలోనూ, అంతర్జాతీయస్థాయిలోనూ, రెండింటా సమానత కలిగిఉంది. ప్రాథమికంగా స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం కోసం పోరాటానికి ఇది పిలుపుని ఇచ్చింది. నజ్రుల్‌కి ఉన్న సెక్యూలర్ దృక్పథాన్ని, భగవంతుడిపట్ల ఆయనకి ఉన్న సంప్రదాయ విరుద్ధమైన నమ్మకాన్ని ప్రతిబింబించింది. దాంతోపాటు ఓ రకమైన కమ్యూనిజం కోసం, జాతిరహిత, వర్గరహిత సమాజంకోసం ఆయనకున్న ప్రీతికి అద్దం పట్టింది.

ఆ కాలంలోని రాజకీయ భావాల గురించి, నజ్రుల్ జీవితం ఆయన మనోస్థితి గురించి తెలుసుకోవడానికి వీలుగా 'ధూమకేతు' ఉద్దేశాల గురించి లక్ష్యాల గురించి కవి-సంపాదకుడు నజ్రుల్ చెప్పిన విషయాలనుంచి, వివరణలనుంచి కొన్ని భాగాలను ఎత్తి ఇక్కడ పొందుపరుస్తున్నాం. అయితే ఎత్తి పొందుపరచిన ఈ భాగాల్లో అనువాదాలు అయిన కారణంచేత మూలంలోని ఆవేశం, శైలీ నాణ్యత, అభినివేశం, వైశిష్ట్యం లోపించడం సహజమే.

"మాభైః" (భీతి చెందకు) ఈ మాటలమీద ఆధారపడి, 'విధ్వంసక శక్తులు జయించాలి'. అన్న నినాదం గట్టిగాచేస్తూ నేను ఈ కొత్తమార్గాన్ని నడక మొదలు పెట్టాను. 'ధూమకేతు' నా రథం. నాకు నేనే మార్గదర్శకుణ్ణి. 'సత్యమే' ఏ దిక్కుగా వెళ్ళాలో సూచిస్తుంది. తనని తాను తెలుసుకోవడం- తన సత్యాన్ని తనకి తాను తెలుసుకోవడం- తన గురువు తానే కావడం- తన నియతికి తానే నిర్దేశకుడూ మార్గదర్శకుడూ కావడం- ఇందులో ఏ మాత్రం దంభం లేదు. డాబూగొప్పా లేవు. ఇది కేవలం తనను తాను తెలుసుకోవడానికి చేస్తున్న ఉద్ఘోష........

ఇక్కడ మనం వ్యక్తులు, అతని మతాన్ని, వ్యక్తిగా అతనికున్న హక్కునీ, అతని వ్యక్తిత్వపు సత్యానుభూతిని వ్యక్తం చెయ్యడాన్ని, ఆ మార్గంలో ప్రమాదాల మధ్యజీవించడాన్ని చూస్తాం. కాని లక్ష్యాల గురించి మరింత నిర్దిష్టమైన భావాలు కింద పొందుపరుస్తున్నాం.

ఈ దేశంలో క్రుష్ట చాలా లోతువరకూ, పూర్తిగా, గర్భం మధ్యవరకూ వ్యాపించిపోయింది. దానిని పూర్తిగా నివారించేటంతవరకూ కొత్తదేశాన్ని నిర్మించ లేం. దేశానికి శత్రువు లైన వారినందరినీ, అసత్యమైన దాని సంతతినీ, వంచ ననీ, మిథ్యావదజాలాన్ని, మోసాన్ని దంభాచారాన్ని ధూమకేతు తన అగ్ని తేజస్సుతో దహిస్తుంది.

ఈ ఉద్దేశాన్ని పునఃపునః ఖండితంగా చెప్పడం జరిగింది. మొదటివిషయం ధూమకేతు ఏ సంప్రదాయానికీ ప్రచారసాధనమూ- బాకా కాదు. దానికి తెలిసిన మతం- మహోత్కృష్టమైన మతం- మానవమతం, ధూమకేతు ఉద్దేశాలలో ఓ ఉద్దేశం- హిందూ ముస్లిం సమైక్యతా మార్గంలోని విఘ్నాలగురించి, అసత్యాల గురించి సూచించడం, వాటిని నివారించడం, తన మతంమీద విశ్వాసం ఉన్న వాడు, ఆ మతం అంటే ఏమిటో అవగాహన ఉన్నవాడు, అన్యమతాన్ని దేన్నీ ద్వేషంతో చూడలేడు.

ధూమకేతు మరోసంచికలో తన రాజకీయ ఆదర్శాల గురించి నజ్రులు సూటిగా చెప్పడానికి ప్రయత్నించారు.

ధూమకేతు మార్గం ఏది ? అని జనం నన్ను పునః పునః అడుగుతున్నారు. మొదటిది ప్రధానమైనది- ధూమకేతు భారతదేశపు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుతోంది. స్వరాజ్యం అన్నా- ఇలాంటి ఇతర పదాలన్నా అర్థం ఏమిటో మాకు తెలీదు. ఎంచేతా అంటే మన నాయకులు "స్వరాజ్యం" శబ్దాన్ని అనేక రకాలుగా ప్రయోగిస్తున్నారు. మనకి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలీ అంటే తది తరమైన వాటి అన్నిటికన్నా, ముందు అన్ని నియమాలకి, చట్టాలకి, నిషేధాలకి, బంధనాలకి విరుద్ధంగా తిరుగుబాటు చెయ్యాలి. ఇలాంటి తిరుగుబాటు చెయ్య డానికి మొదట తను ఎవరో తనకుతాను తెలుసుకోవాలి. తిరుగుబాటు చెయ్యడం అంటే దేన్నీ ఖాతరు చెయ్యకపోవటంకాదు. నీకు అర్థరహితంగా కనిపించిన దానికి ఎదురుతిరిగి, "నేను దీనిని అంగీకరించను" అని తలెత్తి మరీ ప్రక టించడం ; అదీ తిరుగుబాటు. ధూమకేతు దృక్పథం ఇదీ—— నీ హృదయం నిన్ను ఎలా నిర్దేశిస్తే అలానడువు. మతం అన్నా, సమాజం అన్నా, రాజు అన్నా దేవుడన్నా- వేటికీ భయపడకు. సత్యావగాహనకి తిరుగుబాటు చెయ్యాలి. నువ్వు ఉచితమైన మార్గంలో తిరుగుబాటు చెయ్యగలిగితే, నువ్వు ప్రళయాన్ని

ఆవాహన చెయ్యగలిగితే- శివుడు (విధ్వంసానికి దయకి దేవుడు) మేల్కొంటాడు. మంచి జయిస్తుంది.

ప్రస్తుతపు మన ఉద్దేశాన్ని దృష్టిలో పెట్టుకునిచూస్తే ధూమకేతులోంచి ఎత్తి చెప్పిన ఈ భాగాలు చాలు. అయితే వీటిలో తీవ్రావేశపు దీప్తి, రంగెత్తించే పలుకుబడుల సొంపు, ఘనంగా ఆకట్టుకునే శైలీ లోపించాయి. కాని నజ్రుల్ ప్రధానమైన భావాలని తన వ్యక్తిగత కర్తవ్యం పట్లా, కృషిపట్లా ఆయనకున్న నమ్మకాన్ని, ఆయన రాజకీయ విశ్వాసాన్ని, తీవ్రమైన విప్లవ భావావేశాన్ని వీటిలో చూడొచ్చు. ఆయన భావాల్లోని అస్పష్టతనీ, భావావేశపు నిజాయితీని చూడొచ్చు. తర్వాత మీద ఎత్తిచూపిన అభిప్రాయ ప్రకటనలవంటి వాటిని, కొన్ని సంపాదకీయ వ్యాసాలని ఎంపికచేసి 1938లో దుర్దినేర్‌యాత్ర అన్న శీర్షికతోనూ, 1941లో రుద్రమంగళ అన్న శీర్షికతోనూ రెండు గద్య సంకలనాలని ప్రచురించారు. అలాగే 1924లో బిషేర్‌బంశి, భంగార్‌గాన్ అన్న శీర్షికలతో వచ్చిన కావ్య సంకలన భాగాలు- రెండింటిలో ధూమకేతులో అచ్చయిన పద్యాలను చేర్చారు. వీటి గురించిన చర్చ తర్వాత చేద్దాం. (ఆయన కావ్యాలు కొన్ని అచ్చయిన వెంటనే చట్ట విరుద్ధంగా ఉన్నాయని ప్రకటించబడ్డాయి. మనం ఈ విషయాన్ని గమనించాలి). ఆ కాలంనాటి సంఘటనలను సరియైన అవగాహనతో చూస్తే, బెంగాలీ ప్రజలు, విశేషించి యువకులు ధూమకేతు పత్రిక ప్రతి సంచికకి విపరీతంగా ఉత్తేజితులయి ఉంటారని మనం ఊహించవచ్చు. జాతీయ విప్లవకారులు అందరూ ధూమకేతుకి స్వాగతం పలికారు. ధూమకేతు సంచికల కోసం బయానా (అడ్వాన్సు)గా డబ్బు జమకట్టబడుతూ ఉండేది. ప్రతిరోజూ సాయంత్రం- విశేషించి ఏరోజున పత్రిక అచ్చు అవుతుందో ఆ రోజున బెంగాలీ వారి ప్రత్యేకత అయిన బెంగాలీ 'అడ్డా' (అనౌపచారిక సమావేశం) ధూమకేతు కార్యాలయం (32 కాలేజీ స్క్వేరునుంచి సమీపంలో ఉన్న 7, ప్రతాపచటర్జీ వీధికి మారిపోయింది.) లో జరిగేది. కవులు రచయితలు, రాజకీయవాదులు, విప్లవకారులు, నజ్రుల్ మిత్రులందరూ ప్రతి సాయంత్రం టీ మీద టీ తాగుతూ గుమిగూడేవారు. పెద్ద గొంతుకలతో గర్జనలు చేస్తూ ఉత్సాహంతో సంభాషించేవారు. ఉల్లాసంతో అరిచేవారు. 'దే గోరూర్ గాధుయియె' (ఆవుకి స్నానం చేయించు) లాంటి అర్థరహితమైన అరుపు నజ్రులుకి అతని మిత్రులకి పరస్పరం

పలకరించుకునే పలకరింపు పదం అయింది. ఈ సమావేశాల్లో ఆనందోల్లాసాలు, తిరుగుబాటుతనం పెరుగుతూ వచ్చాయి. ఈ రెండు గుణాలు నజ్రుల్ ప్రత్యేకతలు. నజ్రుల్ విజయాలకి ఉల్లాసానికీ అవి ప్రారంభదినాలు. అయితే బెంగాలులోని పోలీసురాజ్యం దీనిని ఎలా సహించగలదు? 'ధూమకేతు' ప్రతి సంచికా ఆ రాజ్యపు అస్తిత్వాన్ని సవాలుచేస్తోంది. శాంతి భద్రతలకి, మంచి ప్రభుత్వానికి అది ఓ ప్రమాదంగా ఉంది. అంచేత త్వరలోనే 'ధూమకేతు' మూతపడబోతోంది. దసరాపండగ రోజులు దగ్గరపడ్డాయి. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని బెంగాలీ పత్రికలు తమతమ ప్రత్యేక సంచికలు వెలువరిస్తాయి. సంప్రదాయాన్ని అనుసరించి నజ్రుల్ తన పత్రికకోసం "దుర్గాపూజ" మీద ప్రత్యేకంగా ఓ కవిత రాశారు. "ఆనంద మయీర ఆగమన్" (ఆనందదేవత ఆగమనం).

మతానికి సంబంధించిన ప్రాచీన ఆఖ్యానాల్లో దుర్గ రణచండి రూపం. రాక్షసులని, దుండగులని సంహరించే దేవత. బలహీనురాలుకాదు. పోరాడే స్వభావం ఆవిడది. ఆవిడ సంరక్షకురాలు. నాలుగు దశాబ్దాలపూర్వమే బంకిం చంద్ర చటర్జీ దుర్గరూపాన్ని మాతృభూమికి ప్రతీకగా నిలిపారు. ఆ దేవత దుర్గ నిరంకుశులైన విదేశీయులకు విరుద్ధంగా పోరాడమని ఆహ్వానిస్తోంది. (మొదట బంకిం రాసిన కమలకాంతేర్ దఫ్తర్‌లోని అమరదుర్గోత్సవ్ వ్యాసం, 1873 లోనూ, ఆ తర్వాత ఆయన నవల ఆనందమఠ్ 1882-83 లోనూ ఈ ప్రతీకని వాడారు) ఆ పిమ్మట ఈ ప్రతీక అవసరమైన విధంగా రూపాన్ని సంతరించుకుంది. అంచేత దుర్గాదేవి ఆనందమయి అయినా, మాతృభూమికి మరోరూపం. ఈ దేవతని ఆవాహన చేయటంలో ఏ దాపరికంలేదు. అతి తీవ్రంగా చేయటం జరిగింది. మరి పోలీసుల దృష్టికి రాకుండా ఎలాపోతుంది? నజ్రుల్‌కూడా తన కవితకు కావల్సిన ఉద్వేగాన్ని దృష్టిలోపెట్టుకునే ఈ ప్రతీకని స్వీకరించారు. ఆతతాయిలను దుండగులను అణచిపెట్టే దేవత రూపం సంప్రదాయబద్ధమైన రూపం. ఆ రూపం స్వాతంత్ర్య ప్రీతికల కవి అవసరాలకి సరిగ్గా సరిపోయిన రూపం. అయితే కవిత, భాషాశైలీ సంప్రదాయబద్ధమైనవి కావు. వాటిలో కర్కశత్వమూ లేదు. ఆడంబరమూ లేదు. వ్యావహారిక భాషాశైలిలో, సమకాలీన సంఘటనలు, పోలీసులు నిరంకుశంగా ప్రజలమీద జరుపుతున్న దుండగాలు-ఆయాసందర్భాలు అతిస్పష్టంగా ఉన్నాయి. కవిత మహోకటు వ్యంగ్యంతో నిండి

ఉంది. రాక్షసుల్లాంటి నిరంకుశుని అతి తీవ్రంగా చెంపదెబ్బ కొట్టింది. మరు క్షణం పోలీసులు కపీ, సంపాదకుణ్ణి పట్టుకోవడానికి అరెస్టువారంటు తీసుకుని ధూమకేతు ఆఫీసుకు వచ్చారు. ఆఫీసులో ఈ పత్రిక సంచికలని దొరికినన్నిటిని జప్తు చేశారు. అయితే ఆ సమయంలో సంపాదకులు ఆఫీసులోలేరు. నిజానికి నజ్రులు ఆ సమయంలో కలకత్తాలోనే లేరు. ఆ తర్వాత ఆయన కొమిల్లా వెళ్లి మిత్రుల కుటుంబం — ఇంద్రకుమార్ సేన్‌గుప్తగారి దగ్గర ఉన్నారు. అక్కడ ఆయనకి భద్రత ఉన్నది. ధూమకేతు ముద్రణ సాగింది.

'ధూమకేతు' దీపావళి సంచికలో అతికటువైన సంపాదకీయం అచ్చయింది. "నాకు ఆకలిగా ఉంది". దాంట్లో రక్తాన్ని అర్పించమని, ఆహుతిని కోరుతున్నానని తల్లి పిలుపునిచ్చింది. దాంతో పోలీసులు మరింత జాగ్రత్తపడ్డారు. రాజద్రోహం నేరంకింద కేసుపెట్టి కలకత్తా ప్రెసిడెన్సీ కోర్టులో విచారణ కోసం నజ్రుల్ని ఎంతో తేలిగ్గా కొమిల్లాలో అరెస్టుచేసి తీసుకొచ్చారు. ఈ కేసు విచారణ జరగవలసిన తీరులోనే జరిగి, 1923 జనవరి 16వ తేదీన నజ్రులుకి ఓ సంవత్సరం కఠినకారాగారశిక్ష విధించడం అయింది. శిక్షకు ముందు కోర్టు బోనులో నజ్రులు అత్యంత ప్రభావవంతమైన వాఙ్మూలాన్ని ఇచ్చారు. రాజబందీర జబాన్ బందీ" (కేసు సందర్భంలో ఓ రాజకీయ ఖైదీ ఇచ్చిన వాఙ్మూలం) పేరుతో అది చాలా ప్రఖ్యాతి చెందింది. ఆ వాంగ్మూలం తన సహజసిద్ధమైన నైపుణ్య గుణంతో, ఆవేశం ఉన్నత ఆదర్శంతో మన సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది. కోర్టుల్లో ఇచ్చిన తదితర వాంఙ్మూలాలతో (న్యాయవిచారణ సందర్భంగా కొద్ది నెలల క్రితం గాంధీగారు ఇచ్చిన వాంగ్మూలం లాంటివి) పోల్చిచూస్తే విషయవస్తువు రీత్యాః భావాలరీత్యా భిన్నమైన దైనప్పటికీ, 'రాజబందీర జబాన్ బందీ' ఉద్దేశం సూటిగానూ, స్పష్టంగానూ ఉంది. గాంధీజీ దేన్నైతే 'ఘోరపిశాచ ప్రభుత్వం' అని అన్నారో ఆ ప్రభుత్వాన్ని, ఆ ప్రభుత్వ పరిపాలనా యంత్రాగాన్ని, దాని న్యాయచట్టాల్ని నజ్రులు బాహాటంగా నిందించారు. అన్నిటికన్నా గొప్ప విషయం అది. ఒక నిర్భయప్రకటన— కవి కంఠం దేవుడు ఎంచుకున్న కంఠం అనీ, ఆ కంఠం సత్యాన్ని సమర్ధించేదనీ, భారతదేశపు స్థితిని, వాస్తవాన్ని సత్యాన్ని సమర్థిస్తుందనీ, న్యాయపక్షాన్ని, దైవపక్షాన్ని వహిస్తుందనీ, హేయమైన వాటినన్నిటినీ సంహరించే సాధనం అనీ ప్రకటించారు.

"నేను ప్రపంచ విప్లవపు ఎర్ర సైనికుణ్ణి. ఆయన (దేవుడు) సైనికుణ్ణి.

ఆయన పంపగా నేను వచ్చాను. ఈ అనుభూతి స్పష్టంగా నాగ్రహింపుకి వచ్చింది. సత్యాన్ని కాపాడడానికి, న్యాయాన్ని పునః గెలిపించడానికి ఆయన పంపించగా వచ్చిన సైనికుణ్ణి. మన మాతృభూమి ఏ వశీకరణశక్తి ప్రభావం వల్లో నిద్రపోతూ ఉన్నది- ఆయన నన్ను మన సస్యశ్యామల భూమికి- బెంగాలుకి అగ్రదూతగా, తూర్యవాదకుడిగా పంపారు. నేను కేవలం ఓ సామాన్య సైనికుణ్ణి మాత్రమే. ఆయన ఆజ్ఞని పూర్తిగా అమలు పరచటానికి నేను శాయశక్తులా ప్రయత్నం చేశాను".

ఇదే ధోరణిలో ధారా ప్రవాహంగా ముందుకు సాగిపోయే ఈ ప్రకటన ఈ రోజుకి జ్ఞాపకం ఉంచుకోవలసిన దస్తావేజు! సహజంగానే నజ్రులు నేరస్తుదని నిర్ణయించడం జరిగింది. శిక్ష విధించారు. ఈ సంగతి ఇంతకు పూర్వమే చెప్పుకున్నాం.

మొదటి రెండు వారాలపాటు ధూమకేతు నిలిపివేశారు. ఆ తర్వాత పక్షపత్రికగా వీరేంద్రనాథ్ సేన్‌గుప్త (మొదట్లో ఈయన నజ్రులుకి సహాయకుడిగా ఉండేవారు.) సంపాదకత్వంలో ముద్రణ మొదలయింది. (తర్వాత వీరేంద్రనాథ్ ఫ్రీ ప్రెస్ ఆఫ్ ఇండియాకి వెళ్ళిపోయారు. నజ్రులు మిత్రులు, బంధువూ, కోమిల్లాకి చెందిన వీరేంద్ర సేన్‌గుప్తగారిని ఆయన పేరుని ఈయనతో తప్పుగా జోడించుకుని, ఒకరే అనుకోకండి) పక్షపత్రికగా వెలునడిన ధూమకేతు మొదటి సంచికలో నజ్రులు కోర్టులో ఇచ్చిన వాంగ్మూలం "రాజబందీర జబాన్ బందీ" అచ్చయింది. అయితే మరో సంచిక వెలువడిన తర్వాత పక్షపత్రికగా ధూమకేతు ఆగిపోయింది. ధూమకేతు అంటే నజ్రులే! సర్వస్వమూ ఆయనే! ఆయన లేకుండా అది వెలువడ్డం కష్టం. తర్వాత, కాలంలో మార్పు వచ్చాక కూడా పత్రిక పునర్ముద్రణని ప్రారంభించడం జరగలేదు. ఆసరికి నజ్రులు జీవితంలో మరో దశకు చేరుకున్నారు. రమారమి పది సంవత్సరాల తర్వాత 1931లో కొంతమంది ఉత్సాహవంతులైన యువకులు ఓ మిత్రుడి సంపాదకత్వంలో ధూమకేతుని తిరిగి ప్రారంభించటానికి ప్రయత్నం చేశారు. "కాజీ నజ్రులుఇస్లాం పర్యవేక్షణలో" అని ప్రకటించుకోవడానికి నజ్రుల్ని కూడా అంగీకరింప చెయ్యటానికి ప్రయత్నించారు. అయితే నజ్రులు వ్యక్తిగతంగా దాంట్లో ఏం ఆసక్తి చూపెట్ట

లేదు. నజ్రులుకి సంబంధించినంతవరకూ 1923 జనవరిలో ఆయనకి ఖైదుశిక్ష పడిన తర్వాత ధూమకేతు ప్రచురణ ఆగిపోయిందని మనం అనుకోవచ్చు.

ఈ విధంగా ఆ సంవత్సరం నజ్రులు జైలుకి వెళ్ళడంతో ప్రారంభం అయింది. (1923 జనవరి 16వ తారీఖు) 11 నెలల తర్వాత తన శిక్షా కాలాన్ని పూర్తిగా గడిపి (సర్వసామాన్యంగా ఇచ్చే ఓ వారపు మినహాయింపుతో) నజ్రులు జైలునుంచి బయటకు వచ్చారు. (1923 డిసెంబరు 15వ తారీఖు) ఈ సంవత్సరంలో తదితరమైన సంఘటనలు, ఉల్లేఖించవలసినవి, జ్ఞాపకం ఉంచుకోవలసినవి జరిగాయి. ఈ సంవత్సరంలోనే నజ్రులు కవితా సంకలనం "అగ్నివీణ" అనిస్మరణీయమైన సంకలనం అచ్చయింది. దాని రెండవ ముద్రణ అతిత్వరలోనే జరిగింది. కాని నజ్రులుకే అయితే ఈ రోజుల్లో అన్నిటికన్నా అధిక మహత్తర మైన సంఘటన రవీంద్రుడు ఇచ్చిన అంకితం. రవీంద్రనాధుడు తాను కొత్తగా రచించిన గీతినాట్యం "వసంత"ని (శ్రీయుతులు కాజీ నజ్రులు ఇస్లాంకి-స్నేహపూర్వకమైన ఆశీర్వాదాలతో) అంకితం చేశారు. ఇది రవీంద్రుని ఔదార్యాన్ని గౌరవప్రదర్శనని తెలిపేగొప్ప కార్యం. నజ్రులుకి కూడా సంతోషమూ కృతజ్ఞతా భావం కలిగాయి. ధూమకేతుతో ప్రఖ్యాతులైన నజ్రులుకి ఇంతకన్నా అధికమైన జాతీయస్థాయి గుర్తింపు ఇంకేం కాగలదు! ఎందుచేతనంటే రవీంద్రుడిలో "తనవాళ్ళలోని", ఉన్నతమైన వివేకం అంతా సమీకృతమౌతూ ఉండేది. దీని ప్రాముఖ్యాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడానికి ఈ కాలంలో రాజకీయ ఆందోళన సంపూర్ణంగా కవిగారి అభీష్టానికి తగినట్టులేదని జ్ఞాపకం ఉంచుకోవడం అవసరం. రవీంద్రుడు, సహాయనిరాకరణం రాట్నం, విదేశీవస్త్ర బహిష్కారం, పాశ్చాత్య విద్యా బహిష్కారం మీద గాంధీగారి అభిప్రాయాలని బాహాటంగా వ్యతిరేకించారు. అటు నజ్రులు తిరుగుబాటుతత్వంతోనూ విప్లవాత్మకమైన గొప్ప మార్పుకి ఆయన యిచ్చిన పిలుపుతోనూ రవీంద్రుడుకి ఏకీభావం లేదు. 1908లో స్వదేశీసమాజ్‌కి రవీంద్రుడు ఇచ్చిన ప్రసిద్ధమైన ఉపన్యాసంలో ఆయన తన గాఢ విశ్వాసాన్ని వ్యక్తంచేశారు. ఆ విశ్వాసానికి ఆయన గట్టి సమర్థకులు. ఆ ఉపన్యాసంలో సాంఘిక పునర్నిర్మాణానికి, జాతీయ పునరుద్ధరణకి కార్యక్రమాల సూచికని తయారుచేశారు. సహనంతో నెమ్మదిగా చేసే ఇలాంటి పనికి నజ్రులు తీవ్ర స్వభావం సరిపడదు. ఈ ఇద్దరు కవులు ఇంతకు పూర్వమే కలుసుకున్నారని, నజ్రులు ఈ విషయంలో రవీంద్రునికి తన అభిప్రా

యాన్ని తన వ్యతిరేకతని స్పష్టం చేశారన్న సంగతి అందరికీ తెలుసు. ఆ రోజుల్లోకూడా రవీంద్రుడు కవిగా గేయకారుడిగా నజ్రుల్ ప్రతిభని ప్రశంసించా రని చెప్తారు. శాంతినికేతనం వచ్చి నియమబద్ధమైన సాధనతో తన ప్రతిభకి పాస పెట్టుకోమని ఆయన నజ్రుల్ని ఆహ్వానించారు. ఆందోళనల రాజకీయాలకి బదులు సాహిత్యానికి ప్రాథమికతని ఇమ్మనమని కూడా ఆయన నజ్రులికి సలహా ఇచ్చారు. అయితే నజ్రుల్ దానికి సిద్ధంగా లేదు. ఆయన పూర్తిగా ఆందోళనల్లో మునిగి పాల్గొనే అభిప్రాయంతో ఉన్నారు. ప్రకృతి సిద్ధంగా తనకు లభించిన ప్రతిభను నజ్రుల్ దురుపయోగపరచడంగా అభిప్రాయపడి రవీంద్రుడు దానికి విచారించారు. నజ్రుల్ శ్రేయస్సును కోరుతూ తనకి సహజ సిద్ధమైన వాక్ వైదగ్ధ్యంతో అద్భు తంగా రవీంద్రుడు కవి నజ్రుల్ పనిని "కరవాలంతో క్షురకర్మ చెయ్యడంగా" వర్ణించారు. అందుచేత కారాగార జీవితపుదశలో రవీంద్రుడు నజ్రుల్‌కి బాహాటంగా గుర్తింపు ఇవ్వటం బెంగాలీలకు ఆనందాన్ని కలిగించింది. అది దేశాన్ని పాలిస్తున్న ప్రభుత్వాన్ని మరింత వివేకహీనమైన దానిగా, అర్థరహితమైన దానిగా చేసింది.

అయితే ఇలాంటి వాటితో తలపడ్డానికి ఉద్యోగివర్గ పాలనావ్యవస్థకి దాని పద్ధతులు దానికి ఉన్నాయి. నజ్రుల్ ఒక ఖైదీ, ప్రభుత్వధిక్కారము చేసినవారేనా? అలాంటి ఖైదీలతో ఎలా వ్యవహరించాలో పరిపాలకులకు తెలీదా? అటు నజ్రుల్‌కి కూడా పాలకుల సవాలుని ఎలా ఎదురుకోవాలో బాగా తెలుసు. ఆ కాలంనాటి జైలు నియమాల ప్రకారం నజ్రుల్ ప్రతిష్ఠనిబట్టి, చేసిన నేరాన్ని బట్టి ఆయనకి ప్రత్యేక తరగతికి చెందిన మర్యాద జరగాలి. కాని తదితర రాజకీయ ఖైదీలకు ఈ హక్కుని ఇయ్యలేదు. నజ్రుల్ని కూడా కొద్ది రోజుల తర్వాత అలీపూర్ సెంట్రల్ జైలునుంచి హుగ్లీ జిల్లా జైలుకి పంపాక, ఏ కారణం లేకుండా ఆయన ప్రత్యేక తరగతి హక్కుని తీసేసారు. అక్కడున్న కాంగ్రెసు ఖైదీలతో అన్యాయంగా వ్యవహరిస్తున్న విధం గానే నజ్రుల్‌తో కూడా సామాన్య నేరస్థులతో వ్యవహరించే తీరులో వ్యవహరిం చారు. నజ్రుల్ తదితరులతో కలసి శాసనధిక్కారము మొదలుపెట్టారు. దాంతో జైలు అధికారులు వారికి కఠినమైన దండన యివ్వడం మొదలుపెట్టారు. భోజనమూ దండన భోజనమే. బట్టలూ దండన బట్టలే- అలిసిపోయేటట్టు చేయించే పనీ దండన పనే- అరదండాలు, అడ్డుతగిలే సంకెళ్ళు వంకర సంకెళ్ళు- మొదలైనవి ఒక దాని తర్వాత ఒకటి దండన అలా ఇస్తూనే ఉన్నారు. నజ్రుల్‌లూ, ఆయనతో పాటు ఉన్న

ఖైదీ మిత్రులు ఈ నిరంకుశత్వాన్ని అన్యాయాన్ని, దౌర్జన్యాన్ని వ్యతిరేకిస్తూ నిరాహార దీక్ష మొదలు పెట్టారు.

ఆకలితో రాత్రుళ్ళూ పగళ్ళూ గడుస్తున్నాయి. వారాలు గడిచిపోతున్నాయి. రోజు రోజుకీ జైలు బైటనున్న వారికి చింత ఎక్కువ అవుతూవచ్చింది. అయితే నజ్రులు తన ప్రియమిత్రుల అభ్యర్ధనలని కాని, తన నాయకుల అభ్యర్ధనలని కాని అంగీకరించటంలేదు. షిల్లాంగు (అస్సాంలో) రవీంద్రనాధుడికి ఈ నిరాహార దీక్ష గురించి, నజ్రులు పరిస్థితి గురించి తెలియగానే ఆయన వెంటనే ఓ టెలిగ్రాం పంపారు. "నిరాహార దీక్ష విరమించండి. మన సాహిత్యానికి మీ మీద హక్కు ఉంది". టెలిగ్రాముని నజ్రులుకి ఇవ్వలేదు. టెలిగ్రాం మీద చిరునామా దారుడి చిరునామా తెలిలేదు" అని రాసి తిప్పి పంపించారు. దేశబంధు చిత్తరంజనదాసు, నవలారచయిత శరత్‌చంద్ర ఛటర్జీ, ఇచ్చిన పిలుపుతో కలకత్తాలో ఓ పెద్ద ప్రజాసభని ఏర్పాటు చేశారు. బెంగాలీ ప్రజలు ఖైదీలకోసం పోరాడతారని, తమ పోరాటాన్ని ప్రజలకి విడిచిపెట్టవలసినదని కవిని కోరుతూ ఆ సభలో వాగ్దానం చేశారు. రవీంద్రుడు కూడా తిరిగి అటువంటి హామీనే పంపించారు. చివరకి నిరాహార దీక్ష చాలించారు. భవిష్యత్తులో ఇలాంటి ఇబ్బంది ఉండకుండా ఉండాలని జైలు అధికారులు నజ్రుల్ని హుగ్లీజైలునుంచి బర్హాంపూరు జైలుకి పంపారు. ఏ ప్రత్యేక తరగతికోసం ఆయన పోరాడారో ఆ తరగతిని ఆయనకి ఇచ్చారు.

ముందు రోజులతో సరిపోల్చి చూస్తే ఆ తర్వాత 1923 డిసెంబరు 15 నాటివరకు జైలు జీవితపు 11 నెలలు నజ్రులుకు శాంతంగా గడిచాయి. బెంగాలీ సాహిత్యంలో ఈ రోజులనాటి చిరస్మరణీయ స్మృతులు ఉత్తమ గేయాల్లోనూ కవితల్లోనూ నిలిచి ఉన్నాయి. సుపేర్ వందన (సూపరింటెండెంటుకి వందనాలు) నిండా పదునైన వ్యంగ్యంతో కూర్చిన పాట. శికాలు పొరేర్‌గాన్ (సంకెళ్ళలో పాట) ప్రసిద్ధి చెందిన పాట- మొదటి పంక్తులు ఆ రోజుల్లో అందరి నోటా విన పడుతూ ఉండేవి.

ఈ సంకెళ్ళ దారణ
కపట వ్యవహారమండీ!
మా
కపట వ్యవహారమండీ!

సంకెళ్ల ధారణ
కపట వ్యవహారమండీ!

(ఎయి శికల్ పరా ఛల్ ఆమాదేర్, శికల్‌పరా ఛల్)

"మేం ధరించిన ఈ సంకెళ్లు ఓ కపట వ్యవహారం! కేవలం బాహ్యాడంబరం. వాటిని ధరించి దుండగాలు చేస్తున్న వారిని ముప్పు తిప్పలూ పెడతాం"! అదీ దాని భావం.

# 4. ప్రజాకవి

రాతిగోడలు చెరసాల కాలేవు. నజ్రులు ఇస్లాంకి 1923లో ఏ సమయం లోనూ రాతిగోడలు చెరసాల కాలేదు. బెంగాలీ పత్రికలకి పాఠకులకి చెరసాల నుండి ఆయన కవితలు, గేయాలు వరసగా నిర్విరామంగా అందుతూనే ఉన్నాయి. వాస్తవానికి మరింత విస్తృత పరిధిలో ఆ రచనలు పాఠకులకి అందాయి. చెర సాల బయట హూగ్లీలో నజ్రులు మిత్రుల సంఖ్య, ఆరాధకుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. వారు అటు నజ్రులుతోనూ, ఇటు కలకత్తాలో నజ్రులు మిత్రులతోనూ సంబంధాలు పెట్టుకునే ఉన్నారు. నజ్రులు విడుదలయ్యాక హూగ్లీలోని మిత్ర బృందం ఆయనని తమతోపాటు ఉండడానికి అంగీకరింపచేశారు. రెండు సంవత్సరాలకి పైగా 1924-25 (1926 జనవరి 2వ తారీఖు వరకుగా కనబడు తుంది) నజ్రులు అక్కడే ఉన్నారు.

విడుదలైన తర్వాత మరింత ఉత్సాహంతో నజ్రులు మళ్ళీ రాజకీయాల్లో ప్రవేశించారు. అటు రాజకీయ రంగంలో తరుచు జరిగే సమావేశాలకు, ఇటు సాహిత్యరంగంలో జరిగే గోష్ఠులకు యావత్ బెంగాలులో ఆయన రావాలని అందరూ సహజంగానూ, అధికంగానూ అభిలషించేవారు. భారతదేశపు రాజ కీయాల్లో ఆ సమయం ఓ విషాద సమయం. వాద వివాదాలతో జాతీయ పోరా టానికి కొత్త మార్గాలను, సాధనాలను అన్వేషిస్తున్న కాలం. అతివేగంతో తిరుగు తున్న యంత్రాన్ని హఠాత్తుగా బార్డోలీ తీర్మానం ఆపేసింది. ఉత్తేజరహితమైన నిర్మాణాత్మక కార్యక్రమంతో పోరాటం ఓ ఊపుని అందుకోలేని స్థితి. ఆ సమ యంలో దేశబంధు చిత్తరంజన్‌దాసు, మోతీలాలు నెహ్రూ తదితర నాయకులు ముందుగా భయపడినట్టుగానూ గుర్తించినట్టుగానూ ప్రజాఉద్యమం చప్పగా చల్లారి పోయింది. ఈ విషాదస్థితి రాగానే బ్రిటిషు అధికారులు గాంధీజీని ఆ వాతావర ణానికి దూరమయేటట్టు చెయ్యడంలో ఏ మాత్రం జాప్యం చెయ్యలేదు. వారు తమ రాక్షస విధానాన్ని అమలుపరిచి దేశద్రోహం నేరంకింద ఆరేళ్ళు కఠినశిక్షవేసి గాంధీజీని జైలులో పెట్టారు. చెరసాల నుండి విడుదలయ్యాక చిత్తరంజన్‌దాసు, మోతీలాలు నెహ్రూ తదితర నాయకులు సహాయ నిరాకరణోద్యమపు కార్య

క్రమాన్ని మార్చాలని అన్నారు. బాధ్యతారహితమైన ప్రభుత్వాన్ని ఎదిరించ టానికి శాసనసభలను ప్రతిపక్షంగా ఉపయోగించాలని, శాసనసభా పరిధిలోనే సహాయ నిరాకరణ చెయ్యాలని సలహా ఇచ్చారు. "మార్పు కోరని" వర్గానికి నాయకత్వం వహించిన సి. రాజగోపాలాచారి పక్షాన కాంగ్రెసులో అధిక సంఖ్యాకులు, మార్పుకోరే ఈ తీర్మానాన్ని తీవ్రంగా విమర్శించారు. గయ కాంగ్రెసు మహాసభలకు అధ్యక్షులు చిత్తరంజనదాసు 1922 డిసెంబరులో తన పదవికి రాజీనామా చేశారు. ఆ తర్వాత (1923లో) మార్పు కోరే పక్షంవారు మోతీలాలు నెహ్రూ, హకీము అజ్మల్‌ఖాను తదితర నాయకులు కాంగ్రెసు నుండి ప్రజల నుండి తమ దృక్పథానికి సమర్థన వచ్చేటట్టు చేసుకోడానికి కాంగ్రెసులోంచే కాంగ్రెసు స్వరాజ్యపార్టీని ఏర్పరచారు. 1923వ సంవత్సరం-నైరాశ్యంతో ప్రజలు అయోమయంలో పడి కొట్టుకుంటున్న క్లిష్టకాలం. నిర్మాణాత్మక కార్యక్రమం పనికి రాకుండా పోయిందని ప్రజలు తలచారు. నాయకుల్లో వచ్చిన అభిప్రాయ భేదాలకు విచారించారు కూడా. ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు ప్రత్యేక మహాసభ (1923)లో మహమ్మదు అలీ ప్రయత్నంవల్ల ఎలాగో ఈ వివాదం సమసి పోయింది. రాబోయే శాసనసభ ఎన్నికల్లో స్వతంత్రంగా పోరాడ్డానికి స్వరాజ్య పార్టీకి అనుమతి ఇచ్చారు. అయితే కాంగ్రెసు పేరునికాని, సాధన సంపత్తిని కాని సుతరాము వినియోగించరాదు అన్నారు. స్వరాజ్యవాదులకు ఈ మాత్రపు అను మతి చాలు. ప్రజలు వీరి చుట్టూ ఇప్పుడు గుమిగూడుతున్నారు. చప్పబడిపోయిన వారి ఉత్సాహానికి ఈ పార్టీ ఆకర్షణీయంగానూ యదార్థంగానూ కనిపించింది. బార్డోలీ నిర్మాణ కార్యక్రమం యావత్తు దేశంలో ఉత్సాహాన్ని ఇంచుమించు బల హీన పరిచిన సమయంలో, ఈ స్వరాజ్యవాదుల పార్లమెంటరీ కార్యక్రమాలు తమ చిన్న పరిధిలో ఉద్యమ పోరాటపు ఉత్సాహాన్ని నిలబెట్టాయి. అయితే వాస్త వానికి స్వరాజ్యవాదుల కృషివల్ల స్వరాజ్యంకోసం ఖండితంగా చేసే పోరాటంలో ప్రజలు తలమునకలు కాలేదు. దానికోసం 1930 వరకూ ఎదురు చూడవలసి వచ్చింది. స్వాతంత్ర్య తీర్మానం (డిసెంబరు 1929) శాసనోల్లంఘన ఉద్యమం (మార్చి 1930) ప్రజా ఉద్యమ పోరాటాన్ని తిరిగి తీవ్రతరం చేశాయి. 1924 స్వరాజ్యవాదుల కార్యక్రమాలకి, ఉద్యమానికి ప్రారంభ సంవత్సరం. వాటివల్ల ప్రజలు సహాయ నిరాకరణ కార్యక్రమాల గురించి ఆలోచనలో పడ్డారు. కేవలం 'మార్పుకోరని వర్గం'గానూ, సనాతన గాంధీవాదులు గానూ ఉండకుండా, ఎక్కువ

శక్తివంతమైన, ప్రభావం కలిగిన విధానాల అన్వేషణలో పడ్డారు. విద్రోహకవి, 'ధూమకేతు' వ్రాసినకవి-నజ్రులుకి మార్పుకోరని వర్గంలాంటి యధాతథవాదులతో సనాతనులతో పొత్తు కుదరటం కష్టం. ప్రజా ఉద్యమ పోరాటంలో ఎక్కువ క్రియాశీలమైన మార్పుకోరే పక్షానికి ఉత్సాహవంతుడైన మిత్రుడిగా నజ్రులు లభించారు. 1924లో జైలునుంచి విడుదలయ్యాక నజ్రులు ఓ జిల్లానుండి మరో జిల్లాకి తిరగడం మొదలయింది. రాజకీయ సమావేశాలకి సాహిత్య గోష్ఠులకు నజ్రులుకి వచ్చే ఆహ్వానాలవల్ల ఓ చోట ఆయన స్థిరంగా ఉండలేకపోయారు. ఈ కాలంలో ఆయన కొత్త కవితలూ, పాటలూ రచించారు. ఆ రచనలని అందరూ ఇష్టపడి అభిమానించారు. అది సమంజసమే. రచనల్లో సార్వజనిక కవితలు, సార్వజనిక గేయాలే అధికంగా ఉన్నాయి. అంటే పెద్ద పెద్ద సమావేశాలకి సార్వజనికమైన అవసరాలకి తగినట్టుగా ఉన్నాయి. వీటిని గురించి తర్వాత చర్చిద్దాం.

ముందు నజ్రులు వ్యక్తిగత జీవితంలో జరిగిన మహత్తర సంఘటనలను గురించి పరిశీలించాలి. ఆ సంఘటనల ప్రాధాన్యత సార్వజనిక జీవితపు సంఘటనలకి ఏం తీసిపోదు. 1924 ఏప్రిలులో జరిగిన నజ్రులు వివాహం ఈ వ్యక్తిగత సంఘటనలన్నింటిలో గొప్ప సంఘటన.

ఇంతకు పూర్వం చెప్పనే చెప్పాం. కొమిల్లాలో నజ్రులు సేన్‌గుప్త ఇంటికి తరుచు వస్తూవెళ్తూ ఉండేవారు. మాతృవాత్సల్యం లాంటి ప్రేమాభిమానాలు నజ్రులుకి ఆ ఇంటి ఇల్లాలు బిరాజ్ సుందరీ దేవి దగ్గర లభించాయి. స్వంత ఇంట్లో విశ్రాంతి దొరికినట్టుగా ఆయనకి ఆ ఇంట్లో విశ్రాంతి దొరికింది. ఆ ఇంట్లో తదితర చిన్నా పెద్దా సభ్యులవల్ల స్నేహపూరితమైన వాతావరణం ఏర్పడి నజ్రులు అతిప్రియులైన అతిథి అయ్యారు. దాంతో ఆయనకి ఆ ఇంటి అమ్మాయి ప్రమీలపట్ల (తర్వాత ఆవిడ సంతకం ప్రకారం ప్రమీల నజ్రులు ఇస్లాం పేరుతో వ్యవహరించబడేది) క్రమంగా ఆకర్షణ పెరిగింది. పూర్వం చెప్పినట్టూ ప్రమీల ఇంద్రకుమార్ సేన్‌గుప్తకి మేనకోడలు. ఆయన విధవ మరదలు గిరిబాలకి ఏకైక కుమార్తె. సామాన్య బెంగాలీ కుటుంబాల్లోలాగే తల్లీ కూతురూ ఇద్దరూ ఇంద్రకుమార్ సేన్‌గుప్త ఆశ్రయంలో ఉన్నారు. ప్రమీల (దూలీ లేదా దోలన్ ఇంట్లో ఈ రెండు పేర్లతోనూ పిలిచేవారు) పదమూడు పద్నాలుగేళ్ళ వయస్సు

లోనే కవి నజ్రులు గారి సౌమ్యతని ఆర్ద్రతని, నిష్కపట స్వభావాన్ని గుర్తించింది.

1921 నాటికి వారిద్దరూ ఒకరిపట్ల ఒకరికి ఉన్న మనో భావాలను గుర్తించుకున్నారు. ఆ సంవత్సరం "ముస్లింభారత్"లో అచ్చయిన ఓ ప్రేమపాట "విజయిని" - తర్వాత ఛాయానట్ సంకలనలలో చేర్చబడినపాట-నజ్రులు ఏదో మాటకి కట్టుబడ్డారన్న సంగతిని సూచిస్తుంది. కాని ఈ సంబంధం ఇంకా గుస గుసల్లోనే ఉంది. బాహాటం కాలేదు. నజ్రులు "ధూమకేతు"లో మునిగిపోవడం, ఆ తర్వాత చెరసాలకి వెళ్ళడం — తమ భావాలు ఎంత బలీయమైనవో తెలుసు కోడానికి వాళ్లిద్దరికీ అవకాశాన్ని ఇచ్చాయి. 1924లో నజ్రులు హుగ్లీలో ఉన్నప్పుడు ప్రధానం జరుగుతుందని ప్రకటించారు. వివాహం కూడా లాంచన ప్రాయంగా జరిగింది. బెంగాలులో హిందువుల్లోనూ, ముస్లిముల్లోనూ — ఇరు వర్గాల్లోనూ ఈ వివాహం పెద్ద అలజడి కలిగించింది. ఆ నేపథ్యంలో ప్రమీల నజ్రులు ఇద్దరూ ప్రదర్శించిన సాహసం గురించి, వారి ప్రేమ ఎంత గాఢమైనదో తెలియచెయ్యడమే తప్ప ఈ విషయంతో విశేషించి ఇంక చెప్పడానికి ఏమీలేదు.

చదువుకున్న కుటుంబానికి చెందిన హిందువుల అమ్మాయి ఓ ముస్లింని పెళ్ళిచేసుకోడం హిందూ ధర్మ శాస్త్రాల ప్రకారం తప్పు. అంతేకాదు, బెంగాలులో ఇటువంటిది ఆ అమ్మాయి కుటుంబానికి, వారి బంధువర్గానికి సిగ్గుచేటైన విషయం, సేన్‌గుప్త కుటుంబంలో ఒక్క గిరిబాలదేవి తప్ప ఇంకెవరూ ఆ పెళ్ళిని అంగీకరించలేదు. ఆవిడ వారిద్దరికీ మద్దతు ఇచ్చింది. తన పాత సంబంధాల నన్నిటినీ వదులుకుని తనూ కొత్త ఇంటికి వచ్చేసింది. కష్టానికీ సుఖానికీ అన్ని సమయాల్లోనూ కుటుంబంలో ఓ పెద్దగా పాత్ర వహిస్తూ వచ్చింది. దీనిని మనం ముందు ముందు గమనించగలం. విరాజ్ సుందరీదేవికి నజ్రులు పుత్ర సమానుడు. కాని ఆవిడా ఈ వివాహానికి అంగీకరించలేదు. వివాహానికి రాలేదు. దీనికి మనం ఆశ్చర్యం పడవలసినదేం లేదు. చాలా కాలంవరకూ ఈ ఇద్దరితోనూ, ఈ కొత్త ఇంటితోనూ ఏ సంబంధం లేకుండా ఆవిడ ఉంటూ వచ్చింది. తన కొడుకులు, కూతుళ్ళూ సాంఘికంగా ఏ చెడ్డ మాటా పడకుండా ఉండాలన్నదే ఆవిడ లక్ష్యం. నజ్రులుకి ఆవిడ పరిస్థితి తెలుసు. తన పుస్తకం "సర్వహారా"ని ఆయన విరాజ్ సుందరీదేవికి అంకితం ఇచ్చారు. సంతోషించవలసిన విషయం

ఈ ఎడంగా ఉండటం అన్నది 1938 ఆఖరి రోజులకి పోయి, తిరిగి పాత సంబంధాలు ఏర్పడ్డాయి. ఆ ఏర్పడిన సంబంధాలు 1938 ఆఖరి రోజుల్లో విరాజ్ సుందరి దేవి చనిపోయేటంతవరకూ నిలిచి ఉన్నాయి.

అటు ముస్లిములు కూడా ఈ వివాహానికి సంతోషించలేదు. ఆనాటి వాతావరణంలో ఈ వ్యవహారాన్ని మత పరమైన దృక్పథంతో లాభానికి వినియోగించుకోవచ్చును. అయితే నజ్రులుగాని ప్రమీలగాని ఇద్దరిలో ఏ ఒక్కరూ ప్రత్యేకమైన ఓ మత సిద్ధాంతాన్ని లక్ష్యపెట్టేరకం కాదు. హిందువులు కానీ, ముస్లిములు కానీ, ఎవరైనా కానీ సహాయపడ్డానికి వాళ్ళిద్దరూ ఎప్పుడూ సిద్ధంగా ఉండేవారు. చాలామంది ముస్లిములకి నజ్రులు ప్రమీలల వివాహం చేసుకున్న పద్ధతికూడా సంతృప్తికరంగా లేదు. సంప్రదాయపద్ధతిని - ముస్లిం పద్ధతిని వివాహం చేసుకోడానికి పరిస్థితులు వీలుగా ఉన్నాయి. ప్రమీలకి అప్పటికి పదహారేళ్ళే. 18 ఏళ్ళు నిండకుండా ఆవిడ రిజిస్టరు వివాహం చేసుకోలేదు. ఆవిడకి ఒకే ఒక మార్గం ఉంది. ఇస్లాంమతాన్ని స్వీకరించి ఇస్లాం పద్ధతిని వివాహం చేసుకోవడం, మతగ్రంథాన్ని అనుసరించి నడిచే ముస్లిములకి, యూదులకి, క్రైస్తవులకి మతంమార్పిడికి స్వీకృతి లభిస్తుందని సంప్రదాయవాదులైన ముస్లిములు నమ్ముతారు. అంచేత మతంమార్పిడి లేకుండా ప్రమీల ఓ ముస్లిముని వివాహం చేసుకోవడం కుదరదు. అయితే భారతదేశంలో . మొగలు చక్రవర్తులు (ఉదాహరణకి అక్బరు) హిందూ స్త్రీలకి కూడా ఈ స్వీకృతిని ఇచ్చారు. ఆ స్త్రీలు తమ పద్ధతి ప్రకారం వివాహం చేసుకునే వారు. వారికి తమ నమ్మకాల ప్రకారం మతపరమైన కార్యాలు నిర్వహించడానికి కావలిసిన స్వేచ్ఛకూడా ఇచ్చేవారు. సంప్రదాయవాదుల ప్రకారం ఇది తప్పు. అయితే నజ్రులు నిజాయితీపరులు- మిక్కిలి స్వాభిమానం ఉన్నవారు. ఎవరికీ స్వమతాన్ని త్యజించమని చెప్పేరకం కాదు. వివాహం ముస్లిం పద్ధతినే జరిగింది. కాని దానికోసం ప్రమీల మతం మార్పిడి జరగలేదు. ఆమె ముస్లింకాలేదు. అంతేకాదు- నజ్రులు తన భార్య బాధ్యతని, తనఇంటి యావత్తు బాధ్యతని తన అత్తగారికే వదిలేశారు. ఆవిడ హిందువు. విధవరాలు. నజ్రులుల ఇల్లు ఈ విధంగా మతసహనం ఉన్నఇల్లు. వారి గృహస్థ జీవితం మత సహనంతో, ఏ ఒక మతసిద్ధాంతానికో కట్టుబడకుండా ఉండేది. వారి ఇంట్లో అటు సంప్రదాయవాదులైన ముస్లిముల ఇంటిలక్షణాలు కాని, ఇటు సంప్రదాయవాదులైన హిందువుల ఇంటి లక్షణాలు కాని కొద్దిగానైనా కనిపించేవి

కావు. ముస్లిములకు ఇది సంతృప్తి కలిగించే విషయంకాదు. గట్టి నమ్మకాలు కలిగి ఖచ్చితమైన ముస్లింగా నజ్రులు జీవితం గడపాలని వారు ఆశించారు. అయితే వివాహం అన్నది వివాహమే. ఏది ఏమైనా కానీ అది వివాహమే. అంతే కాక మరో ముఖ్య విషయం నజ్రులు నజ్రులే. ఆయన తిరుగుబాటుదారు. కవి. ఆయన స్నేహితులు, పాఠకులు ఆయనని స్వీకరించారు. కవి నజ్రులుని ఆయన భార్యని వారిద్దరి సాహసాన్ని ప్రేమని ఈ వర్గాలు గౌరవించాయి. మొత్తంమీద చూస్తే ఆ తర్వాత సంవత్సరాలలో ఊహించని విధంగా ఘోరమైన ఆపదలు రాసంతకాలం వీరిద్దరి జీవితం ఎంతో సుఖప్రదమైన జీవితమే! ఆపదలు మన వారి చేతిలో లేవు కదా!

నజ్రులు గొప్ప ఆదర్శవంతుడేమీకాదు. అయినా ఆయనకి ఆయన భార్య పట్ల గల నిండుప్రేమని బాధ్యతని ఏ మాత్రం శంకించడానికి వీలులేదు. 1939 లగాయితు ఘోరమైన శారీరక యాతనలతో కష్టాలతో నిండిన కాలంలో కూడా ప్రమీలకు భర్తపట్ల ఉన్న ఆరాధనా భావంలో వ్యత్యాసం ఏం రాలేదు. చెక్కు చెదరని ఆ ఆరాధనాభావం ఆమె 30 జూలై 1962న తుది ఊపిరి విడిచేటంత వరకూ అలాగే నిలిచిఉంది. ఆమెది సంపూర్ణమైన ఆత్మ సమర్పణతో నిండిన ఓ అపూర్వమైన ప్రేమగాథ. కనీ వినీ ఎరగని సాహసగాథ.

హూగ్లీలోని ఈ చిన్న ఇంటికి, ఈ కొత్తఇంటికి సమకూర్చుకోవలసినవి ఇంకా చాలా ఉన్నాయి. ఇల్లు గడవడానికి డబ్బుకావాలి. ఆర్థిక దృష్ట్యా 'నాకేమి' అన్న స్థితి నజ్రులుకి ఏనాడూ తెలియదు. పుస్తకాలవల్ల తదితర రచనలవల్ల వచ్చే ఆదాయం మరీ అంత ఎక్కువ ఏం కాదు. నజ్రులు ఓ విషయంలో మరీ ఔదార్యం కలవారు కూడా! ఆయన ఇంటికి కలకత్తానుంచి తరుచు అతిధుల రాకపోకలు జరుగుతూ ఉండేవి. ఆయన ఆ అతిధులకి ఎంతో ఉత్సాహంతో స్వాగతం పలికేవారు. ఈ అతిధులకోసం అదనంగా డబ్బు కావలసివచ్చేది.. ఆ రోజులు సమావేశాలకి, వినోదాలకి, సరదాలకి, సంగీత గోష్ఠులకి రోజులు. అంటే దాని అర్థం నజ్రులు కుటుంబానికి ఇబ్బంది తప్పనిస్థితి. 1925 ఆఖరి రోజుల్లో పరిస్థితి మరీ విషమించింది. చేతిలో డబ్బు ఆడక పోవడమేకాదు, నజ్రులు చాలాసార్లు మలేరియా వాతపడ్డారు. నజ్రులు పాతమిత్రులు ముజఫరు అహమ్మదు శిక్ష నిబంధన ప్రకారం కారాగారంలో ఉన్నారు. అంచేత కృష్ణ

నగర్‌లోని మిత్రులు, విశేషించి కీర్తిశేషులు హేమంత సర్కారు నజ్రుల్ని కుటుంబ సమేతంగా తమ ఊరుకి జనవరి 3వ తారీఖు 1926ని తీసుకువెళ్ళడానికి అక్కడ ఉంచడానికి అంగీకరింపచేశారు.

అయితే పైన చెప్పినట్టు యాతనలు పడుతున్నప్పటికీ హుగ్లీలో ఉన్న కాలంలో నజ్రుల కవిత్వం అల్లి చెప్పడంలోగాని, ఆయన రాజకీయ కార్యకలాపాల్లో గాని ఏలోటూ రాలేదు. మొదటిసారీ చివరిసారీ నజ్రుల్ అక్కడే గాంధీజీని కలిశారు. ఆ రోజుల్లో గాంధీజీ జైలునుంచి విడుదలై బెంగాలులో పర్యటిస్తున్నారు. తనవే అయిన భిన్నమైన భావాలు నజ్రులుకి ఉన్నప్పటికీ ఆయనకి గాంధీజీపట్ల నిరసనభావం లేదు. నజ్రులు రాట్నంపాట రాసి స్వయంగా గానం చేసి విని పించడంతో గాంధీగారు ఎంతో సంతోషించారు గాంధీజీని కలిసిన కారణంచేతే మరికొన్ని కవితలను ఆయనపట్ల గౌరవాన్ని ప్రదర్శిస్తూ నజ్రులు వ్రాశారు. అయితే నజ్రులు చిత్తరంజనదాసు మరణానికి ముందురోజుల్లో వరసగా కవితలు వ్రాశారు. ఆ కవితలు హృదయాన్ని అధికాధికంగా స్పందింపచేసే కవితలు. సహజమైన మహోన్నతమైన కావ్యాత్మకతతోనూ సంగీతాత్మకమైన గుణంతోనూ విలసిల్లే కవితలు అవి.

1925, జూన్ 22న చిత్తరంజనదాసు డార్జిలింగులో అకస్మాత్తుగా చని పోయారు. యావత్ బెంగాలూ శోక సముద్రంలో మునిగిపోయింది. నజ్రులికి ఇది వ్యక్తిగతంగా పెద్దదెబ్బ. దాసుగారి కుటుంబంలో నజ్రులంటే ప్రేమా, మెప్పుదలా నిజంగా ఉండేవి. చిత్తరంజనదాసు స్మృతికి రాసిన అనేక కవితల్లో నజ్రులు తన దుఃఖాన్ని వ్యక్తీకరించారు. ఆ స్మృతి కవితలన్నీ 'చిత్తనామా' "అన్న శీర్షికతో వేరుగా సంకలనంగా వెలువడ్డాయి. సుమారుగా ఈ కాలంలోనే ఆయన ఒక దీర్ఘ కవిత "తుఫాను" రాశారు. తర్వాత ఆ కవిత 'విషేర్‌బంశీ' (విషపూరితమైన వేణువు)లో సంకలితమైంది. 1925 సంవత్సరం పూర్తి కాక ముందే నజ్రులువి రాజకీయ భావాలతో, రాజకీయ కార్యకలాపాలతో ప్రత్యక్ష సంబంధం ఉన్న విశిష్టరచనలు పరంపరగా రావలసి ఉంది.

ఓ రచయితగా తన ప్రారంభదినాల్లోనే (1921లో) సోవియట్ సోషలిస్టు వ్యవస్థ పట్ల, ఆ భావాలపట్ల నజ్రులు ఆకర్షితులయ్యారన్న విషయాన్ని మనం ముందే గమనించాం. దీనికి ఆయనలో సహజంగా ఉన్న ఆదర్శవాదం,

స్వాతంత్ర్యం సమానత్వం, సౌభ్రాతృత్వం పట్ల ఆయనకి ఉన్న గాఢానురక్తికి సంబంధం ఉంది. సోవియట్ వ్యవస్థతోనూ, సామ్యవాద సిద్ధాంతాలు, వాటి ఆచరణతోనూ ప్రత్యక్ష సంబంధమూ జ్ఞానమూ ఉన్నవారు ఆ కాలంలో భారతదేశంలో తక్కువ సంఖ్యలో ఉండేవారు. అయినప్పటికీ అనేకమంది యువకులని ఆదర్శవాదులైన భారతీయులని సామ్యవాదం, ఆ వాదంలోని సాధారణ భావాలు ఉత్తేజపరిచాయి. ఇంతకుపూర్వమే మనం గమనించిన విధంగా నజ్రులూ ముజఫరూ సాహిత్యం ద్వారాను, కావ్యరచన ద్వారాను ఒకేసారి ముందడుగు వేశారు. రాజకీయ భావాలవల్ల జనసామాన్యంపట్ల వారిద్దరికీ ఉన్న వాస్తవమైన ప్రేమవల్లా ఒకరికొకరు ఇంకా సన్నిహితులయారు. భారతదేశంలో సామ్యవాద స్థాపనకి పని చెయ్యాలి అన్న తన మిత్రుని అభిప్రాయంతో నజ్రులు ఏకీభవించారు. శాంత స్వభావుడు, కృత సంకల్పుడు ముజఫరు అహమ్మదు దాదాపు 1922వ సంవత్సరం నుంచీ భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీని స్థాపించటానికి ప్రయత్నం మొదలుపెట్టారు. నజ్రులుకి మార్క్సిస్టు సాహిత్యం లభ్యమై ఆ సిద్ధాంతాలను, ఆచరణలను అవగాహన చేసుకోవడానికి అవకాశం ఉన్నదనుకున్నా, ఆయనకి మార్క్సిస్టు సిద్ధాంతాన్ని పరీక్షించి చూసే ప్రవృత్తిగాని, స్థిరమైన మార్క్సిస్టు సంస్థకోసం పనిచేసే ఓర్పుకాని లేవు. కవిత్వం అల్లటం, పాటలు కట్టడంపట్ల ఆయనకి సహజంగా ఉన్న మానసికస్పందనా, తక్షణ స్వాతంత్ర్యప్రాప్తికోసం తనచుట్టూ జరుగుతున్న జాతీయపోరాటం, మార్క్సిస్టు సిద్ధాంతాలపట్లా కార్యకలాపాలపట్లా ఓ దృక్పథాన్ని తన మనస్సులో ఏర్పరచుకోడానికి ఆయనకి వీలుని కాని సమయాన్ని కాని ఇవ్వలేదు. 'ధూమకేతు'లో అచ్చయిన ఆయన రచనలు ఆయన తనకి కలిగిన సహజసిద్ధమైన భావాలతోనే ముందడుగు వేస్తున్నారని స్పష్టంచేస్తాయి. నిజానికి ఏ రకమైన కమ్యూనిజం గాని, శ్రామికవర్గ భావజాలంగాని ఆయనని ముందుకి నడిపించలేదు. విప్లవాత్మకమైన జాతీయవాదం, ప్రజాస్వామిక విప్లవం ఆయనని ముందుకి నడిపించాయి. అయితే ఆయనని, ఆయనలాంటి తదితర స్వాతంత్ర్య ప్రియులైన భారతీయులని ఎంతమందినో ఆ కాలం పరీక్షిస్తోంది. బార్డోలీ తీర్మానం తర్వాత దేశంలో రాజకీయ విషాదం వ్యాపించింది. స్వరాజ్యవాదులు విముఖత్వాన్ని తెలియచెప్పే తమ పార్లమెంటు కార్యక్రమాలతో ఆ విషాదాన్ని తొలగించలేకపోతున్నారు. ఈ స్థితి నజ్రుల్ని ఆయనలాంటి ఉత్సాహవంతులని, ఆతృత నిండిన యువకులని తమ

తమ దృక్పథం గురించి పునరాలోచించవలసినదని ప్రేరేపించింది. సంక్షిప్తంగా చెప్పాలి అంటే వీరు ఆలోచనా విధానంలో సోషలిస్టుల్ని సమర్థించేవారు. అంచేత రాట్నంపాట, దేశబంధు మరణం పైన రాసిన విషాదగేయాలు, కవితలు ఆసమయానికి తగినట్టు నిజాయితీతో రాసినవే. ఆ తర్వాత నజ్రుల్ని సోషలిస్టుల గ్రూపులో లేదా రాడికలు గ్రూపులో చేరి 'నవంబరు 1925లో భారత జాతీయ కాంగ్రెసులో మజూదూర్ స్వరాజ్యపార్టీ పెట్టడానికిగాను హేమంతకుమార్ సర్కారు సాంగత్యంతో చూస్తాం. మజ్‌దూర్ స్వరాజ్యపార్టీ కమ్యూనిస్టులను సమర్థించే గ్రూపు. ఓ రకంగా ఈ రకమైనది బెంగాలులో ఇదే మొదటిది. ఇది పుట్టిన ఓ నెల తర్వాత పార్టీ పత్రిక ''లాంగల్'' అచ్చుకావడం మొదలయింది. నజ్రులు దీనికి ప్రధానమైన రచయిత. వాస్తవానికి నిజమైన సంపాదకుడుకూడా. ఈ పత్రిక రచనాత్మకమైన శక్తిగా రూపొందాలని శుభాకాంక్షలు తెలుపుతూ రవీంద్రుడు రాసిన ఓ ద్విపది కూడా 'లాంగల్' మొదటి సంచికలో అచ్చయింది. ఈ ప్రారంభ సంచిక (1925 డిసెంబరు 25) మరో కారణంగా కూడా మిక్కిలి గుర్తుపెట్టుకోవలసిన పత్రిక అయింది. ఈ సంచికతోనే నజ్రులు "సర్వహారా" శీర్షికతో రాసిన కవితలు శృంఖలాబద్ధంగా పాఠకలోకం ముందుకు వచ్చాయి. ప్రతి కవితా ఓ ఉపశీర్షికతో అచ్చయింది "ఈశ్వరుడు", "మనిషి", "పాపం", "వేశ్య" 'స్త్రీ', "కూలివాళ్లు'. ఇది చారిత్రక యుగాన్ని స్థాపించిన విశిష్ట సంఘటన. మొట్టమొదటిసారిగా బాహాటంగా నిరుపేదలైన శ్రామికుల గౌరవార్థం ప్రకటించిన మొదటి కవిత్వం, ఆ వర్గానికి కావ్యాత్మకమైన పేరు, జనప్రియమైన పేరు 'సర్వహారా' (ఏమీలేనివారు) అని పెట్టడం జరిగింది. ఈ కావ్యం అన్యాయానికి విరుద్ధంగా వెలువడిన అతి ఉజ్జ్వలమైన నేరారోపణపత్రం. ఇది గతి తార్కిక భౌతికవాదంకన్నా తటస్థ ఆదర్శవాదాన్ని గురించి చెప్పడానికి చేసిన ప్రయత్నం అయినా, కవితగా స్మరణీయమైన కవితే-ఇందులో మనిషిని-మనిషి అయిన కారణంచేత ప్రస్తుతించటం జరిగింది. 'లాంగల్' జనవరి 26 రెండవ సంచికలో (నజ్రులు ఆ సమయానికి తనకుటుంబంతోపాటు కృష్ణనగర్‌కి వెళ్లిపోతున్నారు) 'కృషికేర్‌గాన్' (రైతులపాట) అచ్చయింది. ఈ పాటతో సమానంగా పేరుతెచ్చుకున్న మరో రచన "సవ్యసాచి" మూడో సంచికలో వచ్చింది. ఇవి అన్నీ ఉదాత్తమైన కవితలే. వీటివల్లనే 'లాంగల్' అతి త్వరలో చాలా వరకూ విజయవంతమైంది. "ధూమకేతు"తో పోల్చిచూస్తే 'లాంగల్' అంత

ధగధగాయమానంగా ప్రకాశించలేదు. అయినా అవకాశాలులేని పేదల పత్రికగా రైతుకూలీల, దళిత స్త్రీ పురుషుల పత్రికగా ఎక్కువ పేరు తెచ్చుకుంది. ఈ పత్రిక నజ్రుల్ స్వంతపత్రిక కాదన్న సంగతినికూడా మనం గమనించాలి. అది ఓ రాజకీయ వర్గానికి చెందిన మజ్‌దూర్ స్వరాజ్యపార్టీ పత్రిక. ఆ రోజుల్లో పార్టీ ఆఫీసు 37 హేరిసన్‌రోడ్డు (ఇప్పుడు మహాత్మాగాంధీమార్గ్)లో ఉండేది. నజ్రుల్ చిరునామా కలకత్తాలో అదే. ఉండడానికి ఆయన కృష్ణ నగర్‌లో ఉండే వారు. నజ్రుల్ మిత్రుల స్థావవరమూ అదే! మజ్‌దూర్ స్వరాజ్యపార్టీ కొంత మార్పుతో కాలక్రమేణా బెంగాలులో కమ్యూనిస్టు గ్రూపుని ఏర్పరచే దిశగా పయనిస్తోంది.

1926 జనవరిలో నజ్రుల్ కృష్ణనగర్‌కి మకాం మార్చారు. స్థానికులైన యువకులు కీర్తిశేషులు హేమంత సర్కారులాంటి రాజకీయవేత్తలు, భావపరి పక్వత చెందినవారు నజ్రుల్ రాకకోసం ఎదురు చూస్తున్నారు. శ్రీ సర్కారు బెంగాలు అసెంబ్లీలో స్వరాజ్య పార్టీ మెంబరు. కాలేజీ రోజుల నుంచీ సుభాష్ చంద్రబోసుకి మంచి మిత్రులు, (సుభాష్ బోసు ఆ రోజుల్లో మాండలే జైల్లో 1818 సంవత్సరపు మూడవ నిబంధన కింద ఏ కేసూ లేకుండా ఖైదీగా ఉన్నారు) మాజీ ప్రొఫెసరు, విద్యార్థి నాయకుడు చెప్పుకోదగిన సాహిత్యాభిరుచి ఉన్నవాడు, బుద్ధిజీవి అయిన శ్రీ సర్కారు కొద్దిగానో గొప్పగానో సోషలిస్టు ఆలోచనలు కలిగినవాడు. నిజానికి ఆయన స్వరాజ్యపోరాటాన్ని ప్రజాభిముఖంగా నడపాలన్న అభిప్రాయం ఉన్నవాడు. నజ్రుల్ ఇబ్బంది పడుతున్న రోజుల్లో, ముఖ్యంగా ముజఫరు అహమ్మదు లేని రోజుల్లో ఆయన సహజంగానే నజ్రుల్‌తో స్నేహం చేశారు. వీరిద్దరూ తమ లక్ష్యాల్ని సాధించటానికి రాజకీయ కార్యకలా పాలకి సంసిద్ధులయ్యారు. అంతకు పూర్వమే శ్రీ సర్కారు, ఆయన కృష్ణనగర్ మిత్రులు అనేక రాజకీయ సాంఘిక సమ్మేళనాలను ఏర్పాటు చేయటానికి ప్రణాళికలు వేసిఉన్నారు. సహజంగానే వాటిల్లో నజ్రుల్ ప్రముఖ పాత్ర వహించ వలసి ఉన్నది. అఖిల బెంగాలు రైతు కాంగ్రెసు — ఈ విధమైనది. బహుశా ఇదే మొదటి కాంగ్రెసు - 1926 ఫిబ్రవరి 6,7 తేదీల్లో జరగబోతోంది. దానికి నజ్రుల్ సహాయం కావాలి. కృష్ణనగర్‌లో మంచి వైద్య సదుపాయం ఉన్న కారణం చేత నజ్రుల్ అతిత్వరలోనే కోలుకున్నారు. సదా పనిలో మునిగి పోయి అందరికన్నా ఎక్కువ పనిచేసే కార్యకర్త అయ్యారు. ఆ సమ్మేళనానికి

ప్రారంభగీతం నజ్రుల్ రాసిన "శ్రమికేర్‌గానే" (శ్రామికుల పాట). బెంగాలు రైతు కూలీల పార్టీ ఏర్పడడానికి ఈ రైతు కాంగ్రెసు సమ్మేళనం దోహద పడ్డది. బెంగాలులోని కమ్యూనిస్టు సంస్థకి కార్యరంగంలో దూకే సాధనంగా ఈ పార్టీ ప్రధానంగా మీరట్ కమ్యూనిస్టు కేసు (1929-33)లో ముందుకు వచ్చింది. ప్రచార సాధనమైన 'లాంగల్' పేరు 1926 సెప్టెంబరు 25నుంచి 'గణవాణి'గా మార్చడంతే ఆశ్చర్య పడవలసిన పనిలేదు. ఇది బెంగాలులో బహిరంగంగా చెప్పుకున్న మొదటి మార్క్సు వాదపు ప్రచారపత్రిక. నజ్రులుకి ఇందులో ప్రధాన మైన పాత్ర ఏంలేదు. ఇంతకు పూర్వమే ముజఫరు విడుదలయ్యారు. 'గణవాణి' పనిని ఆయన చేతపట్టారు. ఈ పత్రిక ఎక్కువగా మార్క్సు వాదపు పత్రిక - మార్క్సు వాదపు సిద్ధాంతాలని రాజకీయాలని ఆవేశరహితంగా వ్యాఖ్యానిస్తూ ఉండే పత్రికే కాని, జర్నలిజం రంగానికి చెందిన ఉద్వేగ ఉత్సాహాలతో నిండిన నజ్రులుకి సరిపోయే సాహిత్య పత్రికేం కాదు.

మే 1926 కి కృష్ణనగర్‌లోని ఇతర సమ్మేళనాలు నిర్ణయించబడ్డాయి. అయితే ఆ సంవత్సరం ఏప్రెలు నెలలో అకస్మాత్తుగా కలకత్తాలో హిందూ ముస్లిముల మతకలహాలు మొదలయ్యాయి. ఇది సరికొత్త సంగతి. భయంకర మైనది. దారుణమైనది. క్రూరమైనది. ఓసారి కలహాలు ఆగి కొంతకాలానికి మళ్ళీ అంత భయంకరంగానూ మొదలయ్యాయి. మతపరమైన రెండు ప్రెస్సులు -- హిందువులది, ముస్లిములది - తమతమ వాణిజ్య లాభాలకోసం నీచబుద్ధితో కావాలని ఓ లక్ష్యం పెట్టుకుని మతపరమైన ఉద్వేగాల్ని రెచ్చగొట్టి హానికరమైన విషపూరితమైన వాతావరణాన్ని సృష్టించాయి. ఈ వాతావరణం ప్రాణనష్టం, ఆస్తినష్టం కన్నా ఎక్కువ హానిని కలగచేసింది. ఈ వాతావరణం వలన కలి గిన అనుమానాన్ని అపనమ్మకాన్ని తొందరలో తొలగించడం సాధ్యంకాని పని. తర్వాత సంఘటనల వలన ఆ పిమ్మట కూడా సాధ్యం కాలేదని తెలుస్తోంది. మతపరమైన ఉద్వేగాలు కూడనివని నజ్రులు కలం అలుపులేని పోరాటం సాగిస్తూనే వచ్చింది. ఆయన జీవితానికి, ఆయన రచనలకి ఓ శాశ్వతమైన లక్ష్యంగా ఇది చివరివరకూ నిలిచిఉంది. తీక్షణమైన వ్యంగ్యం, ఉగ్రతతో కూడిన క్రోధం, మైత్రికోసం, దేశభక్తికోసం ఆయన మనస్ఫూర్తిగా చేసిన అభ్యర్థనలూ ఎన్నడూ ఆగిపోలేదు. తుదివరకూ సాగుతూనే ఉన్నాయి. ఆ వేసవి నెలల్లో కృష్ణనగర్ నిండా వైషమ్యపు ఛాయలు దట్టంగా ఆవరించుకునే

ఉన్నాయి. సమావేశాలలో వాస్తవానికి అత్యంత ప్రాబల్యం వహించినవారు మెజారిటీ ఉన్న హిందువులే. అంతేకాదు, వారు తాము అర్థంచేసుకునే రీతిలో 'ముస్లిము వేర్పాటువాదం' 'ముస్లిం మతతత్వం'తో జాతీయ లక్ష్యాలను మసగ బారించారు. గందరగోళంతో అయోమయంతో నిండిన మత రాజకీయ వాతా వరణానికి ఎడంగా నిలిచి నజ్రులు కని హృదయం దేశభక్తి భావాలతో, స్వాతంత్ర్యం కోసం ఉదాత్తంగా ఉద్ఘోషిస్తూ తన సర్వోత్కృష్టమైన గేయాలను కొన్నిటిని ఆలాపించింది. కృష్ణనగర్‌లో జరిగిన వివిధ సమావేశాలు ఆ గేయాల అలావనతోవే ప్రారంభమయ్యాయి.

బెంగాలీ భాషలో జాతీయ గీతాల సంపద చాలా సమృద్ధ వంతమైనది. ఎంతో ఉదాత్తమైనది. అయితే రాజకీయ సమావేశపు వార్షికోత్సవంలో ఆలా పించిన 'కందరీ హోషియార్' నజ్రులు గేయంలో లా కదిపి కుదిపి ఉద్రేకపరిచే రాగవరస గాని, రెచ్చగొట్టి లేచిరమ్మని పిలుపునిచ్చే ఆకర్షణగాని వాటిలో వేటి లోనూ లేదు.

దుర్గమాలు అడవులు కొండలు ఎడారులు
దుస్తరాలు పారావారాలు
పథికులారా పారా హుషార్!
అర్ధరాత్రి అంధకారంలో
అధిగమించాలి
పారాహుషార్!!

(దుర్గమ గిరి కాంతార్ మరుదుస్తర్ పారావార్ లాంఘితె హెబె రాత్రి నిషితె, యాత్రిరా హోషియార్)

మరోరెండు బృందగానాలు మరింత ఆర్భాటంగా విద్రోహాత్మకమైన ధ్వని ఉన్నవి - ఉదాత్తమైనవి-ఉత్తేజాన్ని కలిగిస్తూ ప్రభావితం చేసేవి వచ్చాయి. వీటిలో ఓ దానిని విద్యార్థి సమ్మేళనపు ప్రారంభోత్సవంలో ఆలాపించారు. నజ్రులు ఆ బృందగానానికి ఎప్పటిలాగానే స్వయంగా నేతృత్వం వహించారు. విద్యార్థుల బృందగానం ఓ ప్రస్థాన గేయం - ఆ గేయం ఇలా ప్రారంభమౌతుంది.

మా బలం (అమారాశక్తి
మా శక్తి అమారా బల్
మా విద్యార్థి దళం- అమారా ఛాత్రదళ

అనువాదానికి లొంగని శక్తివంతమైన ఓజోవంతమైన అత్యుత్సాహ పూరితమైన పంక్తులతో పాట ముందుకి సాగుతుంది. మరో విధంగా ఈ విద్యార్థుల ప్రస్థానగేయం కన్నా ఎక్కువ ఉద్రేకపూరితమైనది యువకుల బృందగానం. ముందడుగు వెయ్యండని పిలుపునిస్తూ ఆ గానం ప్రారంభమౌతుంది.

పదండి పదండి పదండి
అదిగో పిలుస్తోంది
ఊర్ధ్వ గగనాన
మద్దెల దరువు
దిగువున
ధరణీతలాన
వినవస్తోంది తాళం!
పదండి పదండి పదండి
అరుణారుణ ప్రాతః కాలపు
నవయువకుల్లారా!
పదండర్రా పదండి! పదండి!

(ఛల్ ఛల్ ఛల్! ఊర్ధ్వగగనే బాజెమాదల్! నిమ్నే ఉతలా ధరణీ తల్, అరుణ్‌ప్రాతేర్ తరుణ్‌గణ్ ఛల్ ఛల్ ఛల్)

ఇంక వేటి మాటా ఎలాఉన్నా నజ్రుల్ని ఓ జాతీయకవిగా కృష్ణనగర్‌లో ఆయన గడిపిన రోజుల్ని రాబోయేతరాలు గుర్తుచేసుకోడానికి కేవలం ఈ మూడుగేయాలు చాలు కార్యరంగంలోకి దూకమని, సంఘర్షణకి దిగమనీ ప్రేరేపించడానికి. ఉద్వేగంతో ఆవేశంతో ఆహ్వానిద్దామన్నా ఆ కాలం నైరాశ్యంతో నిండి ఉన్నకాలం. మతపరమైన మార్గం చాలా కఠినమైనది. నజ్రులు కూడా ఆ గంభీర పరిస్థితిని గుర్తించారు. మత సామరస్యానికి మైత్రికి ఆయన చేసిన ప్రయత్నాలు తక్కువేం కాదు. ఆయన ఏది రచించినా, అది గద్య రచన కానీ, కావ్య రచన కానీ రెండిండిలోనూ మనసుని కరిగించే కరుణ నిండిఉంది. ఆ రచనలు ఇరవై

సంవత్సరాల తర్వాత రెండుగా చీలిపోనున్న బెంగాలు ప్రజలకి గర్వించదగిన వారసత్వపు సొత్తు. విషాద పూరితమైన సొత్తు. ఈ కోవకి చెందిన రచనల్లో జ్ఞాపకం ఉంచుకోవలసినవి హిందూ ముస్లిం యుద్ధం (పదునైన వ్యంగ్య కవిత) పదేర్ దిశ (మార్గపు దిశ) మందిర్ ఓ మస్జిద్ (దేవాలయాలు; మసీదులు) గద్య రచనలు.

మోహితులాలు నజ్రులు మధ్య వచ్చిన వివాదం గురించి కూడా ఇక్కడ చర్చించవచ్చు. ఆ రోజులనాటి పత్రికలు 'శనిబారేర్ చిఠీ', "కల్లోల్" రెండింటి లోనూ ఆ వివాద విషయాలు భద్రంగా ఉన్నాయి. ఆనాటి మతవైమనస్యపు వాతావరణ ప్రభావానికి ఈ వివాద విషయాలు కొంతమేరవరకూ గురిఅయ్యాయి.

అది మహా నిష్ఠురమైన కాలం. అయినా నజ్రులుకి సాహిత్యానికి సంబంధించిన విజయాలే కాక, మరిన్ని సంతోషకరమైన కాలక్షేపాలు కూడా దొరుకుతూ వచ్చాయి. ఆయన పెద్దకొడుకు బుల్‌బుల్ కృష్ణనగర్‌లోనే పుట్టాడు. అయితే అనతికాలంలో పసిపిల్లవాడిగానే బుల్‌బుల్ చనిపోయాడు. పిల్లవాడి అకాల మరణం తండ్రి నజ్రులుకి పెద్దదెబ్బే అయింది. అయినా బుల్‌బుల్ పుట్టుకతో నజ్రులుకి కొత్తఆశాకిరణం దొరికినట్టు అనిపించింది. ఆ రోజుల్లో ఆయనకి అదృష్టం అంతగా కలిసిరావటం లేదు. ఆయన రాజకీయ ఉద్యమపు ప్రచారంలో పూర్తిగా మునిగి ఉన్నారు. ఉద్యమం అంటే ఏమిటో ఆ ఉద్యమానికే అస్పష్టంగా ఉంది. మరో వంక ఆయన ఆర్థిక పరిస్థితిలో ఏం మార్పురాలేదు. "దారిద్ర్యం" కవిత ఈ రోజుల్లో రాసిన కవితే. ఇది అసాధారణమైన కవిత. ఈ కవితలో దిగులూ, విద్రోహం రెండూ ఉన్నాయి. ఆయనకి సహజంగానూ ఆత్మగతంగానూ ఉన్న ఉల్లాసపు ధోరణిని, దాని వేగవంతమైన ప్రవాహాన్ని శీతల దారిద్ర్యం గడ్డకట్టిస్తోంది. ఆ ప్రవాహం ప్రచండరూపం దాల్చడానికి, గడ్డకట్టకుండా ఉండడానికి కవి తన తిరుగుబాటు గొంతుని విప్పారు. కవి పరిస్థితి నిరాశతో నిండి ఉన్నదనీ, కృష్ణనగర్‌లో ఉన్నప్పటికీ ఈ పరిస్థితిని ఆయన ఏమీ మెరుగు పరుచుకోలేక పోయారనీ ఈ కవిత వల్ల తెలుస్తుంది. ఆయన అక్కడ ఓ ప్రాథమిక పాఠశాలని నెలకొల్పారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ని అక్కడే బెంగాలీలోకి మొదటి అనువాదం చేశారు. ఆయన మిత్రుల దగ్గర కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రాగపు వరస లేని కారణం చేత ఆయన అనువాదం ఆలాపించటానికి అనువైన అనువాదం కాలేదు.

హుగ్లీ ప్రవాసానికి సుమారు రెండున్నర సంవత్సరాల తర్వాత- అంటే 1928 చివరి రోజుల్లో నజ్రులు కృష్ణనగర్‌ని విడిచిపెట్టి కుటుంబ సమేతంగా కలకత్తా వచ్చేశారు. ఇక భవిష్యత్తులో కలకత్తానే ఆయనకి స్థిరనివాసం కానున్నది. మొదట్లో నగరానికి నట్టనడుమగా ఉన్న "హెన్ బజారు లేన్"లో ఉండేవారు. అక్కడ కొద్ది రోజులు ఉన్న తర్వాత ఉత్తరం వేపుకి వెళ్ళి పోయారు. అధికకాలం శ్యాంబజారు, బాగ్ బజారు ప్రాంతంలోనే ఉన్నారు. 1960 ప్రాంతాల్లో తన కొడుకుతో పాటు కలకత్తాలో తూర్పు భాగాన క్రిష్టోఫరు రోడ్డుని ఉన్న సి. ఐ. టి. బిల్డింగు ప్లాటుకి మారవలసి రానంతవరకూ జీవితంలో తర్వాత కాలంకూడా ఆయనకి అక్కడే గడిచింది.

కృష్ణ నగర్‌లో నజ్రులు రాజకీయ జీవితం ఔన్నత్యదశలో ఉన్నది. ఆయన అక్కడ కమ్యూనిస్టు మిత్రుల సాంగత్యంలో ఉన్నారు. ఆయన కమ్యూనిస్టుపార్టీ సభ్యులు కారు. దానికి కారణం తెలుసుకోడం ఏమంత కష్టమైన విషయంకాదు. మార్క్సువాద సిద్ధాంతాల పట్ల ఆయనకి అభిరుచి ఏంలేదు. సాంఘిక చట్రాన్ని ఆర్థిక చట్రాన్ని పరీక్షించటం కూడా ఆయన కార్యరంగంలోకి రాదు. రాజకీయాలకి సంబంధించిన వాద వివాదాల చర్చలన్నా ఆయనకి ఆసక్తిలేదు. ఆయన సామ్యవాదం సిసలైన మానవతావాదం. అట్టడుగుజనం పట్ల ప్రశుతిమించిన తీవ్రానుభూతితో నిండిన ప్రేమభావం. అందులో మళ్ళీ దివ్యశక్తి మీద అంతర్గతంగా విశ్వాసంకూడా ఉంది అన్న విషయాన్ని ముందు ముందు మరింత స్పష్టంగా గమనించగలం. ఆయన కమ్యూనిస్టు అయినా కాకపోయినా ఆయనకి తన దేశప్రజలన్నా, వారి స్వాతంత్ర్యం అన్నా ప్రేమ అన్నసంగతి మాత్రం యధార్థం. దేశ ప్రజలు ప్రజాకవిగా ఆయనని సరిగానే గుర్తించారు. తనది అంటూ సరియైన గుర్తింపు లేనప్పటికీ, ఓ సామ్యవాద కవిగా కూడా ఆయన అంతగానూ జనప్రియులు అన్నది కూడా వాస్తవమే.

1929 తర్వాత కలకత్తాలో నజ్రులు జీవితం ఓ కొత్త ప్రపంచంలోకి ప్రవేశించింది. తీవ్రమైన ఉద్వేగపు క్షణాలని వదిలిపెడితే, ఇప్పుడు ఆయన జగత్తు కావ్యజగత్తు కాదు. దాదాపు సంపూర్ణంగా ఆయన జగత్తు సంగీత ప్రపంచమూ, పాటల లోకమూ అయింది. 1929లో కలకత్తాకి వెళ్ళటానికి ముందే ఆయనవి కవితాసంకలనాలు, గద్య సంకలనాలతోపాటు పాటల సంకలనాలుకూడా అచ్చయాయి. అప్పటికి ఆయన పాటలసంకలనం చక్రవాక (1929)

కవితలు గేయాలతో వేసిన సంకలనం సంచితా (1928) కాక, 14 కవితా సంకలనాలు వెలువడ్డాయి. అవే కాకుండా ఆయనవి ఇంకా ఎన్నో కవితలు, గేయాలు పత్రికల్లోనూ, వ్రాతప్రతుల్లోనూ చెల్లాచెదురుగా పడిఉన్నాయి. ఎంచేతా అంటే ఆయన అపారప్రతిభని పట్టించుకోకుండా వదిలివేయడం జరిగింది. వీటి నుండి ఆ తర్వాత రెండు సంకలనాలను కూర్చడం జరిగింది. 1955లో అచ్చయిన సంచయన, 1957లో అచ్చయిన మరుభాస్కర్. ఈ సందర్భరంలో ఈ విషయం చెప్పడం ఉచితమే అవుతుంది. ఈ చివరి రెండు సంకలనాలను సిద్ధం చెయ్యడంలో, అచ్చువెయ్యడంలో నజ్రుల్ ప్రమేయం ఏం లేకపోయింది. తన పుస్తకాలను గురించిన వ్యక్తిగతమైన బాధ్యత బహుశా సంధ్య (1929), ప్రళయశిఖ (1939?) సంకలనాలు అచ్చయిన తర్వాత ఆయనకి లేకుండా పోయింది.

నజ్రుల్ కవితలు గేయాలతో కూర్చిన మొదటి సంకలనం సంచిత గురించి ఓ విషయం చెప్పడం అవసరం. 1928లో నజ్రుల్ తనజీవితాన్ని లోటులతో కష్టంగా గడుపుతున్నారు. నిజానికి ఆ రోజుల్లో ఆయన ఎంతో బీదరికాన్ని అనుభవిస్తున్నారు. నైరాశ్యంతో ముందుచూపు అన్నది ఏ మాత్రం లేకుండా మరవడానికి సాధ్యపడని గొప్ప కవితలు గేయాలు ఉన్న ఈ సంకలనాన్ని దాని కాపీరైటు హక్కుని డి. ఎమ్. గ్రంథాలయం, కలకత్తా వారికి కేవలం 3000 రూపాయలకి అమ్మేశారు. తర్వాత "సంచిత" అమ్మకం వల్ల వచ్చిన డబ్బు నజ్రుల్‌కి ఎన్నడూ లభించలేదు. డబ్బంతా ముద్రాపకులకే చెందుతూ వచ్చింది. అప్పటికి ఆయనకి మహాఉంటే 30 ఏళ్ళు ఉంటాయి. ఆ రోజులు ఆయన సృజనాత్మకతకి ఔన్నత్యపు రోజులు. ముందూ వెనకా చూసుకోకుండా తాను ఏది అమ్ముతున్నదీ ఆయనకే తెలీదు. ఇలాంటి వ్యవహారాల్లో ఆలోచనా పాలోచనా లేకుండా పశ్చాత్తాప పడవలసినంత అవివేకంగా వ్యవహరించడం అన్నది ఆయనకి ఇదే మొదటి పర్యాయం, ఇదే ఆఖరి పర్యాయం కూడా కాదు.

# ౫. ఆకాశ యాత్రికుడు

1930 ల ప్రారంభంలో నజ్రులు సృజనాత్మక ప్రతిభ రెక్కలువిప్పుకుని సుపరిచితమైన దిశగా పయనించిందనడంలో ఏ మాత్రం సందేహంలేదు. కాని ఇప్పుడు అపరిచితమైన క్షితిజాల వెళగా, ఆశించనితీరులో, విధి నిర్ణయించిన దిశగా ఆయన ప్రయాణిస్తున్నారు. ఆయన ప్రవేశించనున్న లోకం సంగీత లోకం. కవి రవీంద్రుడిలాగానే, నజ్రులు విషయంలోనూ ఆయన పుట్టుక సంగీతానికే అని చెప్పవచ్చు. ఓ రకంగా ఇది బెంగాలు ప్రాంతంలోని వైశిష్ట్యం అని చెప్పాలి. ఈ కారణంగానే బెంగాలు జానపదసాహిత్యానికి, జానపద సంగీతానికి గొప్పదయింది. బెంగాలీసాహిత్యం మిగిలిన వాటికన్నా గేయకావ్యంలోనూ కథా సాహిత్యంలోనూ అధిక సమృద్ధవంత మైనదయింది. భారతీయ సంగీతంలో ఓ విశిష్టమైన తరగతికిచెందిన 'బెంగాలీగాన్'లో సర్వసామాన్యంగా కొంతవరకూ మంచి నిర్దిష్టతతో, సమతూకంతో కూడిన లక్షణాలు కనపడతాయి.

(క) "కథ" ఆహ్వానాన్ని తెలిపే శబ్దాలు దీనిలో ఉంటాయి.

(ఖ) "స్వరం"- దీని వరసలు సంప్రదాయ బద్ధంగా ఉండవు. ఒక్కొక్కప్పుడు సంప్రదాయ వరసలు కలిసిఉంటాయి- లేదా కొత్తగా కల్పించిన రాగాలు ఉంటాయి.

(గ) దీంట్లో మొత్తంగా ఆకట్టుకోవడంలోనూ, వ్యక్తీకరించటంలోనూ జనప్రియంగా ఉండే లక్షణం ఉంటుంది.

నజ్రులు తన జీవితాన్ని ఓ జానపదగేయాలు, జానపద నాటకం గ్రూపు- లేతోదళంతో ప్రారంభించారన్న సంగతి మనకి తెలుసు. అందులో ఆయన పాట కట్టేవాడు. పాడేవాడు. ఆడించేవాడు కూడా ! ఆయన "కథ" రాశారు. దానికి అనువైన వరసలూ పెట్టారు. ఆయన వేణువుని, మరికొన్ని వాద్యాల్ని సునాయాసంగా వాయించగలిగేవారు. నజ్రులుకున్న ఈ ప్రతిభ సేర్‌సోలు రాజా వారి హైస్కూలు ఉపాధ్యాయుడు, సతీష్‌చంద్ర కాంజీలాల్ దృష్టిలోకి వచ్చింది. సతీష్‌చంద్ర శాస్త్రీయ సంగీతంలో మంచి జ్ఞానం ఉన్నవాడు. శిక్షణ ఎరుగని

నజ్రులు ప్రతిభకి ఓ గట్టి పునాదిని ఇచ్చే ఉద్దేశంతో ఆయన నజ్రులుకి శాస్త్రీయ సంగీతంలో మొట్టమొదటి ఓనమాలు తనకితానే నేర్పించాడు. ఈ పాఠాలు నజ్రులు సృజనాత్మక కృషికి కొసవరకూ ఉపయోగపడ్డాయి. ఆ తర్వాత కరాచీలో ఉన్న రోజులలో తదితరమైన బాణీల పట్ల భిన్న భిన్నమైన వాటిపట్ల అభిరుచిని పెంచు కోవడానికి ఆయనకి అవకాశాలు కలిగాయి. సైనిక మిత్రులకి ఆయన సాంగత్యం ఎంతో ఆహ్లాదాన్ని ఇచ్చేది. ఆయన ఆ మిత్రుల వల్ల సంప్రదాయానికి భిన్నమైన బాణీలను కొన్నిటిని, పంజాబీ వాటిని, పంజాబీతో సంబంధించిన వరసలను మరికొన్నిటిని నేర్చుకున్నారు. ఆయనికి తూర్పు సంగీతానికి దగ్గరైన దానిని నేర్చుకోవడానికి అవగాహన చేసుకోవడానికి అవకాశాలు లభించాయి. ఏది ఏమైనా కలకత్తా వచ్చి రావడంతో నజ్రులు అత్యుత్సాహంతో గానంచేసే గాయకుడిగా నవీన గేయాలురచించే రచయితగా, కొత్తగా కనిపెట్టి తనకితాను కల్పించి పాట లకి వరసలు కట్టగలిగే అద్భుతమైన ప్రతిభావంతుడిగా విభిన్న వర్గాల్లోని స్త్రీలకి పురుషులకి ప్రీతిపాత్రులయ్యారు. కవిత్వంకన్నా సంగీతమే అన్నివర్గాల్లోనూ ఆయనకి ఆమోద పత్రాన్ని అందించింది. దాన్నించే ఆయన అతిశీఘ్రంగా కలకత్తాలోనూ, యావత్తు బెంగాలు ప్రాంతంలోనూ జనప్రియులయ్యారు. ఆయన కంఠం అంత మంచిదేం కాదు. స్వరపరిపూర్ణతతో ఖణీ అయిన గాత్రమే. కాని అంత శ్రావ్యమైనదీ, ఇంపైనదీ కాదు. అయితే ఆయన శక్తి ఉత్సాహం అతి సునాయాసంగా పాడేవిధానం, వ్యక్తీకరణలో కనిపించే వాస్తవమైన సహజ్యం, నిజాయితీ అందరినీ మంత్రముగ్ధుల్ని చేసేవి. ప్రతి మంచికళ లాగానే ఆయన పాటలు కూడా సమ్మోహకాలే. ఆ సమ్మోహనతకి మొట్టమొదటి కారణం ఆ పాటల్లోని సజీవత్వం, నిజాయితీ. రెండోకారణం వాటిలోని మౌలిక గుణంగా కనిపించే తాజాతనం, నూతన కల్పన. చివరి కారణం- శబ్దం, భావావేశం, బాణీ- ఈ మూడింటి అద్భుతమైన మేళవింపు. అదేకాని లేనట్లయితే టాగూరు పాటలకి అలవాటు పడిన బెంగాలీ శ్రోతలు నజ్రులుకి స్పందించడం కష్టమై ఉండేది. నజ్రుల్ని శాంతినికేతనానికి రమ్మనమని, ఆ సంగీత పీఠంలో ఉండి తనకున్న ప్రతిభని క్రమబద్ధమైన శిక్షణతో వృద్ధి చేసుకోమని కోరి ఉండేవారు కాదు. అయితే ఆ ఆహ్వానాన్ని అంగీకరించటం కుదిరేసంగతి కాదని తేటతెల్లమవుతూనే ఉంది. నజ్రులు స్వేచ్ఛాప్రియులు. అదీకాక ఆయన ఆనాటి స్వాతంత్ర్యోద్యమంతో, రాజకీయ జీవితంతో గాఢంగా పెనవేసుకుని ఉన్నారు. తనకున్న ప్రతిభతోటే

నజ్రుల ఆరోజుల్లో రాజకీయ సమావేశాల్లో జవాన్ని హోరు ఎత్తించారు. (1921-23) 1922-28 ల్లో నజ్రుల జాతీయగీతాల గురించి, వాటి శ్రేష్ఠత, ఓజోగుణం గురించి మనం ఇంతకుపూర్వమే చర్చించాం. వీటితో పాటు ఇతర ధోరణులతో ఆయన రాసిన పాటలని గురించి కూడా తెలుసుకోవాలి. ఉదాహరణకి ప్రేమ గీతాలు, ప్రకృతిగీతాలు. నిజానికి ఆ రోజుల్లోనే నజ్రుల బెంగాలీ సంగీతానికి గజల్ని కూడా ఇచ్చారు. గజలుకి పుట్టిల్లు ఫార్సీ అయినా భారతదేశంలో ఉర్దూ కవిత్వం దానిని స్వంతం చేసుకుంది. హిందూస్థానీ సంగీతం గజలుని సర్వోత్కృష్ట రూపంలో అభివృద్ధి పరిచింది. బెంగాలీ సంగీతానికి గజల్ని పరిచయం చేసిన మొట్టమొదటి కళాకారుడు నజ్రులే. నజ్రులుకి శబ్దాలపొందిక, కూర్పు పట్ల ఉన్న నిజమైన మక్కువ. గజలుస్వభావంలో ఉండే సున్నితమైన భావావేగాలని వ్యక్తీకరించటానికి రాగవరసలకి మరింత బలాన్ని చేకూర్చేది. బెంగాలీ సంగీత రంగంలో 1926 నాటికే నజ్రుల సృజనాత్మక కళాకారుడిగా పరిగణించబడ్డారు. 1928 నాటికి ఆ రంగంలో ఆయన యోగ్యత తిరుగులేనిదైంది. 1928లో ఆయన పాటల మొదటి సంకలనం 'బుల్ బుల్' ఏనాడోరావలిసినది - ఎంతో ఆలస్యంగా అచ్చయింది. అయినా ఆ తర్వాత "చోఖేర్ చాతక" (1929)నజ్రుల గీతిక (1930) ఈ రెండూ శీఘ్రంగా అచ్చయి బైటికివచ్చాయి. చూస్తూ చూస్తూ ఉండగా ఈ పాటలు యావత్తు బెంగాలులో జనప్రియాలయ్యాయి. ఇప్పుడు నజ్రుల ఉన్నత గగనాన రెక్కలు విప్పి విహరిస్తున్నారు. ఇంగ్లీషు కవి షెల్లీ 'స్కైలార్కు' లాగ ఆయన ఆకాశ యాత్రికుడయ్యారు.

ఈ నూతన వికాసానికి వెనక ఓ నేపథ్యంకూడా ఉంది. 1928 వరకూ నజ్రుల తన కవిత్వం వల్ల గాని, గద్యరచనలవల్ల గాని తన ఆర్థిక పరిస్థితిని మెరుగుపరుచుకోలేక పోయారు. అంతకు ముందే ఓ బ్రిటిషు గ్రామఫోనుకంపెనీ భారతదేశంలోని పెద్దమార్కెట్టులోకి స్వలాభాలను పెంచుకుంటూ చొచ్చుకు రావటానికి ప్రయత్నాలు మొదలుపెట్టింది. కలకత్తాలోని రేడియో కంపెనీ ఇంకా వృద్ధిలోకి రావటానికి ప్రయాసపడుతున్న ప్రైవేటు ఉద్యమమే. 'ఫిల్ముసంగీతం' అనేది ఇంకా ప్రచారంలోకి రాలేదు. బ్రిటిషు గ్రామఫోను కంపెనీకి ఈ తిరుగుబాటు కవి పాటల్లో అంతర్గతంగా ఉన్న రాజకీయపరమైన వస్తువు గురించి పూర్తైన ఎరుకఉన్నప్పటికీ తన పదునైన వ్యాపారదృష్టి - అవగాహనా జ్ఞానంవల్ల, లాభాలు సంపాదించాలన్న ఉద్దేశంవల్లా నజ్రులుఅన్నా, సామ్రాజ్య వాదాన్ని

వ్యతిరేకిస్తూ ఆయన చేసే ధర్మపోరాటం అన్నా తనకు అంతకు ముందున్న పక్షపాత ధోరణిని నెమ్మది నెమ్మదిగా త్యజించింది.

నిజానికి ఇది ఇలా సంభవించింది - కంపెనీకి (హిజ్ మాస్టర్స్ వాయిస్) తెలీకుండా ప్రసిద్ధ గాయకుడు కీర్తిశేషులు హరీన్ ఘోష్, కంపెనీ ద్వారా తయారయిన ఓ రికార్డులో నజ్రులు పాటల్ని రెండింటిని చేర్చేశారు. ఈ రికార్డు వ్యాపార దృష్ట్యా ఎంతో విజయవంతమైంది. దాంతో సహజంగా హెచ్. ఎమ్. వి ఈ రకమైన వాటికోసం అన్వేషించటం మొదలుపెట్టింది. అతి త్వరలో ముందుగా కంపెనీ గాయకుల పాటలూ, తర్వాత నజ్రులు స్వయంగా పాడినపాటలూ కొన్ని కొత్తరికార్డులు తయారయాయి. నజ్రులుకి తన పుస్తకాలవల్లా, మిగిలిన ప్రచురణల వల్లా దొరికిన డబ్బుకన్నా ఈ రికార్డులవల్ల లభించే రాయల్టీఎక్కువగా ఉండేది. నజ్రులన్నా, నజ్రులు రికార్డులన్నా జనం ఎక్కువగా మక్కువ పడ్డం చూసి కంపెనీ ఆయనని మరీ అధికంగా ఉపయోగించుకోవడం మొదలుపెట్టింది. కంపెనీవారు నజ్రులుని తగిన గౌరవ మర్యాదలతో భక్తిశ్రద్ధలతో చూడ్డం ప్రారంభించారు. నజ్రులుకి కూడా ఈ అనుబంధం అప్రియంగా అనిపించలేదు. సంగీతం ఆయన మొదటి ప్రియతమమైన విషయం. డబ్బు ఆయనకి ఎప్పుడూ అందీ అందని అందమే : అది అంత ప్రియతమమైనది కానప్పటికీ అది కోరుకో దగ్గదే. దాని అవసరం ఉండనే ఉంది. కంపెనీవారు కంపెనీలో పనిచేస్తున్న సంగీత విద్వాంసుడు ఉస్తాద్ జియావుద్దీనుఖాను గారి దగ్గర నైపుణ్యవిషయంలో ఎక్కువగా సలహాలను తీసుకోమని నజ్రుల్ని కోరేవారు. నజ్రులుకూడా ఈ అవకాశాన్ని బాగా వినియోగించు కోవడానికి ఎంతగానో ఉత్సాహ పడ్డారు. ఆయన ఉస్తాద్ దగ్గర శాస్త్రీయ సంగీతంలోని మెలకువలను సంపూర్ణంగా నేర్చుకున్నారు. వారిద్దరి సంబంధం గాఢతరమై స్నేహంగా మారుతూ, నజ్రులు తన గీతాల సంకలనం 'వనగీతి' [1932]ని ఉస్తాద్ జియావుద్దీను ఖాన్‌గారికి అంకితమిచ్చేటంత గాఢమైన మైత్రి పెంపొందింది. ఆయన దగ్గర నజ్రులు ఎంత ఎక్కువగా సాధనచేసి నేర్చుకున్నారంటే—కొంత కాలం తర్వాత, ఉస్తాద్ జియావుద్దీనుఖాన్ మరణించాక హెచ్. ఎమ్. వి ఆయన స్థానంలో నజ్రుల్ని కంపెనీలో గురువుగానూ, ప్రముఖ సంగీతజ్ఞుడిగానూ నియమించింది. తదితర గ్రామఫోను కంపెనీలవారు, రేడియోవారు, ఫిల్ము నిర్మాతలు కూడా నజ్రులు ప్రతిభను గుర్తించి తరచుగా ఆయనను ఉపయోగించుకోవడం మొదలుపెట్టారు.

నజ్రులు తనకి లభిస్తున్న డబ్బూ, హోదా రెండింటినీ అనుభవించటం మొదలుపెట్టారు. ఆ రోజుల్లో ఆయన అదృష్టం, కార్యకలాపాలు రెండూ సవ్యంగా సుఖంగా నడుస్తున్నట్టుగా అనిపించింది. అతి త్వరలోనే నజ్రులు ఓ సరికొత్త క్రిసలర్ కారుని కొన్నారు. ఇంతగొప్ప భోగం పొందడానికి ఆ రోజుల్లో ఏ కళాకారుడికీ అంత జరుగుబాటు ఉండేదికాదు. నజ్రులు మిత్రులు కారులో కారుస్వంతదారుతో కలిసి షైరుకి వెళ్ళి చాలా సంతోషిస్తూ ఉండేవారు. నజ్రులు స్వయంగా తన సంతోషాన్ని మిత్రులతో పంచుకుని మరీ ఆనందించేవారు. సామాన్య ప్రమాణాలనుబట్టి పేదరికం అనుభవిస్తునప్పుడు కూడా నజ్రులు పొంగిపొరలే ఉత్సాహానికీ, శక్తిసామర్థ్యాలకీ, గొప్ప మనసుకి ఔదార్యానికి పెట్టింది పేరు. అలాంటప్పుడు ఇప్పుడు విందులు ఇవ్వడానికి, సరదాలకి జల్సాలకి షికార్లకి డబ్బు ఖర్చుచేద్దామని ఆయన ఉబలాట పడ్డం సహజమే. తన చేతిలోని ప్రతి పైసా ఖర్చు అయిపోయేటంత వరకూ ఆయన వాటికోసం ఖర్చు చేస్తూనేవచ్చారు. తనకి ఎప్పుడు అవసరంవస్తే అప్పుడు, తన అవసరాలకి తాను సంపాదించుకోగలనన్న ఆత్మ విశ్వాసం నజ్రులుకి ఉండేది.

అయితే కొద్దికాలమే అదృష్టం కలిసివచ్చింది. మొదట పిడుగుపాటులా అతి విచారకరమైన ఆఘాతం తగిలింది. ఆయన పెద్దకొడుకు బుల్‌బుల్ మశూచి వచ్చి చనిపోయాడు. (7/8 మార్చి 1934). ఈ పిల్లవాడంటే ఇంట్లో అందరికీ ముద్దే. మూడున్నర సంవత్సరాలవాడు. అసాధారణమైన తెలివితేటలు ప్రతిభా ఉన్నవాడు. ఈ సంఘటన నజ్రులు జీవితంలో మార్పుని సూచిస్తూ ఓ విభాజక రేఖని గీసింది. ఆయన ఈ ఆఘాతాన్ని ఎప్పటికీ తట్టుకోలేకపోయారు. ఈ సంఘటన ప్రభావం ఆయన జీవితం మీదా, రచనలమీదా ఎలా ఉన్నదీ తర్వాత చర్చిద్దాం. ఆయన సృజనాత్మక సామర్థ్యం తన వైశిష్ట్యాన్ని కోల్పోలేదు. అయితే భిన్నమైన మార్గాల్ని వేరేవాటిని, కష్టతరమైన వాటిని, అన్వేషణలని స్వీకరించింది. జీవితం, మృత్యువు, మృత్యువు తర్వాతి జీవితం అన్న ప్రశ్నలతో, మతం అతీంద్రియతతో ఆయన వేరే జగత్తులోకి వెళ్ళిపోయారు. 1942లో ఆయనకి మానసికమైన ఉన్మాదం వచ్చేటంతవరకూ సంగీతం మాత్రం ఆయనని వదలలేదు. ఆయనని పట్టుకునే ఉంది.

సంగీతంలో నజ్రులుకి ఉన్న ప్రతిభా, దాని సహజత్వం, పుష్కలత్వం

హెచ్.ఎమ్. వి కి కొంతవరకూ లాభదాయకంగానే ఉన్నాయి. అయితే ఓదృష్టితో చూస్తే ఆ పరిస్థితుల్లో ఈ ప్రతిభా వైశిష్ట్యాలు వాటి వినాశానికే కారణంగా పరిణమించక తప్పలేదు. ఓ వంక బుల్‌బుల్ మరణం వల్ల తగిలిన ఆఘాతం, రెండో వంక కంపెనీవారు నిరంతరం పెట్టే వొత్తిడి- వీటివల్ల అప్పుడప్పుడు సామాన్య స్థాయికి చెందిన రచనలు కూడా రూపొందాయి. అదీకాక నిరంతరం వరదలా వెలువడే ఈ రచనల పట్ల నజ్రులు పూర్తి శ్రద్ధా ఆసక్తి చూపెట్టలేదు. అటు కంపెనీ వారూ చూపెట్టలేదు. మార్కెట్టులోకి వదిలిన పాటలను భద్రపరచనూ లేదు. వాటి సూచిక ఏదీ తయారు చెయ్యనూలేదు. ఈ కారణంగా నజ్రులు రాసి, వరసలు కట్టిన పాటలు 3,500- మొత్తంలోంచి అధికాధికం 2000 పాటలని వెతికి తీయటం ఎంతో కష్టతరమైన కార్యం అయింది. మొత్తం పాటల్లోనుంచి ఓ భాగం మాత్రమే బుల్‌బుల్ (1928) చోఖేర్ చాతక (1929) నజ్రులుగీతిక (1930) సుర్–సాకీ (1931) జుల్ఫికార్ (1932) వనగీతి (1932) గుల్‌బగీచా (1933) గీతి–శతదళ్ (1934) సుర్—మహల్ (1934) గానేర్‌మాల (1934) మొదలైన అచ్చయిన పాటల సంకలనాల్లో లభ్యం అవుతోంది. జనప్రియమైన జాతీయగీతాల్ని వదిలేస్తే, మిగిలిన జాతీయగీతాలవేపు ఎవరూ శ్రద్ధ పెట్టలేదు. ఆ గీతాల్ని తొందర్లోనే అందరూ మర్చిపోయారు. నజ్రులు గీతాల సంపూర్ణ సంకలనం కోసం ఇప్పటివరకూ అస్తవ్యస్తమైన ప్రయత్నాలే జరిగాయి. కాని కాలం గడిచిపోయిన కొలదీ ఈ పాటలను అన్వేషించటం మరింత కష్టతరమై పోతూఉంది. కొద్ది సంవత్సరాలక్రితం అజహరుద్దీనుఖానుగారు ఎంతో శ్రమపడ్డా మెచ్చుకోదగిన పనిగా దగ్గర దగ్గర 1600 నుంచి 1700 పాటల సూచికని- ప్రతి పాట మొదటి పంక్తిని ఇస్తూ తయారుచేశారు. కాని ఆ తర్వాత ఈ సూచికని మరింత పరిపూర్ణంగా చెయ్యడానికి ఎవరూ కృషిచెయ్యలేదు.

3,500 పాటలు కేవలం సంఖ్యదృష్ట్యానే కాదు, వాటి వైవిధ్యం దృష్ట్యా కూడా అచ్చెరువు కలిగిస్తాయి. ఆయన ఎన్నుకునే విషయవస్తువుల వైవిధ్యం చూసినా అసంఖ్యాకంగా కట్టిన వరసలను చూసినా అలాగే ఆశ్చర్యం అనిపిస్తుంది. విషయవస్తువు దృష్ట్యా ఆయన పాటల్ని ఈ కింది విధంగా విభజించవచ్చు.

1. స్వదేశీ పాటలు : ఈ పాటలు అన్నీ సర్వసామాన్యమైన విషయాల గురించినవి. స్వాతంత్ర్యం,- స్వాతంత్ర్య పోరాటపు జాతీయగీతాలే కాక వీటిలో రైతుపాటలు (కృషికేర్ గాన్), కూలీలపాటలు (శ్రమికేర్ గాన్)లాంటి

రాజకీయపరమైన విషయాలకి సాంఘికపరమైన విషయాలకి సంబంధించిన గీతాల్ని కూడా కలపాలి.

2. ప్రేమపాటలు : [ప్రేమగీతి] ప్రేమపాటల్లో గజలుకి ప్రత్యేకించి, వేరే తరగతిని కేటాయించాలి.

3. ప్రకృతిపాటలు : సాధారణ పద్ధతిలోని ప్రకృతిపాటలు.

4. ఆధ్యాత్మికపాటలు : వీటిని కూడా వేరు వేరు భాగాలుగా విభజించవచ్చు. ముఖ్యంగా సర్వజనులని ఆకట్టుకునే పాటలు, శాక్తుల లేదా వైష్ణవులపాటలు, ఇస్లామీపాటలు, లేదా సూఫీ వేదాంతం మొదలైన వాటితో నిండిఉన్న మార్మికగేయాలు- మిస్టిక్‌పాటలు.

5. కౌతుక్‌పాటలు : [సరదాపాటలు - మజాపాటలు] తేలికైనవి వ్యంగ్యప్రధానమైన పాటలు, సాంఘికపరమైన వ్యంగ్యాన్ని, రాజకీయపరమైన వ్యంగ్యాన్ని సృష్టించినవి. సామాన్యమైన హాస్యాన్ని వెటకారాన్ని కలిగించేవి.

6. వివిధరకాలైన పాటలు : కలగూరగంప పాటలు- తేలిగ్గా ఏ విభజనలోకి రానివి. ఏ తరగతికీ చెందనివి.

నజ్రులు పాటల్ని లేదా బెంగాలీగాన్‌ని విని ఆనందించటానికి, సౌందర్య శాస్త్ర పాండిత్యంగాని, సంగీతశాస్త్ర సిద్ధాంతాల జ్ఞానంగాని, కళామర్మాల ఎరుక, నైపుణ్యం గాని అవసరంలేదు. అనుభవజ్ఞులైన నిపుణులు, విమర్శకులు తమ పద్ధతిలో ఈ పనిని చేస్తారు. అందులో ఏం సందేహం లేదు. అయితే బెంగాలులోని సామాన్య ప్రజానీకం దగ్గర, లేదా భారతదేశంలోని సామాన్య ప్రజానీకం దగ్గర వారి కొలబద్ద వారికి ఉంది. విలువల గ్రహింపూ ఉంది. ఆ కొలబద్దా, గ్రహింపు శక్తీ చెప్పుకోదగ్గవే. వారికి నజ్రులు పాటలంటే ఇష్టం. ఆ పాటల్ని సహజమైన అభిరుచితో ప్రశంసించటం, విలువని అంచనాకట్టి వాటి ప్రత్యేకతను గుర్తించటం వారికితెలుసు. ఉదాహరణకి బెంగాలీలోశాస్త్రీయబాణీలోనూ, జనప్రియమైనబాణీలోనూ రెండువరసలతోనూ ఎంతో ఉత్కృష్టమైనజాతీయగీతాలుఉన్నాయి. ఈమధ్యకాలంలో విశేషించి రవీంద్రనాథ్ ఠాగూరు, ద్విజేంద్ర లాల్‌రాయి తమ రచనలద్వారా వీటిని వృద్ధిపరిచారు. ఈ రంగానికి నజ్రులు ప్రసాదించిన నిరుపమానమైన కానుక- ప్రయాణ గీతాలు. సుభాష్‌చంద్రబోసు ఓసారి అన్నట్టుగా

ఈ పాటలు మన జాతీయసైన్యాన్ని కదం తొక్కిస్తూ సరిహద్దులకి నడిపిస్తాయి. "దుర్గమగిరి కాంతార్‌మరు", లేదా "కారార్ ఒయి లోహకపాట్ భెంగె ఫెలె" కారార్‌లోసాట్ లేదా "ఎయి శికాల పౌరా ఛల్ ఆమాదేర్" "ఆమారా ఛాత్రదల్" "ఊర్ధ్వగగనే బాజే మాదల్" మొదలుగా గల జాతీయ గీతాల్లోంచి ఏ ఒక్క గీతాన్నైనా గుర్తుచేసుకున్నామంటే దాని అర్థం 1920-1947 మధ్య కాలంలో ముందడుగు వేస్తున్న యావత్తు భారతదేశాన్ని గుర్తుచేసుకోవడమన్నమాట. ఈ పాటలనురాసి, వాటికి వరసలుకట్టడం తప్ప ఇంక ఏదీ రచించకపోయినా, మన జాతీయ గేయకారుల్లో జనప్రియ గేయకారుడిగా, అధికాధికంగా ప్రేరణ ప్రసాదించిన గేయకారుడిగా నజ్రులు నిలిచే ఉంటారు. ఇవే కాకుండా ఆయన రచించిన విశిష్టమైన గీతాలు ఇతరమైనవీ ఉన్నాయి. వ్యంగ్యభరిత గీతాలు, ప్రచండమైన ప్రభావాన్ని ప్రసరింపచేసే గీతాలు ఉన్నాయి. వాటిలోనూ జాతీయ వైశిష్ట్యం అంతగానూ కనిపిస్తుంది. అందులో సందేహం ఏంలేదు. ఉదాహరణకి "డొమినియన్ స్థితి," "సంధి," "దే గోరూర్‌గా ధుయియె" మొదలైన గీతాలని పేర్కొనవచ్చు, ఇలాంటి గీతాలతో అచ్చయిన పుస్తకాలు తరుచుగా నిషేధింపబడుతూ ఉండేవి. కాని ఆనోటా ఆనోటా ఆ పాటలు యావత్తు బెంగాలులోనూ పాకిపోతూ ఉండేవి.

ఈ పాటలు బైటికి వచ్చినప్పటికీ, 1920 - 30 మధ్య కాలంలో నజ్రులు 'గజల్లు' బెంగాలీలను సమ్మోహన పరిచాయి. అవి సరికొత్తవి. అద్వితీయమైనవి. రచయిత సృజనాత్మక శక్తినేకాక, అవసరానికి అనుగుణంగా చక్కగా మలచడానికి బెంగాలీభాషలో ఎంత సావకాశం ఉందో కూడా ఇవి తెలియచేశాయి.

ఈ పాటల్లోని కవిత్వం, సౌందర్యం, సమ్మోహనశక్తి (ఉదాహరణకి- ఆమారే చోఖ్ యిశారాయే డాక్ దియే ఆయే కోన్ సే దరదీ, ఎతో జల్ ఓ కాజల్ - చోఖే, బాగీ చాయే బుల్‌బులీ తుయీా ఫూల్ - శాఖాతే, కరుణకేనో అరుణ ఆంఖీ, కేవు భోలే న కేవు భోలే మొదలైనవి) తిరుగులేనివి.

'జుల్ఫికార్' 1932) మతాభిమానాన్ని, ఆధ్యాత్మికతని ఓ కొత్త రూపంలో చూపించింది. ఈ సంకలనంలోని పాటల్లో ఇస్లాం ప్రేరణ కనపడుతుంది. వీటి ఆకర్షణ తీవ్రమైనది. లోతైనది. ఈ పాటలు శక్తి ప్రధానమైనవి. స్పష్టతా, గంభీరతా ఉన్న పాటలు. ఈ ఆధ్యాత్మికత మతపరమైన మనోస్థితి విభిన్నమైన

మార్గాల్ని, హిందూ ముస్లిం రెండింటినీ స్వీకరించింది. 1930 ల్లో నజ్రులు ప్రసాదించిన ప్రముఖమైన కానుక- భక్తి ప్రధానమైన పాటలు, మార్మిక గీతాలు (మిస్టిక్ పాటలు) వీటిలో నాదం, శ్రుతి, స్వరం, మేళవింపుల్లో అద్భుతమైన వైవిధ్యం గోచరిస్తుంది. జీవితం అన్నా, స్వేచ్ఛ అన్నా, ఆనందపు కలకల మన్నా ఆయనకి ఉన్న గాఢమైన ఆసక్తి ఆయనలో ఇంకా ఉబుకుతూనే ఉంది. ఈ పొంగు ఆయన వైభవం తగ్గిపోయేటంతవరకూ అలాగే నిలిచిఉంది. పాటల సంకలనం 'చంద్రబిందు' చాలాకాలం వరకూ నిషేధించ బడ్డది. అనాటి బ్రిటిషు అధికారులకి ఆయన రాసిన వ్యంగ్య ప్రధానమైన వినోదాత్మకమైన పాటలు మింగుడు పడేవికావు.

సౌందర్యాస్వాదనకి, ఆనందానుభూతికి సాంకేతిక శైలీ వైశిష్ట్యాలు ఎంతో అవసరం అని పరిగణిస్తే, నజ్రులు పాటలని విజ్ఞతతో విలువకట్టే పనిని నిపుణులకి, సంగీత విమర్శకులకి, సంగీతజ్ఞులకి వదిలిపెట్టేయాలి. అయితే సామాన్యజనం, సంగీతం అంటే ఎంతగానో చెవి కోసుకునేవారుకూడా ఈ పాటల వైశిష్ట్యాన్ని ఎంతగానో ఆనందించారు. నిజానికి ఇదే ఆమోద యోగ్యమైన పరీక్ష. రాసిన మాటలు ఓ పాట విశిష్టతని చెప్పలేవు. దానికోసం ఎవరో నైపుణ్యం ఉన్న కళాసర్మం తెలిసిన కళాకారుడు పాడి వినిపించవలసిన అవసరం ఉంటుంది. పాఠకులు మంచి కళాకారులు పాడగా నజ్రులు పాటల రికార్డులు విన్నట్లయితే వారు తమ శ్రమ వ్యర్థమైపోయిందని అనుకోరని వారికి హామీ ఇవ్వవచ్చు. అలాంటి రికార్డులు ఇప్పటికీ లభ్యమవుతూనే ఉన్నాయి. టెక్నిక్ దృష్ట్యా కూడా నజ్రులు ప్రతిభ అద్వితీయమైనదని విలువ కట్టబడ్డాదన్న విష యాన్ని చెప్పితీరాలి. తన మాటలకి వరసలు కూర్చేటప్పుడు ఆయనకి ఉన్న సహజగ్రాహ్యత అంతర్గతంగా ఉన్న సౌందర్య గ్రాహ్యత నజ్రులుకి తిరుగులేని వెలుగు బాటలు. ఏ సంప్రదాయ బద్ధమైన పద్ధతిలోనో నిర్ణయించబడిన నియ మాలను నజ్రులు ఎప్పుడూ పాటించే వారు కాదు. ఏదో ఓ శాస్త్రీయ రాగాన్ని ఓ జానపద బాణీని చక్కగా మేళవించి తరుచుగా ఏదో ఓ పాటని ఆకర్షవంతంగా కట్టడమే కాకుండా దానిలో ఆయన తన సొంత ముద్రని కూడా జోడించేవారు. ఇలాంటి ఉదాహరణలని ఏరి కూర్చాలని ఎవరికైనా ఆసక్తి ఉంటే కోకొల్లలు దొరుకుతాయి. శైలిలో విశుద్ధతని కాంక్షించేవారు ఇలాంటి ప్రయోగాల్ని నిస్సం దేహంగా ఖండించారు. అయితే నజ్రులు తిరుగుబాటు కవి. సంగీతరంగంలోనూ

ఆయన లోని తిరుగుబాటుతత్వంఅంతే. ఆవేశంతో పెల్లుబికి పైకి వచ్చింది. ఇప్పుడు ఈ తిరుగుబాటు కవి అందరి ఆమోదం పొందిన ఓ సృజనాత్మక కళా కారుడు.

అంతేకాదు. నజ్రులు సామాన్య జనం నుంచి వచ్చినవారు. అంచేత జాన పద సంగీతమన్నా, తదితర జానపద కళలన్నా ఆయనకి విశేషమైన అభి మానం ఉండడం సహజం. బెంగాలీ సంగీతంలో 'కీర్తన' ఓ విశిష్టమైన రూపం. (దీంట్లో రెండు సంప్రదాయాలు-ఒకటి సామాన్యమైనది, రెండవది విశిష్టమైనది) 'భాటియాలీ' (నదిపాట) - పడవ వాళ్ళపాటకి తూర్పు బెంగాలు పుట్టుక స్థలం. తూర్పు బెంగాలు సంగీతంలోని మరో రెండు రూపాలు 'జారీ', 'సారి', మిస్టిక్ బావుల్ పాటలు, ఉత్తర బెంగాలు ప్రేమ పాటలు "భావాయియ్యా", సూఫీ శైలికి చెందిన "ముర్శిదా," హిందువుల భక్తిగేయాలు. రామప్రసాదీ, పశ్చిమ బెంగాలు జానపద సంగీతరూపం 'ఝూముర్'-ఇవీ-తదితర జానపద రూపాలూ నజ్రుల్ని ఆకట్టుకున్నాయి. ఉదాహరణకి కొన్నిటిని ఉటంకించవచ్చు-'అమీకీ సుఖేజో గృహే రాబో . . ." లాంటి కీర్తనలు, "ఆమీఖ్యాపాబావుల్, ఆమార్ దేవుల్ ఆమారి ఎయి ఆపన్ దేహ" "లాంటి బావులులు, "ఓరే మాఝీ, భాయీ, తుయికీ దుఖ్ఖ పెయెకుల్ హారాలీ అకుల్ దునియాయే" లాంటి భాటియాలీలు మొద లైనవి.

నిజానికి నజ్రులు స్వంతంగా కొన్ని కొత్త బాణీలు తయారు చేశారు. వాటికి ఆయన కవితాత్మకమైన పేర్లు కూడా పెట్టారు : నిర్ఝరణి, సంధ్యా మాలతి, వనకుంతల, దోలన్‌చంప మొదలైనవి.

నజ్రులు పాటల వివరాలు ఏమీ ఉంచలేదు—వాటిని భద్రపరచటానికి ఏ రకమైన ప్రయత్నమూ చెయ్యలేదు. అంచేత ఆయన పాటల పుస్తకం సంపూర్ణంగా ఉన్నది అందుబాటులో లేకుండా పోతోంది. అయినప్పటికీ దొరికిన వాటిలో కిందరాసిన సంగతులను సులభంగా గ్రహించవచ్చు.

1. ఓజో గుణంతో నిండిఉన్నా వీర రసప్రధానమైన పాటలు-విశేషించి ప్రయాణ గీతాలు. ఈ రంగంలో నజ్రులుకి సాటి అయిన వారు ఎవరూ లేరు.
2. ఆయన ఓ గొప్ప నూతన యుగకర్త. "బెంగాలీగాన్"కి గజలుని ప్రసాదించి దానిని వృద్ధిపరిచారు.

3. మతపరమైన భక్తి ప్రధానమైన సంగీత రంగంలో నజ్రులు తన అద్వితీయతను చూపారు. మరోలా చెప్పాలంటే శ్యామ సంగీతం, ఇస్లాం భక్తి సంగీతం-ఈ రెండింటి ఆధ్యాత్మిక మేళవింపు ద్వారా ఆయన భారతీయ ప్రతిభకి ప్రాతినిధ్యం వహించారు.

4. రవీంద్రనాథ్ టాగూరు, అతుల్ ప్రసాద్ సేన్, రజనీకాంత సేన్-కొన్ని పేర్లని మాత్రమే ఉటంకిస్తే, నజ్రులు 'బెంగాలీ పాటల' రంగంలో ప్రముఖుడైన సృజనాత్మక కళాకారుడు. రాబోయే తరాలకి ఆయన గొప్ప సంపత్తిని వదిలివెళ్లారు.

నజ్రులు పాటలంటే విస్తృతంగా జన సామాన్యంలో ఇష్టతని కలిగించటానికి పని చేసిన ప్రముఖ కళాకారుల్లో కుమార్ సచిన్‌దేవ్ బర్మన్, దిలీప్ కుమార్ రాయ్, అబ్బాసుద్దీను, కమల్‌దాస్ గుప్త, ధీరేంద్ర చంద్ర మిత్ర, సంతోష్ సేన్‌గుప్త, సుప్రభ సర్కారు, ఫిరోజ్ బేగమ్ మొదలైన వారి పేర్లు ప్రత్యేకించి చెప్పుకోవాలి.

కవి నజ్రులు కన్నా సంగీత రచయిత నజ్రులు ఎక్కువ గొప్పవాడు అన్న అభిప్రాయంలో కొంత వాస్తవం ఉండవచ్చు. కవిత్వంలో ఆయన ధారా ప్రవాహం ఆయనకి చాలాసార్లు సహకరించలేదు. కాని పాటల్లో మాత్రం నజ్రులు తనదీ అయిన సహజ గుణంతో, సర్వోత్కృష్టమైన రూపంలో విలసిల్లారు.

# 6. విరిగిన రెక్కలమీద

1929లో, సంగీత లోకపు వ్యాపార క్షేత్రంలో పై మెట్టుకి చెందిన సృజనాత్మక కళాకారుడిగా స్థానం సంపాదించుకున్న తర్వాత నజ్రులు జీవితం నిత్యావసరాలకి లోటు లేకుండా ఆర్థిక దృష్ట్యా పూర్వంకన్నా స్థోమత ఉన్న జీవితంగా మారుతూ ఉంది. అప్పటికే ఇద్దరు పుత్రులు కలిగారు. మూడో సంతానం కలగబోతోంది. ఇల్లు ఎలా నడపాలి అన్న బాధ నజ్రులుకి కాని, ఆయన భార్యకి కాని ఏం లేదు. ఆయన అత్తగారు గిరి బాలాదేవి శ్రద్ధగా అతి చాకచక్యంతో ఇంటి వ్యవహారాలను చూసేది. ఇదివరకే మనం తెలుసుకున్నట్టుగా నజ్రులు ఉద్యోగంలో ఇంకా వృద్ధిలోకి రావలసిఉంది. ఇతర గ్రామఫోను కంపెనీలు, సోనీలా, మేగాఫోను లాంటివి హెచ్.ఎమ్.వి. లాగ నజ్రులు సేవలు పొందటానికి ఉత్సాహపడ్డాయి. రేడియో కార్పొరేషను కూడా ఆయన సేవలను, సంగీతాన్ని కొనుగోలు చెయ్యడానికి ఆసక్తి చూపెడుతోంది. కలకత్తా బొంబాయిల్లోని ఫిల్ము జగత్తుకూడా అప్పుడప్పుడు ఆయనని వినియోగించు కుంటోంది. (ఉదాహరణకి ఫజలీ బ్రదర్సు తమ ఫిల్ము చౌరంగీ కోసం నజ్రులు పాటల్ని తీసుకున్నారు. ఆ పాటల పారితోషికం నజ్రులుకి పూర్తిగా లభించ లేదన్నది వేరే సంగతి) నజ్రులు నాటకాలూ రాశారు. ఆ నాటకాలకోసం స్వంత పాటలూ రచించారు. 1931 లో తన నాటకం ఓ దాంట్లో ఆయన స్వయంగా నటించారని కూడా చెపుతారు. ఫిల్ము "ధృవ"లో కూడా ఆయన నటించారని వినికిడి. బహుశా నాటకరంగం ఆయన కార్యరంగం కాదు. అందులోనూ దుఃఖ సమాచారాలతో, మానసిక క్లేశాలతో ఆయనకి సహజ సిద్ధమైన, ఆనందోత్సా హాలు విశేషించి నీళ్ల కారిపోతున్న ఆ సమయంలో అది ఆయన కార్యరంగం ఎలా అవుతుంది?

1930లో తన మొదటి కొడుకు బుల్‌బుల్‌ని (కృష్ణనగర్‌లో 1926లో జన్మించాడు) కోల్పోవడం ఆయనకి తగిలిన మొదటి ఆఘాతం. 1928లో తన మొదటి గేయ సంకలనానికి నజ్రులు తన కొడుకు బుల్‌బుల్ పేరునే పెట్టుకున్నారు. "బుల్‌బుల్" నజ్రులుకి అతి ఇష్టమైన పదం. కొడుకు పేరు

కూడా అదే కావడంతో ఆ అభిమానం మరింత ఎక్కువైంది. బుల్ బుల్ ప్రతిభ కలవాడని పిల్లవాడి లక్షణాలు చెప్పక చెపుతున్నాయి. వాడంటే అందరికీ ముద్దే. ఇప్పటికీ అన్ని దశాబ్దాల తర్వాత ముజఫరు లాంటి మిత్రులు కంట నీరు తిప్పుకుని బుల్ బుల్ ని జ్ఞాపకం చేసుకుంటారు. బుల్ బుల్ మశూచితో కొన్నాళ్ల బాధపడి చనిపోయాడు. పిల్లవాడు జబ్బుగా ఉన్న రోజుల్లో నజ్రులు కొడుకు దగ్గరే కూర్చుని ఉండేవారు. పిల్లవాడి చెయ్యిని వదిలేవారు కాదు. బుల్ బుల్ మరణంతో కుటుంబం యావత్తూ ఘోర దుఃఖంలో మునిగిపోయింది. తర్వాత జరిగిన సంఘటనలను బట్టి మిగతా అందరికన్నా కొడుకుని కోల్పోయిన ప్రభావం కవి అయిన తండ్రి మీద ఎక్కువగా పడింది. లెక్కలేనంత మమకారం, అతి సున్నితమూ, తీవ్రమూ అయిన అనుభూతులు ఉన్న వాడవడం వల్ల నజ్రులుకి ఈ దుఃఖాన్ని సహించడం అందరికన్నా కష్టమైంది. నిజానికి ఆ దుఃఖం ఆయనని ఎప్పటికీ వదలలేదు. నజ్రులు మనస్తత్వ శాస్త్రజ్ఞులు చెప్పే 'బహిర్ముఖ వ్యక్తిత్వం' ఉన్నవాడు. ఆయనలో జీవశక్తి ఉద్వేగం పుష్కలం. ఆయనలోని ఉల్లాసం, ఎప్పుడూ తుళ్ళి పడుతూ ఉండే ఉత్సాహం, కలుపుగోలుతనం సర్వజనులనీ ఆకర్షించేది. ఈ ఉల్లాస పూరితమైన వ్యక్తిత్వం తనని తాను సంబాళించుకోలేకపోయింది. పైకి చూడ్డానికి ఆయన తన పనుల క్రమాన్ని ఏమీ మానలేదు. ఆ ఆఘాతం తగిలిన కొద్దిరోజుల తర్వాత ఆయన తనని తాను సంబాళించుకుని గేయ రచన చెయ్యటం మొదలుపెట్టారు. అప్పుడప్పుడు తన గేయాల పుస్తకం 'చంద్రబిందు' ప్రూఫుల్ని దిద్దే బాధాకరమైన పనిని కూడా చేశారు. ఆ రోజుల్లో 'చంద్రబిందు' అచ్చవుతూ ఉండేది. (కవి జసీముద్దీను ఈ సమయంలో నజ్రుల్ని ఓసారి ఈ విధంగా చూశారు.)

అయితే ఆయన వ్యక్తిత్వంలోనూ, రచనలోనూ ఓ సరికొత్త గాంభీర్యం, లోతు కనిపించసాగాయి. అందులో ఓ రకమైన విచారం తరుచుగా మిళితమై ఉండేది. తన యజమానుల కోరికలను అవసరాలను దృష్టిలో పెట్టుకుని నజ్రులు వివిధ విషయ వస్తువులను స్వీకరించి తన ప్రతిభని వినియోగిస్తూ ఉండేవారు. అయితే 'భక్తిగీతాలు' అనేవి మాత్రం ఇహ ఇప్పుడు కేవలం సాధన కోసమే కాదు. ఉదాహరణకి ఇప్పుడు ఆయన కూరుస్తున్న భజనల్ని (ఛలో మా అనంత ధామ్ లాంటివి) కీర్తనల్ని (ఆమికి సుఖేగో గృహేరబో మొదలైనవి) బావులుల్ని శ్యామ సంగీతాన్ని, ఇస్లాంకి సంబంధించిన పాటల్ని

చూడండి :: మత దృష్టిని విడిచిపెట్టి ఈ పాటల్ని పరీక్షించి చూస్తే వీటిలో ఓ ద్వంద్వం ఉన్నట్టుగా మనకి స్పష్టంగా బోధ పడుతుంది. ఇస్లాం దృక్పథం విగ్రహారాధనకి పూర్తిగా వ్యతిరేకం. దాని మూలం ఏకేశ్వరోపాసన, అలాంటిది నజ్రులు హిందూ గేయాల్లో ఆయన కాళీమాతంటే తన భక్తిని ప్రదర్శిస్తారు (లేదా ఆదిమప్రకృతి రూపం పట్ల భక్తిని ప్రకటిస్తారు. కృష్ణ ప్రేమలోని విభిన్న రూపాల మీద ప్రేమికుడుగానో, పుత్రుడుగానో, మిత్రుడుగానో పాటలు రాశారు.

ఏ ఒక్క మత విశ్వాసానికీ కట్టుబడకుండా ఉండడం నజ్రులుకి తేలికకైన విషయం. ఇతివృత్తం దృష్ట్యా ఆయన హిందూ గీతాల విధానం సామాన్యమైనదే అయినా, నజ్రులు రచనా జగత్తుపట్ల మనకి ఆసక్తి కలగడానికి కారణం ఆయనకి ఓ ముస్లింగా ఇస్లాం విధానం కూడా బాగా తెలుసు. ఇస్లాం పట్ల గట్టి నమ్మకం ఉండి, మత దురభిమానం లేని వారితో తాదాత్మ్యత చెందే అద్భుతమైన యోగ్యత ఆయనలో ఉంది. (మత దురభిమానంకల ముస్లిములు సంగీతాన్ని ఏ రకంగానూ వినియోగించరు) ఆయన గేయాల పుస్తకం జుల్ఫికార్ (1932)లో యావత్ ముస్లిముల ఆశాభావాన్ని గర్వాన్ని వ్యక్తీకరించే పాటలు అలాంటివి ఎన్నో ఉన్నాయి.

ఉదాహరణకి -

"దికె దికె పునః జ్వలియా ఉఠి చె
దీన్ ఇస్లామీ లాల్ మశాల్"

(అన్ని దిశలా ఇస్లాం మతపు ఎర్ర దివిటీ మళ్ళీ వెలుగుతోంది).

ఈ దివిటీ సంకుచితమైన మతతత్వానికి గాని, బృహత్తరమైన ఇస్లాంకి కాని చెందినది కాదు. ఇందులో కమాల్ పాషా జగలుల్ పాషా, రెజా షా పెహలవీ మొదలైన వారి ద్వారా ముందుకు వచ్చిన పునరుజ్జీవనపు ఇస్లాం గురించి చెప్పడం జరిగింది. ఇలాంటివి ఎన్నో మహత్తరమైన గేయాలు కవితలు. ఇస్లాం దృక్పథంతో ఎలాగా శ్రేష్ఠమైనదే - కాని వాటి ఆకర్షణ దృష్ట్యా, ఆధ్యాత్మికత దృష్ట్యా అవి సర్వులకీ చెందినవి.

బుల్‌బుల్ మరణం తర్వాత వచ్చిన కవిత్వ దశలో నజ్రులు కూర్చే గేయాల్లో కాళీమాతకు అప్పుడప్పుడు 'సహజియా'ల "దేహతత్వం", తదితర

మైన గూఢమైన విషయాలకు ప్రాధాన్యత వచ్చింది. తన జీవితంలో కూడా ఈ రోజుల్లో ఆయన గుహ్యవిద్య — నిగూఢమైన అతీంద్రియ విద్యలో నిమగ్న మై ఉన్నారు. - ఇది రహస్యవాదానికి (మిస్టిక్ వాదానికి) భిన్నమైనది- మహత్తరమైన రెండు మత విశ్వాసాలు - హిందూ మతంలోనూ, ముస్లింమతం లోనూ సాధారణంగా ఉండే విధి విధానాలకు చెందని మతారాధనా పద్ధతుల్లో, ఆచరణ విధానాల్లో ఆయన మునిగిపోయారు. అయితే తర్వాత ఈ దశలోనే తిరిగి ఇస్లాంవేపు మళ్ళడం కనిపిస్తుంది. పాపాన్ని అంగీకరించినట్టు, పశ్చాత్తాపాన్ని పొందినట్టూ కూడా గుర్తించవచ్చు. [దీని గురించి, నజ్రుల మత విరుద్ధంగా వెళ్లి పశ్చాత్తాపం చెందాడని సంకుచితమైన వ్యాఖ్య కూడా చెయ్యోచ్చు] రెండు భక్తి విధానాలు - హిందూశ్యామ సంగీత విధానం, ముస్లిం ఉపాసనా విధానం రెండూ చివర వరకూ చెట్టపట్టాలు వేసుకునే ఉన్నాయి. సంతోషంగా రెండింటిని స్వీకరించడంలోని ఆధ్యాత్మిక విలువ పునాది రీత్యా చూస్తే సమానమే. నజ్రుల తన జీవితంలోనూ, తన అంతరాంతరాల్లోనూ ఎంతగా కాళీ భక్తులో అంతగానూ ఇస్లాం అనుయాయులు కూడా. ఒకే ఇష్ట దైవతాన్ని ఉపాసించేవారు. ఆయనలో సత్యం అన్నది ఒకటే అన్న ఓ గంభీరమైన అవగాహన సదా ఉండేది. దైవం తనని చేరడానికి ఎన్నో మార్గాలను ఏర్పరచాడు. అందులోకి సగుణ రూపం [దీనిలో అన్ని లక్షణాలు ఆయననే [దైవాన్నే] ఆయన నొక్కడినే చెపుతాయి] నిర్గుణరూపం [అన్ని లక్షణాలకి "ఆయన" అతీతుడు], తదితర రూపాలు కూడా వస్తాయి.

భవిష్యత్తులో ఆరోగ్యం చెడిపోవచ్చు అని సూచించే లక్షణాలను ఆయన కృషిలో కొద్ది కొద్దిగా గుర్తించవచ్చు. అతి తొందరలో తన ప్రతిభని స్వాధీనంలో పెట్టుకోలేని స్థితికి ఆయన వచ్చేశారు. క్షీణించిపోవటం అధిక మవుతూ వచ్చింది. దాని ప్రభావం ఆయన శరీరం మీదా కనపడింది. ఆయన సృజనాత్మక సామర్ధ్యాల మీదా దాని ప్రభావం పడ్డది. 1936–42 మధ్య కాలంలో ఆయన చేసిన కృషికి సరియైన విలువ కట్టడానికి ఆ కాలంలో ఆయన గడిపిన దుఃఖపూరితమైన జీవితాన్ని దృష్టిలో ఉంచుకోవటం అవసరం.

బుల్ బుల్ మరణం తర్వాత నజ్రులలో స్ఫుటంగా కనిపించే నాస్తికత్వం పూర్తిగా పోయింది. ఈ నాస్తికత్వం అన్నది గట్టి నమ్మకంగా ఆయనలో ఎప్పుడూ లేదు. ఆయన గంభీర వ్యక్తీకరణల్లో భగవదాత్మ మీద అపనమ్మ

కాన్ని వ్యక్తీకరించడాన్ని ఎప్పుడూ చూడం. దగ్గర దగ్గర 1920 - 21ల నుంచి తెలిసీ తెలిసీ నిజాయితీతో ఏ రకమైన మత విశ్వాసాల్ని ఆయన సమ్మతించకపోవడాన్ని చూస్తాం. స్వభావ రీత్యా ఆయన అసమ్మతిని గట్టిగా తెలియ చేస్తూ ఉండేవారు. తాను నాస్తికుణ్ణని, సామ్యవాదినని ప్రకటించేటప్పుడు అవసరమైన దానికన్నా అధికంగా నొక్కి చెప్పేవారు. లోకంలో సర్వత్రా ఉన్న అన్యాయం దేవుడు జాతి ధర్మం కులం పేరుతో మనిషి మరో మనిషిని చేసే దోపిడీ—మతం మీద తిరుగుబాటు చేసేటట్టు చేశాయి. ఈ వివేకం ఆయనలో ఓ దృఢమైన విశ్వాసాన్ని కరిగించింది. ఏ దివ్యశక్తీ ప్రపంచాన్ని సృష్టించలేదు. మనిషి అదృష్టాన్ని అదేమీ నిర్దేశించి చెప్పదు. ప్రతి మనిషీ తన అదృష్టాన్ని తాను అన్వేషించుకోవాలి. లాంఛన ప్రాయమైన మతాలకి, మతాలనబడేవాటికి తెలిసిన దానికన్నా అవి చెప్పే దానికన్నా, నజ్రులు నాస్తికత్వం షెల్లీ దానిలా, ఓ లోతైన నమ్మకం మీద ఆధారపడిఉంది. అయితే మార్క్సువాదపు కొలబద్దలతో చూస్తే నజ్రులు నాస్తికత్వం కేవలం పైపైది మాత్రమే. ఈ సంగతి ఇతరులు ఎరిగినంతగానూ నజ్రులు స్వయంగా ఎరుగును.

భారతదేశంలోని ఏ సగటుపిల్లవాడైనా ఇంచుమించు ఉగ్గుపాలతోటే దైవత్వం మీదా, అలౌకిక శక్తిమీదా కొంతనమ్మకం కలిగిఉంటాడు. నజ్రులు ఈ సామాన్య నియమానికి మినహాయింపుకాదు. ఆయన ముస్లింమతంలోనూ మక్తబా [పాఠశాల లోనూ శిక్షణపొందారు తాంత్రికసంబంధమైన భావాలన్నా, ఆచరణ విధానాలన్నా నమ్మకాన్ని లేత వయస్సులోనే వొంటపట్టించుకున్నారు. ఆయనకి వీటి విషయంలో దురభిమానం మాత్రంలేదు. వ్యక్తులు విశ్వాసంలో పవిత్రులైన అనుయాయుల మార్గదర్శకత్వంలో, వారు ఏమతంవారైనా సరే, సాధనచేస్తే అద్భుత శక్తులను సంపాదించగలుగుతారు. అని నజ్రులు నమ్మేవారు. జీవితపు ప్రారంభ దినాల్లో సంపాదించిన ఈ వారసత్వం సంవత్సరాల తరబడి సంపాదించిన భావాలవల్ల అలవాట్లవల్ల అంతరాంతరాల్లో ఎక్కడో అణిగిపోయి ఉంటుంది కాని పూర్తిగా సమసిపోదు. చేతనావస్థలోనూ, అంతశ్చేతనావస్థలోనూ మానవ జీవితపు అనేక రూపాలని నిర్ధారిస్తూ ఉంటుంది. అని ఆధునిక మనస్తత్వ శాస్త్రం కూడా అంగీకరిస్తుంది. కాని వ్యక్తి తన జీవితంలో ముందుకూ వెళ్తున్నకొలదీ ఈ రకమైన భావాలూ, లక్షణాలు చాలావరకూ మారిపోతూఉంటాయి. ముఖ్యంగా

తర్కబుద్ధి, అనుభవం, శాస్త్రీయ విద్యల ప్రభావం నీటిమీద ప్రసరిస్తుంది అనే మాట కూడా వాస్తవమే. వయసువచ్చి మానసిక పరిపక్వత వచ్చాక నజ్రులు కూడా ఈ స్థితికి వచ్చి ఉంటారు. ఆయన వివేకం, అనుభవం, వాటికితోడు ఆయనలోని మానవతావాదం, స్వేచ్ఛాప్రియత్వం తనకున్న పాత మత విశ్వాసాలని, అభిప్రాయాలని సవాలు చేయమని ప్రేరేపించి ఉంటాయి. ఈ రకమైన చైతన్యం కలగడానికి సోవియట్ విప్లవంకూడా కొంత పనిచేసి ఉంటుంది. ఆత్మ పరిశీలనం చేసుకునే ప్రవృత్తి ఉన్నవాడికి, ఆస్తికత్వం నుంచి నాస్తికత్వానికి, తొలిరోజులనాటి ఆత్మతృప్తితో "అవును" అనుకునే దాని నుంచి చిరస్థాయిగా "కాదు" అనే అన్వేషణకి పరివర్తన చెందడం మిక్కిలి యాతనాదాయకం. కాని నజ్రులు బహిర్ముఖ వ్యక్తిత్వం ఉన్నవారవడంచేత ఆయన అటువంటి యాతన పడలేదు. అయితే ఆయనకి కూడా ఓ రకమైన ద్వైతాన్ని సమాధాన పరచ వలసివచ్చింది. ఆ కారణం చేతనే మతరంగంలో వ్యాపించి ఉన్న ఆస్తికత్వపు అవినీతిని ఆయన సందేహంతో చూడ్డం మొదలుపెట్టారు. ఆయన కావ్యాభివ్యక్తుల్లో తదితర భావాభివ్యక్తీకరణల్లో మరింత దృఢంగా అలౌకిక విధి విధానం వ్యక్తమయింది. (ఉదాహరణకి రాజబందీర జబాన్ బందీ మొదలైన వాటిలో). ఇదీ కాకుండా ఈ విధమైన ఉద్వేగపూరితమైన స్వభావం ఉన్న వ్యక్తికి కరకైన భౌతికవాదం, లేదా పరార్థదృష్టికల నిరీశ్వరవాదం, లేదా వస్తునిష్ఠయైన మానవతావాదం లేదా ప్రత్యక్షవాదం వరకూ అన్నిటితో సమాధాన పడటం కష్టతరమైన విషయం. 1921-30 మధ్య కాలంలో అదృష్టం నజ్రుల్ని బాగా దెబ్బతీస్తూనే ఉంది. పైకి చూడ్డానికి ఈ కాలంలో మతపరమైన ప్రాముఖ్యత ఉన్నా, సమస్యలేమీ నజ్రులుకి లేవు. అయితే అరవిందుడి సోదరుడు బారీంద్ర కుమార్ ఘోష్‌తో ఆర్య ముద్రణాలయం (నజ్రులు మొదటి ముద్రాపకులు) కార్యకర్తలతో ఆయనకి ఏర్పడిన ఆత్మీయత కేవలం ఆకస్మికంగానూ, రాజకీయ ఆదర్శవాదంవల్లనూ కలిగినదికాదు. ఈ మిత్రులు అరవిందుడి ద్వారా సమర్థించబడిన తాంత్రిక యోగ దర్శనాన్ని స్వీకరించి బాహాటంగా రహస్య విద్యలని, గుహ్య విద్యలని ప్రచారం చేస్తున్నారు. తాంత్రికవిద్యలు, కాళికా శక్తి, యోగులు, సిద్ధపురుషులు, ఫకీరులు-వారి అద్భుతశక్తులు-వీటన్నిటిమీద నజ్రులుకి ఉన్న పాత నమ్మకాల్ని ఆ మిత్రులు బహుశా చైతన్యపరిచి ప్రభావితం చేసిఉంటారు.

(6)

1930లో బుల్‌బుల్ మరణంతో జీవితం-మృత్యువు, ఆత్మ-మరణానంతర జీవితం, వంటి తికమక పెట్టే నిగూఢ మైన సమస్యలు నజ్రులుకు పట్టుకున్నాయి. చివరకి తాను - తన అహంభావం గురించిన ప్రశ్న కూడా ఆయనకి కలిగింది. తాంత్రిక సాధనా విధానాలు జీవించినవారికి మరణించినవారికి మధ్య-బుల్‌బుల్‌కి అతని తండ్రికి మధ్య-ఓ సేతువుని నిర్మిస్తాయి అనే తన పాత విశ్వాసాన్ని తీవ్రమైన వాంఛతో తిరిగి స్వీకరించారు. ఇటువంటి స్థితిలో అంతర్ముఖవ్యక్తిత్వం ఉన్నవారు ఎవరైనా రహస్యాన్వేషణలో, సంపూర్ణమైన ఆధ్యాత్మిక చింతనలో మునిగిపోతారు. మధ్యయుగానికి చెందిన సాధువులు, సూఫీలు-కబీరు, దాదూ మొదలైన వారు చెప్పిన మార్గాల్ని, సలహాలని అనుసరిస్తారు. కాని నజ్రులు లాంటి బహిర్ముఖ వ్యక్తిత్వంఉన్న ఓవ్యక్తి తీవ్రమైన ఉద్వేగాలు ఉన్నవాడు, తాంత్రిక విద్యలంటే నమ్మకం ఉన్నవ్యక్తి అద్భుతాలన్నా మరణానంతర జీవితపు ప్రత్యక్ష ప్రమాణాలన్నా, హఠయోగం తాంత్రిక విద్యల సాధనా విధానాల కఠిన మైన మార్గాలన్నా సంతృప్తిపడతాడు. నజ్రులు ఏ ఆధ్యాత్మిక అన్వేషణవల్లా ప్రేరేపించబడి హఠయోగపు మార్గానికి మళ్లలేదు. అలాంటి తాంత్రిక సిద్ధ పురుషులూ ఫకీర్లూ మరణించిన వారితో సంపర్గం ఏర్పరచడానికి సహాయ పడతారా అనేది తెలుసుకోవాలని ఆయనకి గట్టి కుతూహలం కలిగింది. ఈ విధంగా బుల్‌బుల్‌తో ఆధ్యాత్మికస్థాయిలోనూ, శారీరక స్థాయిలోనూ సంభాషించాలన్న తీవ్రమైన వాంఛా, ఉన్మాదాన్ని కలిగించే దారుణదుఃఖంవల్ల నజ్రులు సహజం గానే తర్కరాహిత్యానికి, అవివేకానికి లొంగిపోతూ వచ్చారు. బారీంద్రకుమార్ ఘోష్ (లేక నజ్రులు మిత్రుడు కళాకారుడు-నళినీ కాంత సర్కారా)? ఆరోజుల్లో లాల్‌గోలా హైస్కూల్లో హెడ్‌మాస్టరుగా పనిచేసిన కీర్తిశేషులు వరదాచరణ్ మజుందార్ శ్రీ అరవిందుల్లాగానే ఆధ్యాత్మిక శక్తులూ, యోగ్యతా సాధించారని, నజ్రులు శ్రీ మజుందార్ సహాయంతో, ఆయన మార్గదర్శకత్వంలో యోగ సాధనల్లో శిక్షణపొంది బుల్‌బుల్‌ని తన ఎదటనే చూడగలుగుతారని చెప్పారు. దాంతో నజ్రులు లాల్‌గోలాకి పరుగు పరుగున వెళ్లారు. శ్రీ మజుందార్ దగ్గర దీక్షపుచ్చుకున్నారు. ఆయన మార్గదర్శకత్వంలో యోగసాధన ప్రారంభించారు. కొంతకాలం ఆయన కాషాయ వస్త్రాలు కూడా ధరించారు. ఆయన ఏం సాధించారో, సాధనని ఏవిధంగా నిర్వహించారో సాధారణ వివేకం కలవారు నిర్ణయించలేరు. ఈ స్థితిలోకూడా కనీసం కొద్ది సంవత్సరాలవరకూ నజ్రులుకి

ఉన్నత స్థాయిలో సృజనాత్మకరచన చేయకలిగిన సామర్థ్యం ఉండేది. ఇక్కడ ఈ విషయాన్ని ముఖ్యంగా గమనించాలి.

ఆ తరువాత జబ్బు పట్టుకుంది. నెమ్మది నెమ్మదిగా ఆయన శరీరాన్నంతటినీ ఆక్రమించుకుంది. మొదట్లో ఆ జబ్బుని అంత పెద్దగా పట్టించుకో లేదు. చికిత్స చేయించుకోలేదు. మొదట్లో అయితే యోగసాధనే కారణం అనుకున్నారు. వైద్యం చేయించటం అవసరం అయింది. కాని మానసికమైన రుగ్మత లక్షణాలు కొట్టొచ్చినట్టు కనపడేవరకూ దానివేపు పెద్దగా ధ్యాస పెట్టలేదు. ఇంక నజ్రులు ఏ నియమబద్ధమైన పనికైనా సరే అయోగ్యులు అయిపోయారు.

రెండవ ఆఘాతం ప్రాణ ఘాతకమైనది ఇంకా అప్పటికి తగలలేదు. 1939లో ఈ అఘాతం తన ప్రతాపాన్ని చూపించింది. నజ్రులు భార్య ప్రమీలా దేవి జబ్బుపడింది. ఆవిడ మంచం పట్టింది. ఆమె శరీరపు అధోభాగం కదలిక లేకుండా పడిపోయింది. అదొక్కటి తప్ప మిగతా విషయాల్లో ఆమె తెలివిడితోనే ఉండేది. ఆ స్థితిలోనూ ఆవిడ తాను చేయగలిగినంత వరకూ ఇంటి పనులను కూడా చేసేది. తనజబ్బులో నజ్రులుకి ఈ ఆఘాతాన్ని తట్టుకోడం అశక్యం అయింది. మానసికంగా ఆయన ఇంకా రోగగ్రస్తులయ్యారు. ఆయన చింతకి ప్రమీల దీర్ఘరోగం ఓ కారణం అయింది. ఇప్పుడు ఇద్దరికీ సదా శుశ్రూష, చికిత్సా అవసరం అయ్యాయి. అంటే కుటుంబం మీద అదనపు ఖర్చు భారం పడ్డది.

ఈ దురదృష్టాలకితోడు, నజ్రులు ఆర్థికస్థితి అంతకంతకు బాగా చితికిపోయిందని, విచారకరంగా తయారయిందని తెలుస్తుంది. తనకాలపు కళాకారులతో పోల్చిచూస్తే తగినంత అధికంగానే నజ్రులు అంతకుముందు, కొద్ది సంవత్సరాలక్రితం జబ్బుచెయ్యడానికి ముందే ధనం సంపాదించారు. అందులో ఏం సందేహంలేదు. అయితే ఆయన లోకజ్ఞానం ఉన్నవాడుకాడు అన్న విషయాన్ని ఇదివరకే గమనించి ఉన్నాం. ఆయన ఉండకూడనంత ఔదార్యం ఉన్నవాడుకూడా! మిత్రులతో కలసి మహానిర్లక్ష్య ధోరణిలో సరదా చేసేవారు. బుల్ బుల్ మరణంతో కలిగిన దుఃఖాన్ని శోకాన్ని మరచిపోవడానికిగాను ఈ జల్సా మరింత ఎక్కువ అయింది. ఆయన ఖర్చులు ఆయన భార్య అదుపులో ఉండేవికావు. ఆయన అత్తగారు గిరిబాలాదేవి అదుపులోనూ ఉండేవి కావు.

ఇద్దరిలో పెద్దదవడాన్ని అత్తగారే ఇల్లు నడిపేది. ఆవిడ పరిస్థితిని కాపాడుతూ ఉండగలిగేది. తన సృజనాత్మక ప్రతిభా, ఆర్థికదృష్ట్యా తనకి కలిసివచ్చే రోజులు ఎన్నటికీ అదే విధంగా ఉంటాయని నజ్రులు అనుకుంటూ ఉండడం చేత ఆ వ్యవహారాలవేపు ఆయన ధ్యాస అన్నది ఎప్పుడూ ఉంచేవారుకాదు. తన ఈ విపత్కరమైన స్థితిలో మరో గత్యంతరం లేక 1939లో హెచ్. ఎమ్. వి. గ్రామఫోను రికార్డుల రాయల్టీని, 1937 తర్వాత తదితర సాహిత్య కృతులని ఆయనకి సొలిసిటరు అసీమ్‌కృష్ణదత్త దగ్గర నాలుగువేల రూపాయలకి తాకట్టు పెట్టాల్సి వచ్చింది. ఇంత విలువైన శ్రేష్ఠమైన కళాధనాగారానికి బదులు కేవలం నాలుగువేల రూపాయలు! ఈ విషాదకరమైన కథని అర్థంచేసుకోవడానికి ఇది చాలు!! అయితే గతంలో చేసుకున్న తదితర వ్యవహారాలన్నిటిలాగే నజ్రులు దీనికి తీర్మానం చేసుకోలేక పోయారు. తాకట్టుపట్టిన వకీలు దత్త కలకత్తాలో సాంఘికంగానూ, రాజకీయంగానూ ఉన్నతమైన గౌరవనీయమైన వర్గానికి చెందినవాడు. వెంటనే డబ్బు తాకట్టుకి అప్పుగా దొరికింది. అయితే అది చాలా తక్కువ. నజ్రులు చిన్న చిన్న బాకీలు తీర్చేశారు. కాని ఆ డబ్బు కుటుంబపు అవసరాలకి సరిపోలేదు. చాలా రోజులబట్టి పేరుకుని ఉన్న వైద్యపు బిల్లుల బాకీని తీర్చలేకపోయారు. నజ్రులు పరిస్థితి రోజురోజుకి దిగజారిపోతూ ఉండడం చేత ఆయన భార్యకి ఓ నర్సు ట్రెయినింగు పొందినావిడ కావల్సి వచ్చింది. ధరలు పెరిగిపోతున్నాయి. నిత్యావసర వస్తువులు దొరకటం లేదు. రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమై పోయింది.

పక్షికి రెక్కలు విరిగిపోయాయి. అయినా వేళకి అవసరాలు తీర్చడానికి చేసే ప్రయత్నాలు సాగుతూనే ఉన్నాయి. కవి ఇప్పుడు ఏ స్థిరమైన ఉద్యోగం చెయ్యటంలేదు. రాయనూ లేకపోతున్నారు. అవసరాలా అధికం అవుతూ ఉన్నాయి. ఏ కాస్తంత ధైర్యాన్ని కూడతీసుకోగలరో ఆ కాస్తంత ధైర్యాన్ని తెచ్చుకోవడానికి ప్రయత్నించారు. ఆ సమయంలో ముస్లింలీగు కాంగ్రెసుల మధ్య ఘర్షణ పెరిగిపోయింది. నజ్రులు తనకి తాను ఇష్టపడి దినపత్రికలో— [ఈ పత్రిక నిర్వహణకి ఎ. కె. ఫజులులు హక్ తిరిగి కొద్దికాలమై పూచీ పడ్డారు.] రెండు దేశాల సిద్ధాంతాన్ని వ్యతిరేకించ దలచుకున్నారు. ఈ పత్రికలో నజ్రులు రచనలు విలక్షణమైనవి. ఉద్రేకంతోనూ, గంభీరమైన ఆదర్శవాదంతోనూ నిండిఉండేవి. అయినా అవి సమంగా ఉండేవికావు. ఆ కాలానికి— దాని అవస

రాలకి తగినట్టూ వాటిలో వాడిగా సూటిగా చెప్పే గుణంలేదు. ఆ సమయంలో ఆయన రాసిన రచనల్లో శక్తిస్తుతి, రవీంద్రుడి మరణం మీద రాసిన రచనా గొప్పవి. రమారమి అన్నిరచనలూ దేశస్వాతంత్ర్యం అన్నా మానవత్వం అన్నా ఆయనకున్న గాఢమైన అసక్తిని స్పష్టం చేస్తాయి. ఈ రచనల్లో కొన్ని రచనలు ఆ తర్వాత [1945] 'నూతన్ చాంద్' సంకలనంగా వచ్చాయి. నజ్రులు స్థితి ఏం బాగులేదు. కొద్దిమంది మిత్రులు శ్రద్ధాభక్తులు, సానుభూతి ఉన్నవారు ఆయనని అంటిపెట్టుకుని ఉన్నారు. కీ. శే. కాళీపదగుహరాయ్ [తర్వాత ఈయన బెనారసులో స్థిరపడ్డారు. భారతదేశపు మహాయోగుల్లో ఒకరుగా పేరుతెచ్చుకున్నారు] కీ. శే. అమలేందు దాసగుప్త గొప్ప ఆలోచనాపరులైన రచయిత, కీ. శే. నృపేంద్ర కృష్ణ చటర్జీ మరో మంచి వ్యాసకర్త, జుల్ఫికార్ అహ్మద్ (ఇప్పుడు బంగ్లాదేశ్‌లో ఉన్నారు. సూఫీ జుల్ఫికార్ అహ్మద్ పేరుతో ప్రసిద్ధులు) ఇంకా కొంతమంది హిందూమిత్రులు, ముస్లిం మిత్రులు, కుటుంబపు కష్టాల్లో ఆదుకున్నారు. అవకాశం ఉన్నంతవరకూ భారాన్ని తగ్గించడానికి ప్రయత్నించారు. కాని వీరందరూ ఆధ్యాత్మికత పట్ల మొగ్గుఉన్నవారు. తమ తమ హిందూ ముస్లిం మత విశ్వాసాల ఆసరాగా అదృశ్య శక్తిమీద గుహ్యశక్తి మీద అభిరుచి ఉన్నవారు. శాస్త్రీయమైన వైద్యసహాయం వారి దృష్టిలో అతి స్వల్ప విషయం. ఇటు నజ్రులూ ధైర్యం కోల్పోలేదు. సందేహాస్పదమైన యోగసాధనా విధానాల్లో అధికాధికంగా ఆయన పడిపోయారు. అవి ఆయనని ఏ దరికీ చేర్చలేదు.

రాబోయే దారుణమైన విపత్తు గురించిన సూచనలను అన్వేషించవచ్చు. 1941లో నజ్రులు జనగాం (24 పరగణాలు) సాహిత్యసమ్మేళనానికి అధ్యక్షులు. ఆ సభలో శబ్దాలతో ఆయన క్రీడలాడుతూ (మిస్ట-మిస్టిసిజమ్), అర్థరహితంగా మాట్లాడ్డాన్ని చూస్తాం. "మిస్టిసిజంలో 'తీపి' (మిస్టి) ని కనుక్కున్నాను. అందులో నాకు అమృతం దొరికింది. ఆ అమృతం నా యీ ఉపన్యాసాన్ని మరింత మాదుర్యంతో నింపుతోంది. మధురం, మధురం. మధురం," తనని తాను సమర్పించుకుని, తన ఆత్మకి సంబంధించిన సర్వస్వాన్ని దేవుడి చరణాలకి సమర్పించి అన్నిటినుండి తాను ముక్తిని పొందుతున్నట్టు బోధపరిచి ఆయన చెప్పారు. ఆ చెప్పిన భాష మనోజ్ఞమైనది. అయితే వేరే లక్షణాలని సూచిస్తోంది. ఆ తర్వాత నెలలో- 1941 ఏప్రిలులో ముస్లింసమితి సమ్మేళనంలో తిరిగి ఇదే

ధోరణిలో ఆయన మాట్లాడ్డాన్ని చూస్తాం. "నా మురళి ఇంక మూగబోతే— నేనిక్కడ కవిగా మాట్లాట్టంలేదు. మీ ప్రేమాభిమానాలు పొందిన వాడిగా చెప్తున్నాను. హక్కుతో మాట్లాడుతున్నాను- మీరందరూ నన్ను క్షమించండి. దయచేసి నన్ను మరిచిపోండి. నేను కవిగా అవడానికి పుట్టలేదు. నన్ను నమ్మండి- నా పుట్టుక నాయకుడు అవడానికీ కాదు. నేను నా ప్రేమని పంచడానికి పుట్టాను. ఆ ప్రేమని తీవ్రంగా వాంఛించాను. అది నాకు లభ్యంకాలేదు. మౌన అశాంతంగంతో శుష్కమూ ప్రేమరహితమూ అయిన ఈ ప్రపంచం నుంచి సెలవు పుచ్చుకుంటున్నాను".

అయినా అప్పటికీ మానసిక స్వాస్థ్యత పూర్తిగా దెబ్బతినలేదు. ఓ సారి ఆయన రవీంద్రనాథ్‌టాగూరుకి శోకకవిత ద్వారా కన్నీటితో నిండిన శ్రద్ధాంజలి ఘటించారు. మరో సందర్భంలో 1942 ఫిబ్రవరిలో చాంగ్ కై షేక్ ఇండియా సందర్శించడానికి వచ్చినప్పుడు. కాంగ్రెసు నేతృత్వంలో భారత చైనాల సహకార విషయమై చర్చ జరుగుతున్నప్పుడు నజ్రులు ఓ కవితలో చైనా నాయకుడి రాకకి స్వాగతం పలికారు. ఈ కవిత మరీ అంత ఉత్కృష్టమైనది కాక పోయినా మంచిరచనే.

ఓ రోజు సాయంత్రం శ్యాంబజారు ఇంటినుంచి నజ్రులు మాయం అయ్యారు. మర్నాడు సాయంత్రం వరకూ ఆయన జాడ తెలీలేదు. దక్షిణేశ్వరం కాళీగుడి [శ్రీ రామకృష్ణ పీఠం ఉన్నస్థలం] పరిసరాల్లో జనసమ్మర్దంతో నిండిన మెయిన్‌రోడ్డుమీద, అతివేగంతో నడుస్తున్న మిలటరీ ట్రక్కులని ఏమాత్రం పట్టించుకోకుండా నజ్రులు నడుస్తూ కనిపించారు. ఆ ట్రక్కులు ఏ క్షణాన్నైనా ఆయన్ని తొక్కిపారవేయ వచ్చును.

చివరిసారి 1942 జూలై తొమ్మిదోతారీఖున భవిష్యత్తుని నిర్ణయించే ఆ క్షణం వచ్చింది. ఆ సాయంత్రం ఆయన కలకత్తా రేడియోస్టేషను నుంచి ఓ ప్రసంగాన్ని ప్రసారం చేస్తున్నారు. ప్రసంగం మొదలయింది. కాని అకస్మాత్తుగా ఆయన నోటిమాట పడిపోయింది. ఆయనని ఇంటికి తీసుకువచ్చే సమయానికి మానసికమైన యోగ్యతలన్నీ పోయాయి. గ్రహణం పట్టడం మొదలయింది. అది సంపూర్ణగ్రహణంగానూ శాశ్వతమైనదానిగానూ గోచరించింది. [రెండు

సంవత్సరాలక్రితం 1940 లో తలాతోకా లేని రెండు వాక్యాలు- నేను ఢాకా వెళ్తాను. గాంధీజీని కలుస్తాను. అని ఆయన అన్నట్టుగా చెపతారు].

1942లో పూర్తిగా అస్వస్థులయాక వైద్యసహాయాన్ని కోరారు. కీ. శే. డా. బి. సి. రాయ్ వెంటనే వైద్యం చెయ్యటానికి అంగీకరించారు. అయితే ఏం ప్రయోజనం లేకపోయింది. నజ్రుల్ని మానసికరోగుల లుంబినీ ఆస్పత్రిలో చేర్చారు. అక్కడ ఆయనకి కీ. శే. డా. జి.ఎస్. బోసు వైద్యం చేశారు. ఇది కూడా ఏం ఫలించలేదు. రోగం బాగా వేళ్లునాటి వ్యాపించి ఉందని డాక్టరు బోసు నిర్ణయించారు. యుద్ధం జరుగుతున్న రోజులు అవడాన్ని విదేశాలకి తీసుకువెళ్ళి చికిత్స చేయించటానికి అవకాశంలేదు. ఏరకంగానూ ప్రత్యేకించి ఏ గట్టి ప్రయత్నం చెయ్యడానికీ వీలులేక పోయింది. సానుభూతికేం కరువులేదు. కవిని, లబ్బందుల్లో పడ్డ ఆయన కుటుంబాన్నీ ఆదుకోడానికి సిసలైన ప్రయత్నాలు చేశారు. కీ. శే. శ్యామప్రసాద్ ముఖర్జీ విపత్తులో కూరుకుపోయిన కవికి సాయం చెయ్యడానికిగాను ఓ రిలీఫు కమిటీకి కొంతకాలం సారధ్యం వహించారు. తాకట్టు పెట్టినవి- అమ్మి వేసినవి- నజ్రులు సాహిత్యరచనల హక్కులకోసం, రికార్డు అయిన సంగీతపు హక్కులకోసం ఆ కమిటీ పోరాడి ఓడిపోయింది. కమిటీ పని మంద గించింది. చివరకి మూతపడింది. ఈలోగా రోజురోజుకీ నజ్రులు స్థితి పాడవుతూ వచ్చింది. 1946లో యుద్ధం సమాప్తమయాక నజ్రులు అత్తగారు- ఇంతవరకూ మొత్తం భారాన్ని వహిస్తూ ఉన్నావిడ [వ్యధా చింతలేకుండా ఇద్దరు రోగులకి శుశ్రూషచెయ్యడం అసలుపని- అందులో ఓ రోగి మంచం మీదే ఉంటే రెండో రోగి శారీరకంగానూ మానసికంగానూ రెండువిధాలా అశక్తత ఉన్నవాడు]ఇంటి నుంచి మాయమయింది. ఈ సంఘటనల ఒత్తిడిచేత బహుశా ఆవిడ చివరి విశ్రామస్థలాన్ని చేరడానికి, భగవంతుడి ఆశ్రయం పొందడానికి వివశురాలయి ఉంటుంది. ఆవిడగురించి మరి ఇంకేమీ తర్వాత తెలియరాలేదు. పశ్చిమబెంగాలు ప్రభుత్వాన్ని (స్వాతంత్ర్యం అప్పుడే వచ్చింది) ఈ పూర్తి నిస్సహాయ స్థితిలో కవికి ప్రతినెలా 200 రూపాయలు గ్రాంటు ఇవ్వడానికి ఒప్పించటం జరిగింది. 1962 జూన్ 30వ తారీఖున తాను మరణించనంత వరకూ ప్రమీల జబ్బుమనిషే అయినా ఈగ్రాంటు డబ్బుతో కుటుంబాన్ని- (కుటుంబంలో ఆమె, ఇద్దరు వయస్సు వస్తున్న కొడుకులు, నజ్రులూ ఉన్నారు)- నిర్వహిస్తూ వచ్చింది. ఈ మహనీయురాలు సదా సంఘర్షణతోనే జీవించింది. తాను 23 ఏళ్ళబట్టి దీర్ఘ

రోగంతో బాధపడుతున్నప్పటికీ ఆవిడ నజ్రులుకి చివరివరకూ సేవచేస్తూనేఉంది. సమకాలీన బెంగాలీ రచనా చరిత్రలో అతి విశిష్టస్థానాన్ని పొందడానికి ఆమె అర్హురాలు.

దీనికి పదిఏళ్ళకి పూర్వం 1952లో వైద్యసహాయపు కమిటీ ఒకటి ఏర్పాటవడం జరిగింది. నజ్రులుకి విదేశాల్లో ప్రత్యేకమైన వైద్యం చేయించటానికి మిత్రులు ధనాన్ని పోగుచేశారు. 1953 మేలో నజ్రులు ప్రమీలతో పాటు యూరపుకి బయల్దేరారు. లండనులోనూ వియన్నాలోనూ నిపుణుల అభిప్రాయాన్ని తెలుసుకున్నారు. కొంతమంది సోవియట్ నిపుణులతోనూ సంప్రతించారు. అందరూ ఏంచెయ్యడానికైనా చాలా ఆలస్యమైపోయిందనీ, చెయ్యి జారిపోయిందనీ ఏకాభిప్రాయాన్ని వెల్లడించారు. దాంతో కొన్ని నెలలలోపునే యూరపునుంచి కలకత్తాకి తిరిగి రావలసివచ్చింది. అప్పటికి నజ్రుల్ని ఆరోగ్యవంతులుగా చేద్దామన్న చివరి ఆశకూడా పోయింది.

1962లో భార్య మరణించిన తర్వాత నజ్రులు జీవితంలో ఏమంత ప్రత్యేకించిన మార్పు రాలేదు. ఆయన పుత్రులు ఇద్దరూ ఇప్పుడు పెద్దవారయారు. పెళ్ళిళ్ల అయి సంతానవంతులు అయ్యారు. కాజీ సవ్యసాచి- (ఈయనతో పాటు నజ్రులు సి.ఐ.టి ప్లాటు (కలకత్తా 44)లో ఉంటున్నారు)- తన తండ్రి కవిత్వాన్ని మహోన్నతంగా గానం చెయ్యడంలో ప్రసిద్ధి పొందారు. చిన్నకొడుకు కాజీ అనిరుద్ధుడు మంచి గిటారు వాద్యగానిగా పేరు పొందారు. ఇహ మిగిలినది- చెప్పవలసినది- జనానికి కవి నజ్రులంటే పెరుగుతున్న ప్రేమాభిమానాలకు చెందిన కథ. ఆయన పుట్టినరోజు జాతీయపర్వదినం అయింది. ఎంతో ఉత్సాహంతో గౌరవప్రదంగా జరుపుతారు. పశ్చిమ బెంగాలు ప్రభుత్వం ఉచిత వైద్య సౌకర్యమే కాకుండా గ్రాంటు రాశిని 200 రూపాయల నుంచి 300 రూపాయలకు పెంచింది. ప్రతినెలా ఓ అదనపు గ్రాంటు 350 రూపాయాలు మాజీ తూర్పుపాకిస్తాను ప్రభుత్వం ఇవ్వడానికి అంగీకరించింది. ఈ గ్రాంటు మార్చి 1971 తూర్పు బెంగాలు విప్లవం సందర్భంలో అకస్మాత్తుగా ఆగిపోయింది. బంగ్లాదేశ్ ప్రభుత్వం ద్వారా తిరిగి ప్రారంభించబడ్డాది. భారతరాష్ట్రపతి నజ్రులుకి పద్మభూషణ అవార్డు ఇచ్చి సత్కరించారు. కలకత్తా విశ్వవిద్యాలయం ఆయనకి మిక్కిలి అభిలషణీయమైన జగత్తారిణి బంగారుపతకాన్ని ఇచ్చి సత్కరించింది. 1967, 69ల్లోని పశ్చిమ బెంగాలు సంయుక్త ప్రభుత్వాలు కవి ఉండడానికి వీలుగా

ఓ భవనాన్ని నిర్మించాలని, అందులో నజ్రులు అధ్యయన కేంద్రాన్ని స్థాపించవచ్చునీ నిర్ణయించాయి. 1969లో కలకత్తా కార్పొరేషను డండం విమానాశ్రయం నుంచి నగరంవేపు వచ్చే మార్గానికి నజ్రులుఇస్లాం పేరు పెట్టింది. అయితే పూర్వపు సంయుక్త ప్రభుత్వం తనమీద వేసుకున్న గురుతరమైన కార్యాన్ని ఇంకా పూర్తి చెయ్యవలసి ఉంది. స్వలాభాపేక్ష గల వ్యక్తులవల్ల, చట్ట సంబంధమైన అడ్డంకుల వల్ల బహుశా ఆ పని అవటం లేదు. ఇందులో నజ్రులు రచనలు అన్నిటినీ సంపూర్ణంగా స్వల్పధరకి అచ్చు వేయించే పథకం ఉంది. ఈ పథకం కింద ప్రతిపాటకి నజ్రులు కట్టిన వరసనికూడా అచ్చువేయించే ఆలోచనకూడా ఉంది. ఉభయదేశాల ప్రజలూ గర్వించదగిన ఉమ్మడి వారసత్వాల్లో ఓ వారసత్వం అయిన కాజీ నజ్రులు రచనలని సంపూర్ణంగా పునః పునః ఆవిష్కరించడం, పునః పునః సంగ్రహించడం, పునః పునః సంపాదకత్వం వహించడం బహుశా బంగ్లాదేశ్ భారతదేశ ప్రభుత్వాల మధ్య మైత్రి పూర్ణమైన సహకారానికి, ఉభయ బెంగాలుల మధ్య మైత్రీ పూర్ణమైన స్పర్ధకి మంచి కార్యరంగం అవుతుంది.

# 7. నజ్రులు వీలునామా

ఇప్పుడు కళాకారుడిగా నజ్రులు ఇస్లాం జీవితం సమాప్త మైపోయినట్టు కనపడుతోంది. ఏ అద్భుతమో జరిగి ఆయన ఆరోగ్యం బాగుపడితే ఏమోమరి చెప్పలేం. సుమారు ఏభై ఏళ్ళక్రితం మొట్టమొదటిసారిగా ఆయన లోకం ఎదటికి వచ్చినప్పటి నుంచి ఆయన విలక్షణమైన ప్రతిభ తిరుగులేనిదే. ప్రజాకవిగా, జాతీయ స్వాతంత్ర్యం కోసం, మానవహక్కుల కోసం నిర్భయంగా పోరాడే యోధుడిగా, క్రమంగా గేయకారుడిగా ఎదుగుతూ ఆయన అందించిన సేవలను యోగ్యులు సమర్థవంతులూ అయిన విమర్శకులు, లక్షలాది దేశప్రజలూ అందుకున్నారు. ఆయన అందించిన సేవలు మరింత అధికమైన బాధ్యతని అధ్యయనాన్ని కోరుతున్నాయి.

సమకాలీన బెంగాలీ జీవితంలోనూ, సాహిత్యంలోనూ రవీంద్రయుగంలో- కనీసం ఆ యుగపు చివరిదశలో నజ్రులుని అనేకులు మన రెండోకవిగా పరిగణించారు. రచయితగా, సంగీతస్రష్టగా- రెండువిధాలా ఆయన గొప్పవారే. ఒక్క రవీంద్రుణ్ణి మినహాయిస్తే ఇలాంటి మేళవింపు ఇతర కళాకారులు ఎవరిలోనూ కనిపించదు. ఇటీవలి కాలంలో తదితరులైన బెంగాలీ కవుల్లో- సత్యేంద్రనాథ్ దత్త, జతీంద్రనాథ్ సేన్‌గుప్త, మోహిత్‌లాల్ మజుందారు- టాగూరుకి ఋణపడ్డప్పటికీ కవులుగా తమదైన విశిష్టతని ఏర్పరచుకోవడంలో కృతకృత్యులయ్యారు. ఏది ఏమైనా వీరిలాగా, లేక ఈ దశలోని ఏ అన్యకవిలాగా నజ్రులు ఏ విధంగానైనా టాగూరు ప్రభావాన్నుంచి బైటపడటానికి పదరచనలోనూ శైలిలోనూ ఆకర్షించే ఛమక్కులని ప్రయోగించి తన మౌలికత్వాన్ని సంపాదించాలని ఎప్పుడూ ఆశించలేదు. అలా ప్రయత్నించక పోవడమే కాదు- ప్రారంభదశనుంచి నజ్రులు టాగూరుకి- ఆ పద్ధతికి చెందినవారు కారు. దీనికి ముఖ్యకారణం తన ఆలోచనా విధానంలోనూ, పద్ధతిరీత్యానూ రెండింట్లో ఆయన పూర్తిగ భిన్నమైనవారు కావడమే. అలా అయినప్పటికీ ఇది సదా అనుకూల పరిస్థితి ఏం కాదు. ఒకటిమాత్రం వాస్తవం. ఆయన బుద్ధిజీవి కారు. తాను బుద్ధిజీవినని ఎప్పుడూ ఆయన చాటుకోనూ లేదు. ఆయన విషయంలో హృదయమే ప్రధాన

మైంది. ఆయన కవిత్వానికి మార్గాన్ని సూచించేదీ, కొలబద్దా కూడా హృదయమేః సంపూర్ణమైన దీప్తితో వెలువడ్డ రసావేశం, సహజసౌందర్యంతో నిండిఉన్న నిజాయితీ, రమారమి అపరిమితంగానూ పుష్కలంగానూ ఉన్న ఓజోశక్తి తీక్ష్ణతా నజ్రుల్ని అద్వితీయుణ్ణి చేశాయి. పాఠకులకీ, సామాన్య జనానికి ఆయన అభిమాన పాత్రులూ అభినందనీయులూ అయ్యారు.

స్వభావ దృష్ట్యా చూసినా, ఆయనకున్న దృఢమైన విశ్వాసాల దృష్ట్యా చూసినా, రెండింటి దృష్ట్యా నజ్రులు ప్రజాకవి. బహుశా ఇది లెనిను ప్రకటించిన అభిప్రాయం అని ఆయనకి తెలియక పోయినప్పటికీ 'కళ ప్రజల కోసం' అని ఆయన రచయితగా తన జీవితమంతా నమ్మారు. తాను కేవలం ఉన్నతవర్గం కోసమే రాయాలని అనుకోవటం లేదని ఆయన ఒకసారి కాదు చాలా పర్యాయాలు అతి స్పష్టంగా నొక్కి వక్కాణించారు. ఆయన స్వభావమే అలాంటిది. తన చుట్టూ ఉన్న వాస్తవాలకి మానవ పరిస్థితులకి స్పందించకుండా ఉండడం ఆయనకి చేతకాలేదు. స్వచ్ఛమైన కల్పనాశక్తి, అన్వేషణా ప్రవృత్తి, శబ్దం మీద ఆయనకున్న అధికారం, వచో చమత్కారాం, భావనాశక్తి ఒక్కొక్కప్పుడు బిగువు కోల్పోయి కళకి కావలిసిన ఆవశ్యకతలకి ఎక్కువ హాని కలిగించేవి. అయినా ఆయనలోని స్వతఃసిద్ధమైన సౌందర్యం, భావావేశపు స్వచ్ఛందతా ఎప్పుడూ సంపూర్ణమైన నిజాయితీని సూచించేవి. సంగీతరంగంలో- వ్యాపారస్థులైన యజమానుల అవసరాల వల్ల ఒక్కొక్కసారి రోజుకి పది- పదిహేను పాటలు రాసి వాటికి వరసలు కట్టవలసి వచ్చేది. యజమానులు ఆయన తన ప్రమాదకరమైన ధారాళతకి, నిర్లక్ష్యతకి బలిఅయ్యేటట్టు ఆయన మీద ఒత్తిడి తెచ్చేవారు. వాస్తవానికి ఒక్కొక్కసారి ఆయన తన ఉత్సాహంలో అసంబద్ధంగాసూ, శక్తి హీనులుగానూ, ఆలంకారికతతో ఉపదేశాలు ఇస్తూనూ కనిపిస్తారు. బహుశా అంతకన్నా అధికంగా ఒక్కొక్కసారి ఉదాత్తత నుంచి హాస్యాస్పదతకి జారిపోతూ గోచరిస్తారు. ఇవన్నీ నిజానికి ఓ ప్రతిభావంతుడి అపజయాలే. అయితే నజ్రులు తన కావ్యాల్లో ఉత్కృష్టంగా సాధించిన వాటితో చూస్తే ఇవి పరిగణనలోకిరావు. ఆయన కవిత్వంలోని ఊనికా, భావావేశం, రచనారీతిలోని పదునూ తీక్ష్ణతల ఆధిక్యతా, పదగుంఫనలోని నూతన కల్పనా తన సృజనాత్మక రచనల్లో ఫారసీ అరబ్బీ శబ్దాలను సంస్కృతం బెంగాలీ శబ్దాలను చక్కగా మేళవించటంలో ఆయనకున్న కౌశలం మొదలైనవి. ఆయన ప్రేమకి అనేకానేక

మైన సూక్ష్మ భావస్థితులు- ఇంద్రియ స్థాయినుండి అధ్యాత్మికస్థాయి వరకూ విస్తృత పరిధిలో గోచరిస్తాయి. ఆయన కవిత్వంలో తన దేశం అన్నా, సామాన్య మానవుడు అన్నా హిందూ ముస్లిం ఐక్యత అన్నా భావావేశంతోకూడిన నిమగ్నత కనపడుతుంది. అంతేకాకుండా ఆయన కవిత్వం మానవ ప్రవృత్తిలోని యావత్తు సత్యానికి సౌందర్యానికి, విశ్వమానవత్వానికి, మానవహక్కులకి ప్రాతినిధ్యం వహిస్తుంది. ఇవీ, తదితరమైనవీ నజ్రుల్ని బెంగాలీ సాహిత్యంలోని ఆ మహత్తర యుగపు ద్వితీయకవిగా స్థిరీకరిస్తాయి.

ఓ ప్రశ్న ఉదయిస్తుంది. నజ్రులు రచనలో ఏదైనా గొప్ప గాంభీర్యం ఉన్నాదా ? ఒక విషయం మాత్రం స్పష్టం. ఓ తిరుగుబాటు కవిగా మొదట ఆయన లోకం ముందుకు రావడంవల్ల నజ్రులు కేవలం తిరుగుబాటుదారుగానే నిలిచిపోలేదని చాలామంది మరిచిపోయారు. ఆయన తన తిరుగుబాటుతత్వాన్ని- ఆ పాత్రని ఎప్పుడూ కాదనలేదు. ఇదీ వాస్తవమే కాని ఆయన దురదృష్టం- మన దురదృష్టం కూడా- ఆశించిన విధంగా ఆయన జీవితం సంపూర్ణత్వాన్ని పొందలేక పోయింది. ముందుగా గుర్తించడానికి వీలువడని విచారకమైన విపత్తుల కారణంగా ఆయన కళాత్మక పివితం అతి స్వల్ప జీవితం అయింది. అదీ కాకుండా ఆయన జీవితం తీవ్రమైన ప్రేరణలవల్ల అశాంతికి వ్యాకులతకి గురి అయినట్టుగా కనపడుతుంది. తనచుట్టూ ఆవరించుకుని ఉన్న ఆ పొగమంచు నుంచి బైట పడగలిగిఉంటే బహుశా ఆయన జీవితాన్వేషణ తన సహజమైన దీప్తితో ప్రస్ఫుటితమై ఉండేది. ఈ సందర్భంలో విశేషించి 'సింధు-హిందోళ'లో సంకలితమైన కవితలను, 'ఆమార్ సుందర్! (ఓ నా సౌందర్యమా!)లో విశ్వాసం గురించి ప్రకటించిన చివరి ఉద్ఘాటనని ఉటంకించవచ్చు.

నజ్రులు రాసిన కవితల్లో పరిపక్వమైనవి సర్వశ్రేష్ఠమైనవి. మహత్తర మైనవి అని ఉదాహరించ దగినవి కొన్ని అసాధారణమైన కవితలు, 'సింధు హిందోల' లో ఉన్నాయి. ప్రధానమైన దీర్ఘకవిత 'సింధుహిందోల' పేరునే సంకలనం పేరుగా పెట్టడం జరిగింది. ఇందులో 'అనామిక', 'దారిద్ర్యం' అనే రెండు ప్రధానమైన కవితలు ఉన్నాయి. ముజఫరు అహమ్మద్ దావా కారణంగా మీరట్ జైల్లో ఖైదీగా ఉన్నప్పుడు నజ్రులు తన మిత్రుడు ముజఫరు అహమ్మదు ఇంటికి- సంద్వీపం వెళ్లారు. సంద్వీపం బంగాళాఖాతంలో చిట్టగాంగ్ తీరానికి అనుకుని ఉంది. స్టీమరుద్వారా అక్కడికి వెళ్ళవచ్చు. కవి ఆ ద్వీపానికి ప్రయాణం

చేసిన ఫలితంగా 'సింధుహిందోల' కవిత ఉద్భవించిం[illegible]డు భాగాలుగా ఉంది. మొదటిభాగంలో సముద్రాన్ని ఆహ్వానించడం ఉన్నది. కవి హృదయంలో ఉన్నట్టుగానే సౌందర్యమన్నా ఆనందమన్నా తీవ్రమైన ఉత్సాహం తెలియని దానిని పొందాలన్న వాంఛా తీవ్ర ఆందోళనా సముద్రంలో ఉన్నాయి. కవికి ఉన్న ఉద్వేగంలాంటి ఉద్వేగమూ, కవికి ఉన్న వేదనలాంటి వేదనా సముద్రానికి ఉన్నాయి. కవిత రెండోభాగంలో కవి ప్రేమనుగురించి ఉత్తమమైన దానిగా, మహత్తరమైన దానిగా భావిస్తాడు. తనను ఎడబాటుకి గురిఅయిన ప్రేమికునిగా చెప్పుకుంటాడు. "నువ్వూ అంతేనా?" అని సముద్రుణ్ణి ప్రశ్నిస్తాడు. మూడో భాగంలో సముద్రుణ్ణి ఉదాత్తుడైన ప్రేమికుడిగా చెపుతాడు. బదులు ఏమీ ఆశించకుండా తన సంపదని మానవుడికి ప్రపంచానికి సముద్రుడు ఇచ్చివేశాడు అంటాడు. ఇక్కడ సముద్రుడు ప్రియమైన మిత్రుడు. కవి అతనికి అభివాదం చేస్తాడు. (సుందర్ ఆమార్ నమస్కార్, తుమ్ కాందొ, ఆమి కాంది, కాందె మోర్ ప్రియా అహోరహ).

ఓ నా సౌందర్యమా !
ప్రణామం !
నువ్వు రోదిస్తున్నావు, నేను రోదిస్తున్నాను.
అహోరాత్రాలు
నా ప్రియురాలూ రోదిస్తోంది !

భావం అతిస్పష్టంగా తెలియటం లేదు. అయితే సాఫల్యం లభించని అన్వేషణ-చిత్రణా, జీవితమూ ప్రేమాపట్ల గ్రాహ్యతా నిస్సందేహంగా ఉన్నాయి. ఈ అన్వేషణలో సౌందర్యం విడదీయరానిదానిగా పెనవేసుకుని ఉంది. "సుందర్ ఆమార్" అన్నవి రెండూ జ్ఞాపకం ఉంచుకోవలసిన ప్రధానమైన శబ్దాలు.

రెండో విశిష్టమైన కవిత 'అనామిక' లో శాశ్వతమైన సమస్య - ప్రేమకి అర్థాన్ని అన్వేషించటానికి ప్రయత్నం జరిగింది. దీనిలో ప్రేమికులు చాలా మంది ఉన్నప్పటికీ ప్రేమ అన్నది ఒకటే అన్న విషయాన్ని గుర్తించడం అయింది. దీనిని ఈ విధంగాకూడా వ్యాఖ్యానించవచ్చు. ప్రేమ అంటే కవిగారి తాత్పర్యం కేవలం కామవాంఛే (లిబిడో). జీవనదీప్తి కాదు. స్వాతంత్ర్యేచ్ఛతో కూడిన గంభీరమైన భావోద్రేకం అని ఆయన ఉద్దేశం. నజ్రులు ప్రపంచంలోని.

వస్త్వాశ్రయ, ఆత్మాశ్రయ పక్షాలు రెండింటిని జోడించి చూపెట్టిన కారణంగా 'దారిద్ర్యం' కవిత విశిష్టమైనది. దారిద్ర్యం తనని తన దారిని త్యజించేటట్టు చెయ్యలేదనీ, సౌందర్యం పరాజయం పొందదనీ కవి ఉద్ఘాటిస్తాడు. అంతేకాదు దారిద్ర్యం విప్లవానికి నేతృత్వం వహించి అసత్యాన్ని కురూపత్వాన్ని నిర్మూలిస్తుంది.

అంచేత సందేహమన్నది రారాదు.
యౌవ్వనపు విజయాన్ని
దెశ దిశలా
సౌందర్య కన్యలు గానం చెయ్యాలి.
కురూపాలూ అసత్యాలూ
శాపానికి గురి కావాలి.
ఇంకెందు కాలస్యం-
రావే నా పరమానందమా !
సౌందర్యమా !
రావే
త్వరిత గతిని
ఓ నా ప్రకాశమా !

ఈ మూడు కవితల్లోనూ సౌందర్యాన్ని జీవితానికి అవసరమైన ముఖ్యమైన విషయంగానూ, ప్రేమ దానికి ప్రేరణశక్తి గానూ వర్ణించడం జరిగింది. ఈ విధంగా వ్యక్తిగత స్థాయిలో కవి "జీవితపు ముళ్ళబాట మీద నడుస్తున్నాడు". కాని వైయక్తిక స్థాయికి భిన్నమైన మానవ స్థాయిలో ఆయనకి సాఫల్యం పట్ల గట్టి నమ్మకం ఉంది. విప్లవం తప్పనిసరిగా వస్తుందని, దానితోపాటు సౌందర్యం, పరమానందం, ప్రకాశంతో కూడిన ప్రపంచపు మహత్తరయుగం వస్తుందని కచ్చితంగా చెప్పాడు.

ఎనిమిదేళ్ళ తర్వాత కవి తన గద్యకవిత "ఆమార్ సుందర్" రాశారు. ఈ కాలంలో ఆయన అనుభవించిన బాధ-దుఃఖం,-ఆందోళనతో కూడిన ఆయన తీవ్ర వాంఛని జీవితంలోని క్రమ పరిణామా లన్నిటిలోనూ తనను తీర్చిదిద్దిన శక్తి ఏదో అవగాహనకి రావాలన్న స్థిర సంకల్పంగా మార్చాయి. 'నవయుగ్' ని

ఎ.కె. ఫజలుల్‌హక్ తిరిగి ప్రారంభించినప్పుడు నజ్రులుని పనిచెయ్యడానికి మళ్లీ ఆహ్వానించారు. హిందూ ముస్లిం సమైక్యతకి పాటుపడడం ఈ దినపత్రిక లక్ష్యం. ఈ పత్రికలో ఆ ఉద్దేశం గురించి తన దృక్పథం ఏమిటో వ్యాఖ్యానించడానికి గాను 'ఆమార్ సుందర్'ని 17 జ్యేష్ఠం, 1352 (1945 మే నెల మధ్యలో) సంచికలో ప్రచురించారు. వాస్తవానికి ఇది విశ్వాస ప్రకటన- "Apologia pro vita sua." ఆయన జీవితాన్వేషణ గురించిన వివరణతోపాటు ఆయన జీవనదేవత ఆవిష్కరణ కూడా- (టాగూరి జీవన దివ్యత్వం) టాగూరు 'జీవన-దేవత' పద్యాల కున్న స్పష్టతా, పొందికా దీనిలో లేకపోయినప్పటికీ ఆది అసాధారణమైన కళాత్మకకృతి. అంతేకాక నజ్రుల్ని అర్థం చేసుకోవడానికి పనికివచ్చే కీలకమైన కవిత.

"నా సౌందర్యం" మొదట ఓ కథారూపంలో నాకు తట్టింది. తర్వాత సంగీత రూపంలో- రాగ వరసతో, తాళగతితో ఛందస్సుతో భావం స్ఫురించింది" అని నజ్రులు "ఆమార్ సుందర్" గురించి చెప్పారు. ఆ తర్వాత ఈ 'నవయుగ్'లో (1920లో) ఓ "సౌందర్యశక్తి" రూపంలో అతి దేదీవ్యమాన్యంగా విప్లవసందేశాన్ని విద్రోహసందేశాన్ని తీసుకువచ్చింది. దాని పరిణామం జన సామాన్యం నజ్రుల్ని అభిమానించటం మొదలు పెట్టారు. బ్రిటిషు పరిపాలకులు ఆయనని జైల్లో పెట్టారు. "ఆరోజుల్లో నేను రాసింది నాదికాదు అని నేనెప్పుడూ అనుకోలేదు. కాని అది నా "సౌందర్యపు ప్రతిభ" వల్ల ఉద్భవించింది. ఆ తర్వాత ఆయన బెంగాల్లోని పల్లెలూ పట్నాలు ఎనిమిదేళ్ళపాటు తిరిగారు. "అప్పుడు మొట్టమొదటి సారిగా నేను నా "సౌందర్యప్రతిభ"ని నా జన్మభూమి రూపంలో చూశాను. జాతీ తెగా అన్న భేదంలేకుండా మనిషిని ప్రేమించటానికే నేను పుట్టాను అన్న అనుభూతి నిరంతరం నాకు కలుగుతూనే ఉంది. అదిగో అప్పుడు నేను "యువ సౌందర్యాన్ని", "ప్రేమ సౌందర్యాన్ని" కనుగొన్నాను. ఆ తర్వాత 'సౌందర్య ప్రతిభ' నాకు "శోక సౌందర్య'గా గోచరించింది. 'అనురాగ సౌందర్యానికి ప్రతిరూపంగా నజ్రులు పుత్రుడు ఆయన దగ్గరికి వచ్చాడు. ఆ పుత్రుడులేకుండా పోగానే ఆయన ఆనందం, కవిత్వం హాసం, గానం అన్నీ వాడితోనే వెళ్ళి పోయాయి. అదిగో అటువంటిది నా శోకసౌందర్యం".

"ఎవరీ క్రూరాత్ముడైన సృష్టికర్త? శిశుసౌందర్యాన్ని నానుంచి ఎందుకు లాక్కుపోయాడు?" అని దుఃఖంతో విద్రోహంతో నజ్రులు ప్రశ్నించారు. ఆ సృష్టి

కర్తకి "ముర్దాబాద్, ముర్దాబాద్" అని ఆక్రోశించారు. ధ్యానించు, ధ్యానించు. "ప్రళయ సౌందర్యాన్ని", సంపూర్ణంగా అవగాహన చేసుకోవలసిన అవసరం ఉంది" అని ఓ మిత్రుడు సలహా ఇచ్చాడు.

'ప్రళయసౌందర్యం' కోసం నజ్రులు రోదించారు. రోదించారు. కురానుని, వేదాంతాన్ని పఠించారు. తన కవిత్వంలోనూ, తన తిరుగుబాటులోనూ 'సౌందర్యం' తన "పూర్వచైతన్య స్థితి"లో అభివ్యక్తమయింది అన్న గ్రహింపు ఆయనకి కలిగింది. ఆ సౌందర్యం ఓ మిత్రుడిలా సదా నజ్రులుతోపాటు ఉంటూనే వచ్చింది ఆయన మేల్కొని అధ్యయనాన్ని సాగించారు. ఆకాశం విడిపోతున్నట్టుగా తోచింది. "మొదటిసారిగా నేను స్వర్ణాలోకపు సౌందర్యాన్ని వీక్షించాను."

ఆ తర్వాత ఓ భయానకశక్తి ఆయనని లాగి కిందపడవేసింది. "పిచ్చివాడా! నువ్వు మాతృదేశపు ఋణాన్ని తీర్చకుండా ఎలా వెళ్ళిపోగలవు?" అని గర్జించింది దాంతో "నేను తిరిగి నేలమీదకి వచ్చాను." కవి ఎప్పుడెప్పుడు తప్పించుకొని పారిపోదామని ప్రయత్నించినా ప్రతిసారి అంత అధికంగానూ ఆయన మీద దాడి జరిగింది. ఆయన భార్యకి ఆఘాతం తగిలింది. ఆయన ధనం పోయింది. అప్పులు పీడించుకు తింటున్నాయి. ఓ అపరిచిత మిత్రుడు ఆయనకి అంతర్దృష్టిని ప్రసాదించాడు. ఆయన విచారం దుఃఖం పటాపంచలైపోయాయి. "నేను తల్లి ధరిత్రిని అమితమైన ప్రేమతో స్వీకరించాను. ఆమెను ఆలింగనం చేసుకున్నాను. బెంగాలులోని, భారతదేశంలోని బీదల స్థితిని దళితస్థితిని చూశాను." వెంటనే మాతృభూమిని తాను దాస్య శృంఖలాల నుండి విడిపించనంత వరకూ తనకి దేవుడూ అక్కరలేదు. ముక్తీ అక్కరలేదు అని ఆయన ఎలుగెత్తి చెప్పారు.

ఈ విధంగా ఆయన మాతృభూమివైపు తిరిగారు. సామాన్యమైన పువ్వుల్లో కూడా కేవలం వికసించి వాడిపోయే వాటిలోనూ ఆయన "పుష్ప సౌందర్యాన్ని" గుర్తించారు. నది, గాలి, నీలవర్ణపు సముద్రం. అన్నీ ఆయనకి తోడబుట్టినవి అయ్యాయి. అవీ తమవంతుగా ఆయనకి జేజేలు పలికాయి. ఆ తరువాత కారు చీకట్లతో భయంకరంగా భయపెడుతూ తుఫాను వచ్చింది. కనికరంతో "నేను వినాశ సౌందర్యాన్ని" అని ప్రకటించింది.

దాంతో ఆయన తన భావనాపూర్ణమైన అంతర్దృష్టిని తిరిగి పొందారు.

"సృజన సౌందర్యాన్ని" అవగతం చేసుకున్నారు. ఈ అవగాహన సంపూర్ణమైన పూర్ణత్వాన్ని ప్రసాదిస్తానంటూ వచ్చింది. అయితే ఆయన తన కర్తవ్యాల్ని నిర్వర్తించాలి. మానవ జగత్తులో పురాతనమైన ఆదిమ సౌందర్యాన్ని, పరిశుద్ధతని తిరిగి నెలకొల్పడానికి పాటుపడాలి, అని హెచ్చరించింది.

తన ఈ రచనని 'తథాస్తు' తో పూర్తిచేశారు.

ఈ విధంగా నన్రజులు తన జీవితంలోని వివిధ దశలను పునఃవర్ణించటానికి ప్రయత్నం చేశారు. ఇది ధ్యానంద్వారా ఆత్మాశ్రయపు అమూర్తవాదం నుంచి మానవవేదనకు చెందిన వాస్తవిక లక్ష్యాలవైపు- చిట్టచివరకి మానవసేవ, స్వదేశ సేవల ప్రాముఖ్యతవైపు నడుస్తూ వెళ్ళిన ఓ తీర్థయాత్రికుడి పురోగమన కథ. అయితే ఈ దశలు అతి స్పష్టంగానూ, కచ్చితంగానూ, నిర్ధారణగానూ లేవు. ధ్యానం (యోగం) అన్న ఆరహస్యాత్మకమైన వాతావరణపు దీక్ష తీసుకున్న వారికి తప్ప ఓ దశనుండి మరోదశకి వెళ్ళడం- క్లుప్తమైన "కాదు" అన్న దాని దగ్గరనుంచి బహుముఖమైన "అవును" అన్న దానివరకూ ఉన్న మార్గం అంత సుస్పష్టంగా లేదు. అయినా కొన్ని విషయాలు ఖచ్చితంగా తెలుస్తాయి. ఆయన వ్యక్తిగత జీవితంలోని కొన్ని వాస్తవాలగురించి గట్టిగానే చర్చించాం. నన్రజులు అన్వేషణ సౌందర్యాన్వేషణ. ఆ సంగతి తెలుసుకున్నాం. చిట్టచివరకి జీవితాన్ని ప్రపంచాన్ని స్వీకరించితేనే సర్వత్రా వ్యాపించిఉన్న సౌందర్యాన్ని అత్యంత సాఫల్యంతో ఆకళించుకోగలుగుతాం అని ఆయన మనకి చెప్పారు. అంచేత స్వదేశసేవకి, మానవసేవకి సర్వాధికంగా ప్రాముఖ్యత ఉన్నది. నన్రజులు వాటికే అంకితం అయ్యారు.

ఈ వీలునామా సౌందర్యం విశ్వాసాల వీలునామా మాత్రమే కాదు. ఇది ఓ మానవతావాది వీలునామా.

# ఉపయుక్త గ్రంథ పట్టిక

ఈ పుస్తకంలో సాధ్యమైనంతవరకూ నిరాలా ప్రథమ ప్రచురణల తేదీల ప్రకారం ఆయన ముఖ్యమైన రచనల గురించి చర్చించడం జరిగింది. నిరాలా మానసిక రుగ్మతకి మౌనానికి గురియైన తర్వాత ఆయనని మరి కొన్ని గద్య రచనలూ పద్యరచనలూ రెండూ అచ్చు అయాయి. ఆయన రచనలన్నీ సంపూర్ణంగా ఇంకా లభ్యంకావటం లేదు. అచ్చూ కాలేదు.

ఈ పుస్తకంలో చర్చకువచ్చిన స్మరణీయమైన సంకలనాలు :

కావ్య సంకలనాలు : సంచయన్ (సంకలిత గ్రంథం. 1955)
మరుభాస్కర్ (1957)
శేష్ సౌగాత్ (1948)

గద్య సంకలనాలు : నిరాలా రచనా సంభార్
(రెండు సంపుటాలు - ఇందులో పూర్వం అలభ్యం అయిన కవితలు కూడా కొన్ని ఉన్నాయి.

పాటల పుస్తకాలు : బుల్‌బుల్ (2వ భాగం 1952)

ఈ పుస్తకంలో యథోచితంగా చర్చకురాని సంకలనాలు :

నవలలు : బంధన్ హారా (1927)
మృత్యుక్షుధ (1930)
కుహేలిక (1931)

నాటకాలు : అలేయ (1925)
మధుమాల (1959)
ఝిలి మిలి (1930)

కవితా సంకలనాలు : (పిల్లల కోసం)
ఝుంగే ఫూల్ (1926)
సాత్ భాయీచంపా (1927)

కథా సంకలనాలు : వ్యథార్ దాన్ (1921)
రిక్తేర్ వేదన్ (1925)
శివులి మాల (1931)

అనువాదాలు : రుబాయి యాత్-ఎ-హాఫిజ్ (1930)
కావ్య అంపర (1933)
రుబాయి యాత్-ఎ-ఉమర్ ఖయ్యాం (1960)

నజ్రులు విశిష్ట కవితలు పేరుతో నజ్రులు కవితా సంకలనం ఒకటి తయారవుతోంది. సాహిత్య అకాడమీ న్యూఢిల్లీ ద్వారా ఇంగ్లీషులోనూ, ముఖ్యమైన భారతీయ భాషల్లోనూ అచ్చుకాబోతోంది.

విదేశీ భాష : నజ్రులు విశిష్ట కవితల సంకలనం రష్యనులోనూ తదితర సోవియట్ భాషల్లోనూ అచ్చయింది. రష్యను సంకలనం 1970 లోనూ, తదితరమైనవి దాని తర్వాతా వచ్చాయి.

హిందీ : రాష్ట్ర భాషాపరిషత్తు, వార్ధా ద్వారా నజ్రులు గురించిన సంక్షిప్త పరిచయమూ, కొన్ని ముఖ్యమైన కవితలు (102) అనువాదం అచ్చయింది. (పరిచయం కూర్పు - గోపాల్ హాల్దార్)

ఇంగ్లీషు : నజ్రులు గురించి, ఆయన రచనల గురించిన పుస్తకాలు, నివేదికలు :

1. వసుధా చక్రవర్తి : కాజీ నజ్రులు ఇస్లాం న్యూఢిల్లీ 1968
2. కాజీ అబ్దుల్ వదూద్ —క్రియేటివ్ బెంగాల్-కలకత్తా